# BOBBILI YUDDHA NATAKAMU

(Telugu)



*Vedam Venkataraya Sastry & Bros.,*

''ikeswarar Koil South Lane,

·tty Street, M. DRAS-1

Rs. 2/8

# బొబ్బిలియుద్ధనాటకము

కీ. శే. శ్రీ. వేదము - వేంకటరాయశాస్త్రి కృతము

విపులమగు నుపోద్ఘాతముతో ముద్రితము

మూడవ కూర్పు.

ప్రకాశకులు:

వేదము - వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4, మల్లికేశ్వరగుడి సందు, లింగిసెట్టివీధి,

మన్నడి. జి. టి. మదరాసు.



1954 [వెల రు. 2-8-0

# ఉపోద్ఘాతము

ఆంధ్రదేశమందలి గొప్ప జమీందారులలో బొబ్బిలి వారు చాల ప్రసిద్ధివహించినవారు. వీరింగూర్చి పాటలు పద్యములు నాటకములును లెక్కలేనివి రచింపఁబడినవి. అతిప్రాచీన రాజవంశమగుటచే వీరి పూర్వులచరిత్ర కొంత తెలియఁదగినది.

## పూర్వుల చరిత్ర

వీరి పూర్వులు కాకతీయులకడ సేనాపతులుగా నుండిరి. కాకతీయగణపతి చక్రవర్తి (క్రీ॥ శ॥ 1198–1263?) కాలమున చేయూరు పోలిరెడ్డి కుమారుఁడు చెవిరెడ్డి యనువాతఁడు తన పరాక్రమముచే (బేతాళుని సాధించినాఁడని కథ యొకటి గలదు) చక్రవర్తి కటాక్షము సంపాదించి సామంత రాజాయె నట. ఈతనికి బేతాళనాయకుఁడని ప్రసిద్ధి యేర్పడినది. అనుమనగల్లు రాజధానిగా నీతఁడు కొంత సామంత రాజ్యమేలెను. ఈతనివంశమువారే రేచర్లవారైరి. వీరివంశము 'రేచర్ల'దగుట కును కథ యొకటి గలదు. రేచర్లవారికి ముప్పదియాఱు తెగల వారి కీతఁడు మూలపురుషుఁడు. వీరిలో బొబ్బిలివా రొకరు. ఈబేతాళనాయని వంశమువారు కాకతీయుల పతనానంతరము మొదట ఢిల్లీసుల్తానులకు సామంతులైరి. కాపయనాయకుఁడు ఒక వెలుగు వెలిగి ఢిల్లీవారికి తిరుగఁబడిన కాలమున నల్లగొంద

ప్రాంత పర్వతప్రదేశమున వీరు స్వతంత్రులైరి. తర్వాత గుల్బర్గా బహామనీ సుల్తానులకు లోఁబడిరి. అటువెనుక కొంతకాలము విజయనగరము రాయలవారికిని గజపతులకును మాఱిమాఱి తుదకు విజయనగరమువారికే సామంతులుగా నుండి కడకు ఢిల్లీ పాదుషాకు లోఁబడిరి.

ఈ యిడుదొడుకులలో వీరికి మొదట (1) పిల్లలమఱ్ఱి, (2) ఆమనగల్లు, తర్వాత (3) రాచకొండ, (4) దేవరకొండ నగరములు రాజధానులైనవి. 13-వతరము యాచమనాయని సంతతివారు వెలుగోడు నాక్రమించుటచే (5) వెలుగోటి వారైరి. దేవరకొండనుండి పెదరాయఁడను నామాంతరముగల నిర్వాణరాయఁడు (15-వ తరము) వెలగోటికి వచ్చెను. 20-వ తరములో నేర్పడి 23-వ తరములో వీరికి (6) వేంకటగిరి రాజధాని యైనది; అది మొదలు వీరందఱికిని వేంకటగిరివారనికూడ ప్రసిద్ధవ్యవహారము కలిగినది,

## బొబ్బిలి శాఖయొక్క చరిత్ర

ఈపద్మనాయకుల చరిత్ర ఇంకను పూర్తిగా శోధించి ఎవ్వరును రచింపలేదు. వెలుగోటివారి వంశావళి మొదలైనవి కొన్ని గలవు. వీనిలో పరస్పర విరోధములు కనఁబడుటచే కుదురుపాటు తక్కువగానున్నది. విశాఖపట్టణముజిల్లా మాన్యువల్‌లో నిట్లు కలదు. క్రీ॥ శ॥ 1652 లో శ్రీకాకుళము పాలించుచుండిన నవాబు షేకుమహమ్మద్‌ఖాఁ అనువాఁడు ఈజిల్లాలో పర్యటనమునకు రాఁగా అతనితోకూడ పెదరాయఁ

డను వెలమ వీరుఁడును ఆతనికి పోటీగా మాధవరాయఁడను నొక క్షత్రియుఁడునువచ్చిరి. పెదరాయని శౌర్యపరాక్రమము లకు నవాబు మెచ్చి ఆతనికి నేటి రాజాముసీమ నిచ్చెను. పెద రాయఁడు ఆసీమలో నొకచోట కోటకట్టుకొని దానికి తనపోష కుని మీఁది కృతజ్ఞతచేత ఆతనిపేర (షేర్) బెబ్బులి యని పేరు పెట్టుకొనెను. ఆబెబ్బులి క్రమముగా ఉచ్చారణలో బొబ్బిలిగా మారినది. పెదరాయని యుద్ది విజయనగరమును సంపాదించెను. అది మొదలుగా ఈ రెండుకుటుంబములకును మనస్తాపములు పోటీలు యుద్ధములు జరుగుచునే వచ్చినవి.

*ఈ పెదరాయఁ డెవఁడో తెలియుట లేదు. ఇదివర కున్న బొబ్బిలివారి వంశచరిత్రలో 9-వ తరము ధర్మానాయని సంతతి వారు రావువారైరని కలదు. 1821 లో శ్రీరాజా రాయడప్ప రంగారావుగారు అప్పటి జిల్లాకలెక్టరుగారికి వేంకటగిరి వంశము లోని శ్రీ సర్వజ్ఞసింగములుగారి పౌత్రుఁడగు ధర్మారావుగా రీరాజ్యమును సంపాదించిరని వ్రాసియున్నారట! 15-వ తరము నాటికి వేంకటగిరిపేరే లేనందున, 23-వ తరము నాటి కియ్యది రాజధాని యైనందున, 15-వ తరము పెదరాయనికి నూటికి మించిన యేఁడులకు దరువాత నున్న మఱియొక పెదరాయఁడు బొబ్బిలి రాజ్యము నాక్రమించియుండు నని యొప్పక తప్పదు. అట్టి పెదరాయఁడు వేంకటగిరి శాఖలో యాచశూరుఁడని నామాంతరముగల 20-వ తరము పెదయాచమనాయఁడని చెప్ప వచ్చును... లేదా 9-వ తరము ధర్మానాయఁడుగారి సంతతి

*[వెల్లాల, అవధానము, పండితులు రచించిన వెలుగోటివారి వంశ చరిత్రను చూడుఁడు.]

వాఁడై 17 వ శతాబ్ది మధ్యమున మఱియొక పెదరాయఁడు తమ పూర్వు లార్జించిన కృష్ణానదీప్రాంతము నేలుచు షేర్ మహమ్మద్ వెంట బొబ్బిలికి పోయియుండిన నుండవలయును.

బొబ్బిలివారికిని విజయనగరము వారికిని విరోధములు ఎప్పుడు ప్రారంభమైనవో చెప్పలేము. కాకతీయుల కాలము నుండియు వెలమలకును క్షత్రియులకును యుద్ధములు జరుగుచుండెడివి. ఓఢ్ర కళింగాది దేశ భాగములను కాకతి సేనానులుగా వెలమలు కొట్టినవారే గదా. ఒకపాటి వైరము అప్పుడే ప్రారంభమై యుండును. తర్వాత క్రీ. శ. 1360 లో నొక ఘోరము జరిగినది. ఐదవతరము సింగమనాయని కాలమున కాపయనాయకునికి తిరుగఁబడి రాచకొండ కొండవీడు రాజ్యము లేర్పడినవి గదా. సింగమనాయఁడు చాల పరాక్రమము చూపి, కాపయనాయకునిసైతము మెదిరించెను. ఈతనికి జల్లిపల్లి క్షత్రియ రాజులు శత్రువులై ఈతని బావమఱదిని చింతలపల్లి సింగమనాయకుని చెఱపట్టిరి. అంతట సీతఁడు జల్లిపల్లి మీఁదికి దండెత్తి పోఁగా ఆక్షత్రియులు తంబళబొమ్మజీయఁ డను మహామాయావిచేత మోసముగా నితనిని చంపించిరి. అందులకు సింగమనాయని కొమారులు అనపోతానాయఁడును మాదానాయఁడును పగబట్టి జల్లిపల్లిని కూల్చి చిత్రవధ గావించి శత్రురక్తముతో పితృతర్పణము చేసి కసి తీర్చుకొనిరి. ఇది బహుశః 1360 - 1384 లో జరిగియుండును. అది మొదలు తెలంగాణములో వెలమలు అనన్యప్రభువులైరి. రాజ్యలోభమే ఈ వైరములకు మూలకారణము.

వీరి కులముంగూర్చి వెలుగోటివారి వంశచరిత్ర పీఠికలో నిట్లున్నది.—"వీరు నాల్గవవర్ణములో నత్యుత్తమమైన పద్మనాయక కులమువారు. ఇందుఁ బద్మనాయకుఁ డనఁగాఁ బద్మబాంధవుండగు సూర్యుండు-ఆకులమువారనఁగా సూర్యవంశమువారని యభిప్రాయము; లేదా పద్మనాయకుండనఁగా పద్మపతి యను రాజు...వీరు శూద్రులలోఁ జేరిన క్షత్రియు లగుట నిజము....కాఁబట్టి వీరు తొలుత క్షత్రియులే యనుటకు సంశయము లేదు....కాఁబట్టి సచ్ఛూద్రులమని చెప్పుకొనుటయె సమంజసము...."

## బొబ్బిలి ముట్టడి : కథలు - చరిత్రము

బొబ్బిలియుద్ధమునాటి చరిత్రయంతయు మనకు ఆంగ్ల గ్రంథములవలన కొంత తెలియవచ్చుచున్నది. ఆరమ్ అను సమకాలికాంగ్ల సేనాధిపతి 'హిందోస్థాన్ చరిత్ర' యను గ్రంథమున బొబ్బిలివీరులపౌరుషమును వివరముగా వర్ణించి యున్నాఁడు. దాని నుండియే 'మద్రాస్ మాన్యుఅల్' మొదలైనవానిలో చరిత్ర రచితమైనది. కొంత తర్వాత వ్రాయఁబడినవి రంగరాయ చరిత్రమను పద్యకావ్యమును బొబ్బిలిరాజుకథ యను జంగాల బుఱ్ఱకథయు. వీనిలో మొదట రంగారాయ చరిత్రమందలి కథాసంవిధానమును చూచి, తర్వాత 'బుఱ్ఱకథ'ను చదివి చరిత్రతో పోల్చి చూచిన విశేషములు తెలియును.

### ౧ రంగరాయచరిత్ర కావ్యము.

దిట్టకవి నారాయణకవి ప్రణీతము. ఇది ప్రబంధ శైలిలోనున్నది. ఇష్టదేవతాప్రార్థన కృతిపతి వంశావతారాదుల వెనుక

కథాప్రారంభము. కృతిపతి 'విరియాలగోత్ర పవిత్రమూర్తి' మల్రాజు రామరాయలు, 'వెల్లముకొండ ధరాధిరాజు.'

కథాప్రారంభము - దేవేంద్రుడు కొలువుతీరి యుండగా ఆకస్మికముగా మహాశూరులు కొందఱు, యుద్ధములో భూలోకమున మరణించినవారు, అమరావతికి వచ్చి రంభాదులతో విహరించుచుండు నాశ్చర్యకరవిషయమును గూఢచారు లాతనికి తెలుపుదురు. 'పురాతన నహుషాదికృత్యములు తద్దయ దలంపుచు ఖిన్నచిత్తుండై 'యున్న దేవేంద్రుని కడకు ఎచ్చటి నుండియో వచ్చి నారదుండు, వారు బొబ్బిలి వెలమవీరులని వారి చరిత్రమును చెప్పును.

'కలవు ధరిత్రియందు సరకారు లనేకము, లందులో శ్రీకాకుళము కళింగ సంజ్ఞిత మగుంతతం జేరొ్కను,నందంగల్గు బొబ్బిలి యను నొక్కపట్టణ మభీష్టతమ ప్రతిభానుభావమంజుల మగుచుండ ధరారమణిసొమ్ముల పెట్టియనామహోన్నతిన్

'...అభినవ విక్రమార్కావతార
సారదోస్సార నిస్సారి తారి వీర
వార దుర్వార గర్వాంధకార గిరులు
వెలమ దొర లొప్పుచుందు రవ్వీటియందు.'

'అప్పురంబున కధీశ్వరుండు, రంగరాయావనిజాని ఆహావరంగ జితారిమాని.'...'పద్మనాయకులకుం మాన్యాది పీఠస్థులై, శ్రీ నిర్వాహకులైరి, వెంకటగిరి శ్రీ రావురాజా

గ్రణుల్.' అనపోతవిభుఁడు - కృష్ణా నదివఱకు గెలిచెను. 6 పురుషుఁడు. తర్వాత 'సర్వజ్ఞ సింగయ దశమపూరుషుండు.' 15 వ పురుషుఁడు పెదరాయఁడను నిర్వాణరాయఁడు. మొగలాయీ ప్రభువులకై జయింపవచ్చిన షేర్ మహమ్మదు ఖానుతో నీతఁడును (క్షత్రియ) మాధవవర్మయుఁ బోయిరి.

'వీరిలో బెద్దరాయ పృథ్వీవరునకు

సీ. 'సంస్థానము లొసంగు సమయంబునం దె వం
శక్రమంబుగను, రాజాబహాదరు
మొదలైన బిరుదులు ముఖ్యమౌ తెల్లజెం
డా నవుబత్తును ఢక్కయాది
గలిగిన రాజచిహ్నా లొసంగఁబడె; ను త్త
రపు సరకారులం దపుడు పోరి
సందడి యడఁగఁగా జనపతికూడ వ
చ్చిన యట్టి లింగప్ప యనుసుతునకుఁ

గీ. దనకు సమకొన్న ఈరాజ్యమును నొసంగి
తండ్రి తాతల నాటిదై తనరు వేంక
టగిరి రాజ్యమ్మునకును దిరుగ జనియెను
బెద్దరాయ వసుంధరావిభువరుండు'

లింగపరాయఁడు - ఇతనికి శ్రీకాకుళము నవాబుగారు 'ఇచ్చె రంగారావక ఘనపౌరుషాఖ్యఁ గులజమ్మెపాలచిహ్నాంబుగ.' అతనికి వెంగళరావు దత్తపుత్త్రుఁడు. ఇతని సుతుఁడు రంగారావు. ఇతని సుతుఁడు రాయడప్పరంగారావు. ఇతని దత్త

పుత్త్రుఁడు గోపాలకృష్ణరంగారావు. ఇతఁడే బొబ్బిలి రంగా రావు. ఇతని తమ్ముఁడు వెంగళరావు.

మున్ను చెప్పఁబడిన మాధవవర్మ సంతతిలోని

'భాగ్యసంపన్నుఁడగు పూసపాటి విజయ
రామరాజను నొక దొడ్డ రాచబిడ్డ
యనుదినంబును రంగరాయక్షితీంద్రు
పెంపు మది నించుకేని సైరింపలేక;'

'ఇట్లున్నంత...'

'ఢిల్లీ పాదుషహానియోగమున రూఢిగ రాజరాజౌ నిజా
మల్లీ పేరటి మేటిసాహెబు సుబా...గళింగంబు...
...ఘనుఁ డాఫరాసునకు మూసా బూసి యన్వాని క
త్యుల్లాసంబున నాధిపత్య మొసఁగగ'

'కళింగసర్వస్కరుభార మిచ్చి', 'గొన్నియుపాయనంబులు నుద్ధతుల ముల్కు (ఉద్దత్-ఉల్-ముల్క్) గజఫరజంగు సిఫహాసర దారుగా రనియెడి దొడ్డకితాబులు నొసంగి యతనికిం దగిన సంగడిగా హైదరుజంగనియెడు యవనపుంగవుం బ్రధానత్వంబు నకుం గుదురు కొల్పి...ఖజానా నింపు డింపొందగగ' అని చెప్పి పంపెను.

అంత బుస్సీ మొదలైనవారు రాజమహేంద్రవరము కోటిలింగాలకడ విడిసిరి. శ్రీకాకుళములోని జమీందారులను పిలిపించిరి. రంగారాయఁడు దక్క మిగిలినవారు వచ్చిరి. (ఇక్కడ ఆయారాజులరాక చక్కఁగా ప్రబంధరీతిని వర్ణింపఁబడినది.)

తర్వాత విజయరామరాజు హైదరుజంగునకు రాయబార మంపి, అతఁడు సుముఖుఁ డగుట నెఱింగి 'బొబ్బిలిగడీపై డించు దుశ్చేష్టతోఁ' ఆతని కైవస మొనర్చుకొని, బొబ్బిలిని కూడ తమకే యొసంగిన నాతనికి 12 లక్షల రూపాయలు ఉపాయన ముగా (లంచముగా) నిత్తు ననెను.పిదప నిర్వురును ప్రమాణము లొనర్చుకొనిరి. తర్వాత

'మూసా బూసీవారి దు
బాసీ లక్ష్మణసమాఖ్యుఁ బరగు నతం డు
ద్భాసిత మనస్కుఁడై తా
నా సాహెబు పన్నుగడకు ననుకూలించెఁ.'

ఇంతలో రంగారాయఁడు ఈ విషయముల నెఱింగి బంద రులో నుండు తమ హితైషి మద్దాల రెడ్డినాయని సిఫారసుతో గోరుందొరకడకు బంతెన బుచ్చన యను నాతనిం బంపెను. మార్గమున నాతఁడు రాజుచూపోపమిని తెలిసికొని హైదరు జంగును చూచి అతని 'ఖరడా జవాబును' గ్రహించి బందరు చేరును. రెడ్డినాయని మూలమున గోరుందొరదర్శనము చేసి విషయమెల్ల తెలుపును. ఆదొర 'విస్మయంబంది' 'ఇది యధర్మం బుఁ దెరవు' "నిరపరాధులపై నిట్టి పరుసఁదనపుఁబని యసంభావ్య'మని 'తగును త్తరంబు లెల్లను లిఖియించియిచ్చి' రావుమంత్రి బుచ్చన వెంట మర్తెను (Martin) అను జాతివానిని బుస్సీ కడకు పంపెను.

ఇంతలో లష్కరు రాజమహేంద్రవరమునుండి పెద్దాపురమునకు పోయెను. అచ్చట బుచ్చనయు మర్తెనును బుస్సీకి సకల విషయముల నెఱింగించిరి. బుస్సీ హైదరుతో కలసి మాటలాడి బొబ్బిలి మాని శ్రీకాకుళమునకు పోదమనెను. తనకిష్టము లేకపోయినను హైదరు అప్పటికి ఒప్పుకొనెను. ఇంతలో విజయరామరాజు హైదరును లోఁబఱచుకొని యాతనికి బొబ్బిలిపై రోషావేశ మెక్కించెను. అంత హైదరు రంగారావును రమ్మని జాబువ్రాసి హర్కారులచేత పంపెను. రంగారాయఁడు వారిని మర్యాదలుచేసి వినయపూర్వకముగా జవాబువ్రాసి దామెర్ల ధర్మయ్యచేతఁ బంపెను. ధర్మారావును చూచి హైదరు.

"'ఏలా రాఁడు భవత్ప్రభుం డిటకు, రాఁడేనిఁ జుఱీఁ మేల్గడీ
ఖాలీసేసి యథేచ్ఛ నేగుమని మీఖామందుకుఁ వ్రాయు మీ
వాలాయంబుగ నిప్పుడీ'వని జ్వలద్వైశ్వానరుండో యనం
జాలాకోపముతో డమండి పడి పాశ్చాత్యుండు పల్కెన్వడిఁ."

ధర్మారా వందులకు చాల వినయముతో సమాధాన మిచ్చెను. రంగారావు రాకుండుటకు కారణ మిట్లు చెప్పెను.

'రాయని వారివద్ద నపరాధ మొకించుకయేని లేదు, ము
న్నేయిటువచ్చి మిమ్ము రమణీయగతిం బొడఁగాంచుయుక్తికిఁ
మాయకుఁడైన యస్మదరిమానవనాయకుఁ డిందు గల్గుటఁ
రాయడి పుట్టునన్న విధురంబగు బుద్ధిని రామి తక్కగఁ.'

హైదరాతని ప్రార్థనలను వినక ధిక్కరించి కోట వెడలిపొమ్మని గట్టిగా పలికెను. ధర్మారాయఁడు వెడలి వచ్చి ఇదంతయు

చెప్పఁగా రంగారాయఁడు 'ధైర్యావసథాయమాన హృదయాంబురుహాఖండయి' యుండెను.

తర్వాత హైదరుజంగు బుస్సీని మెల్లగా తనకనుకూలుని గావించుటకై రంగారయనితో తాను జరిపిన రాయబారాదికములను చెప్పక బందరువారి సలహాప్రకారము కప్పము గ్రహించి పోదమని పలికి మెల్లగా బయలుదేరి ఒడ్డాదిమీఁదుగా దేవులపల్లికిపోయి దండు విడియించెను. ఈ విషయ మెఱింగి రంగారావు మరల చెలికాని వెంకయ్యను చిట్టెల రామయ్యను హైదరు కడకు రాయబార మంపెను. హైదరుజంగు పట్టినపట్టు విడువక వారిని కోటవెడలి పొమ్మనెను.

అంతట రాయఁడు యుద్ధసంసిద్ధుఁడై రాజాముకోట కడ తాండ్రపాపయ్యను కాపుంచెను. పరాసులింతలో బయలుదేరి బొబ్బిలి చెంత నొక తటాకతీరమున విడిసిరి. విజయరామరాజును శత్రుభయముచే పదిలమైనచోట విడిసెను. అప్పుడు తటాలున బొబ్బిలికోటలో నౌబత్తు మ్రోఁగఁగా విని అదరిపడి హైదరుజంగు, నౌబత్తు మాని కోటవదలి పొమ్మని హాసనల్లీఖానుని మూలముగా రాయబార మంపెను. రంగారాయఁడు హాసేనాలీని చాల గౌరవించి నౌబత్తును తమకు ఢిల్లీపాదుషా యొసంగెననియు, తమకోట తాము దుర్నీతిగా నాక్రమించుకొన్నట్టిదిగాదనియు, నది తమ కాణాచియనియు, ఎన్నియాపదలు వచ్చినను తాము వలసలుపోయి యెఱుంగమనియు చెప్పి యిట్లనెను—

'ముమ్ము గెలిచి గాసి మాకోటఁ జేకొన
నేరఁ డెంతయేని వీరుఁడైన,
శూరధర్మమునకుఁ జొప్పడు నగురీతి
బారు దీర్చి నడచి పోరు టెందు.'

... ... ...

'అదిగాదేని యతం డొసంగు ధన మెంతో నంతకే నిబ్బడి
చ్చెద, నాదాచకోమారుఁ డేలుపురి తత్సీమాస మేతంబుగా
మదధీనం బొనరింపఁ డెంతయును ధర్మప్రక్రమం బంచు''

అందులకు హాసేనాలీ 'పదార్థపుటాసచే' 'హైదరు బాస' సల్పెననియు 'తప్పఁ'డనియు, ఒక్కనెల 'అంతట నంతట నుండి తేని యే నినుఁగొని వచ్చి క్రమ్మఱను నిల్పెద నీదగు కోటలోన' 'పాటి దప్పిన దుర్గుణప్రాణి యైనవానితో నీకు జలమేల, వలదు వలదు, తొలఁగి చనుటయె మిన్నుల సంతోష మనుచు' బోధించెను.

రంగారాయఁడు యుద్ధము చేయకుండుట తమవంశమునకు దుష్కీర్తి యని

'ధృతి సర్పింతుఁ బదార్థ మెంతయిన నిర్దేశించినం; బైనసం
గతములొప్పురుష హానికృత్యములు-దుర్గం బిచ్చి పొమ్మంట, నౌ
బతుజాలించు మటంట – వీనికి నొడంబాటొందుటల్లేవు మా
మతిలోఁ గీర్తి ధనాఢ్యులెందు బిరుదుల్గాయింతురే యుర్వరన్

'అర్థమెంతైన నిచ్చెద, మంత మీఁద
నొడఁబడఁడ యేని ప్రాణము లొడ్డుచువార,

మింతయే కాని పౌరుష హాని కొప్పి
వెడల నోపము దీనికి నడల, ననుచు,

చెప్పఁగా హుసేనాలిఖానుఁడు వెడలిపోయి హైదరుజంగునకు ఇట్లు హితోపదేశము చేసెను.—

'వారలు ధర్మమార్గమెడఁబాయక పైక మనేకమిచ్చుచు
న్నారమనా యనాదరమున న్గ్రహింపక పందువంటి సం
సారులయింటిమీఁది కతిసాహసవృత్తిని జంప నేగు దు
ర్వారతరాఘు మిప్పుడ యవారితమై నినుఁజుట్ట ముట్టదే?'

అప్పు డందఱును అమాటయే పలుకఁగా విజయరామరాజు

'మీరు సరకారు, తా జమీందారుఁ డరయ,
నెదిరి సత్వంబు తన సత్వ మెఱిఁగికొనక
హుంకుము చొప్పున నడవక వికటమతిని
దిరుగఁబడి యుంట సాసంబుఁ దెలిఁగె యనియె.'

ఈమాట యాధారముగా హైదరు, రాజు, దుబాసిలక్ష్మయ్యయు బుస్సీకడ కేఁగి వివరములు చెప్పక 'రాయఁడు తిరుగఁబడి యున్నాఁడు' అనఁగానే బుస్సీ యుద్ధమున కాజ్ఞ యిచ్చెను.

రంగారాయఁడు కోటను తన కొమారుని చినవేంకటరాయని తమ్ముఁడగు వెంగళరాయని కొప్పగించి చెలికాని వెంకయ్యను అంతఃపురరక్షణార్థమేర్పఱచి, దానము లనేకములు చేసి యుద్ధమునకు సంసిద్ధుఁడై మరల నొకరాయబార మంపెను. హైదరు మరల మండిపడి యుద్ధమున కాజ్ఞయిచ్చెను. ఘోర యుద్ధమాయెను. నల్లులు ఎండలో చచ్చినట్లు యుద్ధవీరులు

తుపాకుల దెబ్బలకు చచ్చి రాలిరట. కొంత యుద్ధానంతరము సూర్యాస్తమునయమగుడు కవి ప్రకృతివర్ణనకు ప్రారంభించును.

మఱునాఁడు తెల్లవాఱఁగా రంగారాయఁడు 'అందఱం బిలిచి' '...యసమానశక్తియిబ్బలము పెంపు, తెంపు సైరింపరా దింకఁ దెగువ జేసి, మనల శుద్ధాంతకాంతా ప్రమాపణంబు, నెఱపి యభిమానధన మె మన్నింప లెప్స' అని.

'చెలికానివంశసంభవు
నలఘుతరస్థైర్యు ననిచె, నవరోధవధూ
కులకంఠనాళకృంతన
కలనాదారుణవితానకఠినత నెఱపఁ.'

'రాయమణి రాణి తన కుమారాగ్రయాయి
నపుడు కొండొక దాదికి నప్పగించెఁ,
గోట వెడలించి బ్రతికించుకొమ్మటంచు
నట్లు గావించె నద్దాయి యడలు వొడమి.'

'మఱియు నారాయమన్నిని మానవతియుఁ
బాణితలమున శాతకృపాణిఁ బూని
దానిచే మేను దొరఁగె మద్వైరివంశ
మకట నిర్వంశమగుఁ గాక యని శపించి'

వెలమ లొక్కనూఱెండ్లస్త్రీలు శిశువులు ఆత్మహత్యగావించు కొనిరి. తర్వాత రంగారాయఁడు రణరంగమున ప్రవేశించి లెక్కలేనివీరు లెదుర్కొనఁగా రెండుచేతులతోను యుద్ధముచేసి లెక్కలేని గాయములచే శరీరమంతయు నెత్తురుముద్ద వలె కాఁగా వీరస్వర్గమలంకరించెను.

బాలుని కొనిపోవుదాదిని సిపాయీలు పట్టుకొనిపోయి బుస్సీ యెదుట నిలువఁబెట్టఁగా నతఁడు కరుణతో వారిని కాపాడెను. రంగారాయుని మరణానంతరము వెంగళరాయఁడు లష్కరు చీకాకుపడునట్లు యుద్ధరంగమున ప్రవేశించెను. విజయరామరాజు, కాకర్లపూడి జగన్నాథరావు మొదలైనరాజులతో కలిసి వెంగళరాయనిమీఁదికి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. హైదరు భయపడి తనసైన్యమును రాజునకు బాసటగా బంపెను.

'వెంగళ నృపాలమణియు నిజాంగలతిక
గాయముల పట్టుగా మహోగ్రాజియందు
ఖానుసాహేబు డేరాకు గదియనడచి
చేర్చె నిల మేను ప్రాణావశిష్టుఁడగుచు.'

అప్పుడిదంతయు చూచి బుస్సీ 'చాలనిందించె హైదరుజంగుఁ బిలిచి, యిట్టి దురవస్థ నినుఁగూర్చి పుట్టెననుచు.' వెంగళరావుంగని,చాలమన్నించి కాపాడెను. విజయరామరాజు వెంగళరావుతో 'మీవారందఱు చావఁగా నీవేల బ్రదికియున్నా' వనఁగా 'నీకు దైవము తగినశిక్ష చేయునులే' అని యతఁడు బదులు పలికెను.

తర్వాత విజయరామరాజు తనకోరిక నెఱవేరినందులకు చాల సంతోషించి బొబ్బిలి పట్టము గట్టుకొనుటకు తగునేర్పాటులు చేసికొనసాగెను. ఇంతలో తాండ్ర పాపారాయఁడు తెల్లవాఱుజామున 'పులిపులి' యని యఱచి నిద్రపోవుచున్న రాజును లేపి చిత్రవధచేసి చంపెను. రాజు సిబ్బంది మొత్త

ముగా నాతనిమీఁదబడి ఘోరయుద్ధము చేసి చంపిరి. హైదరు జంగు తక్క మిగిలినవారందఱును రాజు చావునకు సంతో షించిరి.

బుస్సీ వెలమల సాహసమునకు మెచ్చి వెంగళరావునకు కొత్తపల్లిసీమ మొదలుగా కొన్నిరాజ్యము లిచ్చి హైదరాబాదునకు పోయెను. వెంగళరాయఁడు బొబ్బిలి రాజాఖ్యులతో కొత్తపల్లి సీమ పాలించుచుండెను.

౨ జంగాల పాట (బుఱ్ఱకథ)*

బొబ్బిలికోటకు ప్రభువు రంగారాయఁడు. అతని తమ్ముఁడు వెంగళరాయఁడు. విజయనగరపు రాజు విజయరామ రాజు. 'వెంగళరాయఁడు బావమరదయా పాపారాయఁడు.' 'రంగారాయడు బావమఱది ధర్మరాయుండు' 'కోటలకంతయు పోరుసింహము పాపారాయుండు.' వీరి సాయముతో రంగా రాయఁడు 'విదురునివలె నీతిమంతుఁడై' బొబ్బిలి ఏలుచుండెను. 'ఆలోచనలో దొడ్డవాడయా విజయరామరాజు'. కోళ్లపందె ములవలన క్రోధము వహించి బొబ్బిలివారిని మట్టువెట్టుటకు రాజు తగినసమయమున కెదురుచూచుచుండెను. ఇంతలో,

'పుదుచ్చేరి యేలెటివాడు ప్రాంచి దొరగారు
గోలకొండ నవాబువద్దకు పరమానాదేను
కళింగరాజ్యం కటకందాక బూచికి అములాయె,
గోలకొండకు ప్రయాణమాయెను బూచీ దొరలూదా,

* ఇది బజారుముద్రణము, సంస్కరింపఁదగినది.

షుందుగుండు సామానులతోటి ప్రయాణమాయేను,
లక్షా డెబ్బది నాలుగువేలదళములు ప్రయాణమాయేను.'

బుస్సీతో నైజాము హైదరుజంగును దుబాసి లక్ష్మయ్యను పంపెను. బుస్సీ చోడవరము, పిఠాపురము, పెద్దాపురము మొదలైనవి చూచి రావులచెలువుకడ విడిసి విజయరామరాజును భేటికి రమ్మనివ్రాసెను. అట్లే బొబ్బిలికిని వ్రాయించెను. బొబ్బిలివారు బదులు వ్రాయలేదు. లక్ష్మయ్య మరల నొకజాబు వ్రాసెను. దానికిని రంగారాయఁడు బదులీయలేదు. రెండుదినములాలోచించి విజయరామరాజు స్వయముగా బొబ్బిలివారికి జాబులు వ్రాయించెను. వెంగళరాయఁడు ఆజాబులను తెచ్చినవారిని అవమానించి పంపెను. విజయరామరాజు ఆగ్రహపరవశుఁడై బొబ్బిలి వారిపై దెబ్బతీయుటకు సంకల్పించి గొప్పనజరులతో బుస్సీదర్శనమునకు పోయెను. బొబ్బిలివారు రాలేదు.

అట్లు వచ్చిన విజయరామరాజును చూచి బుస్సీ సంతోషించెను. సమయమెఱిఁగి రాజు బొబ్బిలికూడ తనకే ఫర్మానా వ్రాయించవలసినదిగా కోరెను. రెండులక్షల వరహాలు లంచమిచ్చెను. బుస్సీ ఒప్పుకొనెను.

ఇంతలో రంగారాయఁడు రాజాము బాటకు కాపుగా పాపారాయని పంపి బుస్సీ నెదిరించు సన్నాహములో నుండెను. బుస్సీ విజయరామరాజు పలహామీఁద పాపారాయని మార్గము తప్పించి అడవిదారిని బయలుదేరెను. మార్గములో అడ్డగించిన

తెలగాలను తుపాకులచే హైదరుజంగు కాల్పించెను. ఆ రాత్రి కూడా వారు బొబ్బిలి కోటచుట్టును రాణువలను దింపిరి. ఫిరంగులను త్రిప్పిరి. దానిని విని ఆశ్చర్యపడి రంగారాయఁడు తమ్మునితో అనంతబురుజు నెక్కి చూచి తెలిసికొనెను. అంతట రంగారాయఁడు 'యుద్ధము వలన ప్రయోజనము లేదు, ప్రస్తుతము కోటనువదలి పారిపోయి మరలవచ్చి తీసికొందము' అని ఆలోచింపఁగా తమ్ముఁడు వెంగళరాయఁడు నివారించెను. ధర్మారాయని బొబ్బిలివారు ఇప్పుడు రాయబార మంపిరి.

ధర్మారాయఁడు సంధికిపోయి, ఎట్లో సందు చేసికొని, ఫ్రెంచివారి జాబులుగాని రాజుగారి జాబులుగాని తమకు చేర లేదనియు, రాజు పగబట్టి కుతంత్రము చేయుచున్నాఁ డనియు అసత్యములే చెప్పి ఈమారు మన్నింపుమనియు ద్రవ్య మెంతైన నిచ్చుటకు తాము సంసిద్ధులమనియు చెప్పెనుగాని దుబాసి లక్ష్మయ్య ఒప్పుకొనలేదు. సంధి కుదురక జగడమై ధర్మారాయఁడు నూఱుగురను చంపి, ముప్వురను పోఁగొట్టుకొని కోటలోనికి పోయెను.

ఈలోపల రాణి మల్లమ్మ ముట్టడి వదలిపొమ్మని ప్రార్థనగా విజయరామరాజున కొక జాబు వ్రాయింపఁగా రాజు ఆ జాబును చింపి జాబును తెచ్చిన దాసి చెరపలుగొట్టి పంపివేసెను. పాపారాయనికి వెంగళరాయఁడు వ్రాయించినజాబు రాజుచేత చిక్కినది; పాపారాయనికి అందలేదు. జాబు చూచినవెంటనే రాజుముట్టడి మొదలుపెట్టించెను. వెలమవారి పటాలరాముని

సైన్యము పటాపంచలైనది. కోట కొంతస్వాధీనమైనది. పుట్టకోట మీదినుండి వీరస్త్రీలు చాలశౌర్యముతో పోరాడి (తుపాకీ) నల్లమందు దెబ్బకు కూలిపోయిరి. మూలబురుజుమీఁద ముత్యాల పాపయ్య పరాక్రమముతో పోరాడి తానే పోడుచుకొని చచ్చెను. వెంగళరావు ఈ సమయాన కోడిపందెము లాడుచుండఁగా రంగారావు అతని మందలించి యుద్ధమునకు పంపెను. వెంగళరావు రణరంగమున పరాక్రమముతో పోరాడుచుండఁగా నల్లమందుచేత నతనిసైన్యము భగ్నమండిపోయి అతఁడు మూర్ఛపోయెను. ఆ స్థితిలో నాతనిపల్లకిలో రంగారాయని కడకు కొనిపోఁగా నాతఁడు తుపాకిమందు మైదానములలో పఱచియున్నారనియు రంగారాయని యుద్ధమునకు పోవల దనియు చెప్పి మరణించెను.

వెంగళరావు పోయినతర్వాత మల్లమదేవి వేణుగోపాల స్వామి దేవాలయమునకు పోయి, చావనిశ్చయించుకొని యుండుటచే తనకుమారుని, ఒకసంవత్సరపు బాలుని తనచెల్లెలు జగ్గమ్మకడకు చేర్పుమని వేంకటలక్ష్మియను దాది కొప్పగించి పంపెను. ఆ పిల్లవానితో ఆదాసి పోవుచుండఁగా రాజు సిబ్బంది పట్టుకొని బుస్సీ ఎదుటికితేఁగా బుస్సీ కరుణించి తురుపిచ్చి భద్రముగా కోట దాటింప నాజ్ఞాపించెను.

రంగారాయనింగారి యాజ్ఞాప్రకారము అతని బావమఱది నర్సారావు కోటలోని యంతఃపురస్త్రీలను తెగటార్పగా రాయనింగారు కోటవిడిచి బయలువెడలిరి. వారు రణరంగ

మును ప్రవేశించి విజృంభింపఁగానే బుస్సీయు రాజును భయపడి పారిపోయిరి. పరాసుల దేరాలలో ప్రవేశించి బూసీ ప్రభృతులను కానక దేరాలుచించి లాల్ఖానుని యుద్ధమున చంపిరి. హైదరుజంగును తఱిమిరి. అతఁడు మందుపఱచి వెలమలను చంపఁగా రావుగారు తప్పించుకొనిరి. అచ్చటి పరాసులను రంగారావు చంపఁగా వారు తుపాకులు కాల్చిరి. పేగులు వీడఁబడఁగా రంగారాయనింగారు పొడుచుకొని చచ్చిరి.

రాజును బుస్సీయు ఆ మహావీరుని కళేబరమును చూచి భయపడుచు సమీపించిరి. బుస్సీ అట్టి మహావీరుని పోగొట్టుకొన్నందులకు చాలచింతించెను. తర్వాత వేంకటలక్ష్మివలన విషయ మెఱింగి తాండ్రపాపారాయఁడు వచ్చి నిద్రపోవుచుండఁగా విజయరామరాజును చంపి తానును పొడుచుకొని చచ్చెను. విషయము తెలిసుక అచటికి ఆనందరాజు పట్టాభిషేకార్థమురాఁగా బుస్సీ ఆతనివలన రావలసిన కప్పము గ్రహించి, ఇక నచ్చటనుండిన నేమియాపదవచ్చునో యని పుదుచ్చేరికి పోయెను.

చినవేంకటరాయనికి పండ్రెండేండ్లయినతర్వాత నాతఁడు గోల్కొండకు తెలుపుకొనఁగా నైజాము దుబాసి లక్ష్మయ్యను ఏనుఁగు కాలిక్రింద త్రొక్కించి చంపెను; చినవేంకటరాయని మరల బొబ్బిలిలో కుదురుపరచెను.

ఇఁక సమకాలిక చరిత్రకారుఁడును, నాటి మదరాసు బ్రిటిష్‌కౌన్సిలులో నొక సభ్యుఁడునైన ఆరమ్‌దొర రచించిన

'హిండోస్తాన్ చరిత్రము' అను గ్రంథమునుండి గ్రహించి మద్రాసు మాన్యుఅల్ మొదలైన చరిత్ర గ్రంథములు చెప్పునదేమనఁగా-

3 బొబ్బిలిముట్టడి యొక్కయు జమీను యొక్కయు చరిత్రము.

క్రీ. శ. 1756 లో ఉత్తరసర్కారులలోని పాళెగాండ్రు విశృంఖలులైనందున వారిని దండించుటకు బుస్సీ సేనాధిపతి గొప్ప పరాసుసేనతో నచటికి పోయెను. వారచటచేరఁగానే ఈ కలతలకెల్ల బొబ్బిలి జమీన్దారే కారకుఁడని బుస్సీ దొరతో విజయనగరము రాజు నచ్చఁజెప్పి తన సుహృద్భావమును వెల్లడించుటగా తన 11000 సైన్యముతో బుస్సీకి, రంగారాయని దండించుటలో సాయపడుటకు సంసిద్ధుఁడాయెను. యుద్ధ మారంభించుటకుముందు బుస్సీ, రంగారాయఁడు బొబ్బిలి వదలి మఱియొకచోటికి పోవుటకు సమ్మతించిన నాతని క్షమించుట కొప్పుకొనెను. బొబ్బిలివా రందుల కొప్పుకొనలేదు. భారతదేశచరిత్రలో మఱపునకురాని సంభవ మీ బొబ్బిలి ముట్టడి. తెల్లవాఱుజామున బొబ్బిలి ముట్టికోటమీఁదికి ఫిరంగులు కాల్పఁబడినవి; ముట్టడి ప్రారంభమైనది. నాలుగు గంటలు ఘోరమైన ముష్టాముష్టియుద్ధ మైనంతట ఫిరంగులచేత కోట గోడలను పగులగొట్టించుటకై బుస్సీ సోలుజర్లయుద్ధము నిలిపెను. మరల రెండవపర్యాయము కోటనుసాధింప నారంభించిరి. మొదటియట్లే నిష్ఫలమయ్యెను. ఐదుగంటలకాలము యుద్ధమైనను ఎవరును కోటలో ప్రవేశింపలేరైరి. మరల ఫిరంగులు

కాబట్టికై బుస్సీ సైనికులపోరాటము నిలిపెను. కోటలోపలి వారు ఇఁక యుద్ధము తమ కనుకూలము కాదని గ్రహించి స్త్రీలనందఱను (శత్రువులచేతఁ బడనీయక) సంహారించి మరల పోరాట మారంభించిరి. పరాసులును పోరాట మారంభించిరి. సాయంకాలమునకు బుస్సీ జయించినవాఁడై తన మిగిలినసైన్య ముతో కోటలోపలికి రాఁగానే లోపల చాలమంది చచ్చియుండిరి. మిగిలినవారు చావ సిద్ధముగాను లేవలేకయునుండిరి. ఒక ముసలి వాఁడు ఆ చెంతనుండిన యొక గుడిసెనుండి ఒక చిన్న బాలుని తెచ్చి ఆ బాలుఁడే యుద్ధములో మరణించిన తమ ప్రభువు యొక్క కుమారుఁడని బుస్సీ ఎదుటనుంచెను. మఱి నలువురు పురుషులుమాత్రము మిగిలియుండిరి. రెండురాత్రుల తర్వాత విజయనగరమువారి విడిదలలో నందఱును ఒడలుమఱచి నిద్రించు చుండు సమయమున వీరు (పై నలువురు) సందడిచేయక విజయ రామరాజు గుడారములో ప్రవేశించి, కావలివారు లేచి వీరిని పట్టుకొని కాల్చులోపల విజయరామరాజును ముప్పదిరెండు పోట్లు పొడిచి చంపివేసిరి. ఎట్లో బ్రదికిన ఆబాలుని చినవేంకట రాయని ఆతనితండ్రికి తానీయగోరిన రాజ్యమందు బుస్సీ యొసంగెను. బాలుఁడు 'మేజరు' అగులోపల ఆతనిపినతండ్రి (Uncle=వెంగళరాయఁడు?) తమ పాఁతజమీనైన రాజామును-బలాత్కారముగా గ్రహించెను.కొంత వివాదానంతరము విజయ నగరమువారు సమాధానపడి బొబ్బిలివారికి కవిటి, రాజాము పరగణాలనిచ్చిరి. మరల కొంతకాలమునకు వైషమ్యములు

ప్రారంభమై బొబ్బిలిరాజు నైజామునకు పారిపోయెను. 1794 లో విజయనగరము జమీను (విభక్తమై) బ్రిటిషువారిచేత చిన రంగారావు తనపిత్రీయమైన రాజ్యమున ప్రతిష్ఠితుఁడాయెను. 1801 లో ఇంగ్లీషువారు చినరంగారావుగారి దత్తపుత్త్రుఁడైన రాయడప్ప రంగారావుతో సంవత్సరమునకు రు. 90,000 కప్పము గ్రహించునట్లు శాశ్వతనిబంధన నొకదానిని చేసికొనిరి. అదిమొదలు ఆజమీను బాధలులేక యున్నది. రాయడప్పగారు 1830 లో చనిపోయి వారికుమారులు శ్వేతాచలపతిగారు జమీందారైరి. వీరు 1862 లో చనిపోఁగా పిఠాపురమునుండి స్వీకారము వచ్చిన సీతారామకృష్ణరావుగారు పట్టభద్రులైరి. వీరు 1868 లోసంతతిలేక చనిపోఁగావీరిరాణిగారు లక్ష్మీచెల్లగమ్మగారు జమీనేలుచుండిరి. 1876 లో వీరికి 'రాణి' బిరుదును, వారు బెంగాలు క్షామనివారణార్థ మొసఁగిన వేయిగరిసెల ధాన్యమునకు సంతోషించి ఇంగ్లీషువా రిచ్చిరి. 1871 లో వీరు శ్రీ వేంకటశ్వేతాచలపతిరావుగారిని దత్తుచేసికొనిరి. వీరు 1881 లో అధికారమునకు వచ్చిరి. ప్రస్తుతము బొబ్బిలిరాజా గారు వీరి మనుమలు, మదరాసులో కొంతకాలము మంత్రిత్వ మొనర్చిరి.

ఇట్టి యీ బొబ్బిలివారి చరిత్రలో రంగారాయని చరిత్రను ఆంధ్రులు నాటినుండియు పరంపరగా చెప్పుకొనుచు వచ్చిరనుటలో సందేహములేదు. ప్రాచీనులే ఇరువురు, ఒకరు కావ్యముగాను, మఱియొకరు బుఱ్ఱకథగాను వీరిచరిత్ర వ్రాసి

యుండుటయే అందులకు తార్కాణము. ఈ రెంటినిమాత్రమే ఆధారముగా నుంచుకొని ఒకపాటి చారిత్రకజ్ఞానముతో మన యిటీవలి యాంధ్రకవులు ఈ ఇరువదియవ శతాబ్దములో నాటకములు వ్రాసిరి. నాటకకర్తలకు వాస్తవ చరిత్రతో నిమిత్తము లేదు.

పై వానిలోని వ్యత్యాసములు

కాని పై మూఁడువిధములైన యాకరములను చూడఁగా వ్యత్యాసములు కనఁబడుచున్నవి. సమకాలిక చరిత్రకారునిదే ఎక్కువ విశ్వసనీయము. దిట్టకవి నారాయణకవి తర్వాత ఎప్పుడో రచించినను ఆరమ్డోరకు తర్వాతిది అతనిరచనయే. ఎందుల కనఁగా కథలో చేర్పుకనఁబడుచున్నది. బహుశః ఆవెనుకటిదిగా నుండును పెద్దాడ మల్లేశకవియొక్క బుఱ్ఱకథ. ఈపాటకాలము నాటికి కథలు చెప్పుకొనుటలో మార్పు లేర్పడియైనయుండవల యును లేదా జానపదగేయకర్త వీరరసోద్బోధకముగా నుండుటకై కథలో కొన్నిమార్పులైన చేసియుండవలయును.

కావ్యమునకును పాటకును స్పష్టముగా కనఁబడు వ్యత్యాసము లేవనఁగా—

కావ్యమున - రంగారాయఁడే చనిపోయెను. తర్వాత పోరిన వెంగళరావును బుస్సీ చావనీయక కాపాడెను. ధర్మారావు రాయబారము పోయినప్పుడు పౌరుషము చూపలేదు. రాణి మల్లమదేవి విజయరామరాజునకు జాబువ్రాయలేదు. బాలునితోపోయినదాసి 'కొండొకదాసి' యే గాని వేంకటలక్ష్మిగాదు.

పెండిండ్ల విషయము లేదు. బుస్సీ లంచము గ్రహింపలేదు. హైదరు గ్రహించెను. పాపారాయని నాతని యనుయాయులను రాజుసిబ్బంది పైఁబడి చంపిరేగాని వారాత్మహత్య చేసికొనలేదు. హైదరుజంగును బుస్సీ నిందించెనేగాని ఎవరును దండింపలేదు. విజయరామరాజు బొబ్బిలిని తనకే పట్టముగట్టింపఁ దలఁచుకొనెను. గాని ఆనందరాజునకు కాదు.

ఇది చాలవఱకు చరిత్రకు సరిగానున్నది. కాని కవియొక పొరపాటుచేసినాఁడు. నాటి నైజాము నిజామల్లీ కాఁడు. సలబత్ జంగు. ఈతఁడే పరాసులకు హితుఁడుగానుండి బుస్సీని తనయాస్థానమున దాదాపు ఏడుసంవత్సరములు పోషించెను. అందువలన కవికాలమునకే కొంత మఱపు ప్రారంభమైనట్లున్నది.

మల్లేశకవియొక్క పాటలో—చాల విషయవివరము కనఁబడుచున్నవి. అంతటి గొప్పవారి చరిత్రలోని చిల్లరవిషయములను కొంచెముకూడ పోనీయక ఆప్రాంతములవారు పరంపరగా చెప్పుకొందురుగదా. వానినే కవి గ్రహించియుండును. పరంపరగా చెప్పుకొనుటలో ఏమైనను మారియు నుండవచ్చును. వెంగళరావు ముందుగానే గతించెనసుట యాతని శీలమునకు పోషకము. ఇందు బుస్సీ లంచము గ్రహించెను గాని చివరకు చింతించెను. వారివారి పరాక్రమాదికములంగూర్చిన విషయములును కొంతకు కొంత వాస్తవములనియే గ్రహింపవచ్చును.

ఈ బొబ్బిలియుద్ధనాటక కథ శ్రీ శాస్త్రులవారే వ్రాసినది ఇందే వారి విజ్ఞప్తితో ముద్రింపఁబడియున్నది. పాత్రపోషణ

...ను రసస్ఫూర్తికి శ్రీ శాస్త్రిగారు కొన్నిమార్పు లొనర్చి నారు. రంగారాయచరిత్రమందు వారికి రసానుభవము కలుగ నందున పెద్దాడ మల్లేశకవి పాటనే ఎక్కుడుగా ఆధారముచే కొనిరి. [చూడుడు విజ్ఞప్తి] గ్రామ్యాదేశనిరసన మను నుపన్యాస మున నిట్లు వ్రాసినారు. "రసజ్ఞులు కారణవిశేషములంబట్టి గ్రామ్య మందు గ్రంథములను వ్రాసికొందురుగాక. బొబ్బిలిపాటయు, దేసింగురాజు పాటయు గ్రామ్యములేగదా. ఆరాధ్య మల్లన రచించిన జంగాల బొబ్బిలిపాటలోని వీరరసము ఇంచుకేనియు రంగరాట్చరిత్ర పద్యకావ్యమున లేదు. ఇది గ్రామ్యప్రభావము గాదు రచనాప్రభావము......"

ఈ నాటకము రంగారాయ ప్రశస్తి. అందుచేత ఆతఁడు ఉత్తముఁడుగాను విజయరామరాజు కుట్రగోరుగాను వర్ణింపఁ బడియున్నారు. శాస్త్రిగారే

'తప్పులెల్ల నడఁచి యొప్పులు గూర్చియించు
రంగరావు కీర్తి రంగమందు...'

'ఆడవలయును' అని ప్రస్తావనలో వ్రాసియున్నారు. రంగారావు నకు యుద్ధమునకుపూర్వము చాలవ్యవధి యుండినది. రంగా రాయఁడు తాఖీదులందియురాలేదు. ఆతఁడు రాయబారములు పంపి పాపారాయని రాజాములో నుంచి సన్నాహములతో నున్నట్లు రెండాకరములలోను నున్నది. వెంగళరాయని వివాహ విషయము బుఱ్ఱకథలోమాత్రము న్నది. హర్కారాలువచ్చియు రంగారావు కోటికి పోకుండుట యనుచితము. అందును వెంగళ

రాయఁడు విజయరామరాజు జాబును తిరస్కరించుట మఱియు ననుచితము. అందువలన పరాసులు ఎక్కడు వ్యవధి యీయ కయే తటాలున 'అతర్కితోపపతితముగా' పైఁబడిరనియు, అది ఏబది పెండిండ్లసమయమనియు, అప్పుడు తాండ్ర పాపారాయఁడు 'పితూరీలు అణఁగ గొట్టుటకు రాజాములో నే'యుండి 'వెంగళుని పెండిలికి' వెడల లేక పోయెననియు, పరాసులజాబు లేవియు బొబ్బిలివారికి చేరక, 'ఆ హర్కారాలదంతయు వట్టినాటక' మనియు కల్పించి ఔచిత్యమును రంగారాయ వెంగళరాయండ్ర శీలమును పోషించినారు.

ఇది సంస్కృతనాటకలక్షణమర్యాదల ననుసరించియు న్నది. వారే అనువదించిన సాహిత్యదర్పణమున ఇట్లు వ్రాసిరి. "నాయకునికి అనుచితమేని రసమునకు విరుద్ధమేని అగువస్తు వేది కలదో దానిని విడువవలసినది, లేదా వెఱుఁగ నేని కల్పింపవల సినది." భారతాభారతరూపకమర్యాద లనునుపన్యాసమున నిట్లు వ్రాసినారు. "ఇప్పటి నాటకములయందు ఔచిత్య చింత లేదు, పూర్వులు అనుచితవ్యవహారమును ప్రతినాయకునికిం బెట్టిరి. కథానాయకునికిం బెట్టరు. పరదారకాంక్ష రావణునికిని కాకాసురు నికిని బెట్టిరి. శ్రీరాముల వారికి ఏకపత్నీవ్రతము నెలకొల్పిరి. ఏలన కథానాయకుఁడు లోకమునకు సదాచారోదాహరణ భూతుఁడుగా నుండవలయును. 'రామాదివద్వర్తితవ్యం, నతు రావణాదివత్' అనికదా రామకథోపదేశము." దీని వివరణ

మును ఉండుట చూడ నగును. ఈ నాటకమున రంగారాయఁడు పరాక్రమశాలియేగాక సజ్జనుఁడు, సద్వర్తనముఁగలవాఁడు, సత్యవాది, ఔచిత్యానౌచిత్యము లెఱింగినవాఁడు, వేదాంతి, తన శక్తియు ఎదిరిశక్తియు తెలిసినవాఁడు, భ్రాతృవత్సలుఁడు, కాని పట్టుదలగలవాఁడు, ప్రాణముకన్న మానమే బలిష్ఠమనువాఁడు. సర్కారునకు పైక మిచ్చుటకు సంసిద్ధుఁడేగాని లంచమడిగిన 'తములపాకుతొడిమ' నైన నీయనివాఁడు. ఇవన్నియు కావ్యమునను పాటలోను లేనివి నాటకమున నెలకొన్నవి. వెంగళరాయఁడును భ్రాతృవిధేయుఁడు. 'అన్నగారు నారణయింటారం సూడ రైరి గదా' అన్నవాఁడు.

ఇట్లే ధర్మారాయ పాపారాయాదుల శీలములు ఆకరములకన్న నిందు పోషింపఁబడినవి. బుస్సీని సజ్జనునిగాను పశ్చాత్తప్తునిగాను హైదరువిజయరాముల చేత మోసపోయిన వానినిగాను దైవభక్తిగల వానినిగాను చేయుటచేత రంగారాయని పాత్రకు మఱింత వన్నె చేకూరినది. పైగా సర్వాధికారి కాతనికి లంచము తీయవలసినంత గ్రహచార మేమి. కావున రంగరాయచరిత్రమున నుండునట్లు హైదరునే లంచగొండిగా చూపినారు. తుదకు హైదరునకు శరణాగతరక్షకుఁడైన పాపారాయనిచే చీవాట్లు మాత్ర మిప్పించినారు.

విజయరామరాజు ప్రతినాయకుఁడై నాఁడు. గొప్ప రాజు. రాజనీతిజ్ఞుఁడు. కార్య మెఱిగినవాఁడు. అధికారులను క్షణములో స్వాధీనము చేసికొనగలిగినవాఁడు. ఆకరములలో నీతని దోషము లంత ప్రస్ఫుటములు గావు; బొబ్బిలివారికి నిజముగానే తా నొకజాబు వ్రాసినాఁడు. వాథు రానందున వాస్తవముగానే వారిమీఁద దోష మేర్పడినందున ఆ యవకాశమును పురస్కరించుకొని అధికారధిక్కారముగా దానిని వర్ణించి హైదరును పురికొల్పెను. హైదరునకు లంచమీయ నొప్పుకొనెను. పిఱికి వాఁడు గాఁడు. వెంగళరాయని నెదుర్కొని యుద్ధరంగమున మాటలాడినాఁడు. నాటకముననివి ప్రతినాయకునికి అనుచిత లక్షణములని, అసత్యవాదిగాను, కుట్రగోరుగాను, పిఱికివాఁడు గాను వర్ణితుఁడైనాఁడు.

ఇవి స్థాలీపులాకన్యాయముగా హెచ్చరించుటయే గాని సమగ్రముగా విమర్శించుట గాదు. గ్రంథవిస్తరభీతిచే మానుచున్నాను. పరితలు పోల్చిచూచిన ఎన్నెని కనఁబడును. నాటక కథాకాలముకూడ కరము సంక్షిప్తమైనది. బుస్సీ హైదరులు బయలుదేరి వచ్చి తాఖీదులు పంపినదిమొదలు బొబ్బిలివారు విషయమెఱింగి యుద్ధసన్నాహము లొనర్చి కథ ముగియువఱకు కొన్ని నెలలు పట్టియుండవలయును. అట్లుగాక నాటకమున నంతయు ఒకవారములో జరిగినట్లు ప్రదర్శించుటచే కథ బిత్తెక్కినది.

## నాటకకథాకాల విభజనము (TIME ANALYSIS)

| | | | |
|---|---|---|---|
| అంకము I | మాఘ బ. 13 | 17-2-1757 | గురువారము |
| ప్రవేశకము | ఫాల్గున శు. 2 | 20-2-1757 | ఆదివారము పగలు |
| అంకము II | ,, | ,, | ,, రాత్రి తుదను |
| విష్కంభము | ఫాల్గున శు. 3 | 21-2-1757 | సోమవారము ఉదయము |
| అంకము III | ,, | ,, | ,, పూర్వాహ్ణము |
| ,, IV | ,, | ,, | ,, ,, |
| ప్రవేశకము | ,, | ,, | ,, అపరాహ్ణము |
| అంకము V | ,, | ,, | ,, రాత్రి 12 గం మొదలు యుద్ధము. |
| అంకము VI | ,, | ,, | ,, వేకువ |
| అంకము VII | ,, | ,, | ,, తెల్లవాఱుజాము తెల్లవాఱిన వెనుక మంగళవారము |
| అంకము VIII | ఫాల్గున శు 4 | 22-2-1757 | మంగళవారము |
| ప్రవేశకము | ఫాల్గున శు 5 | 23-2-1757 | బుధవారము |
| అంకము IX | ,, | ,, | ,, రాత్రి |
| అంకము X | ఒకనెల తర్వాత | మార్చి 1757 | పగలు |

దశమాంకము అనంతరకథయైనను మంగళార్థము చేర్పఁబడినది.

బొబ్బిలియుద్ధమునకు ఆంగ్లచరిత్రకారులు 24 జనవరి 1757 తారీఖిచ్చినారు. తెలుఁగుతారీఖు ధాతుఫాల్గున శుద్ధ తృతీయ రాత్రి, తెల్లవారిన చతుర్థి. దీనికి సరియైన యాంగ్లమానము 22-2-1757 ప్రొద్దున సూర్యోదయాత్పూర్వము.

విజయరామరాజుయొక్క యాకారమును రంగరాట్చరిత్రమున నీ క్రిందిపద్యము వర్ణించుచున్నది.

సీ. మణికుండలద్వయీ ఘృణిమండలంబుల
  దమిఁ గెంపు చెక్కుటద్దముల వాని,
దల వసంత జయంత నలకూబరాదుల
  నట్టిట్టు పఱుచు సోయగము వాని,
భాగ్యలక్ష్మీ సభా భవనాయితములైన
  తామరసాభ నేత్రములవాని,
హంస సంసత్తూలి కాభ్యంచితంబైన
  హొంబట్టు పఱపుపై నొప్పువాని,
తే. హస్తకముల కృతోప బర్హంబువానిఁ
గించి దుస్మిలితాత్ముఁడై మించు విజయ
రామరాజ వసుంధరా రమణుఁగాంచి
తాంద్ర పాపయ్య కోపంబు దీండ్రిలంగ.

బుస్సీ చరిత్రము

బుస్సీదొరచరిత్రము ఆంధ్రులు తెలిసికొనఁదగినది. ఈ యన పూర్తిపేరు చార్లెస్ జోసెఫ్ పటీషియర్, మార్క్విస్ డి బుస్సీ కాసెల్నా. ఈ మార్క్విస్ మూసాగా మారి అతనిపేరు మూసాబూసీ యైనట్లున్నది. 1751 లో నీతనికి 35 ఏండ్లవయస్సు. బొబ్బిలియుద్ధము నాటికి 41 లేక 42. ఫ్రెంచివారి తరపున డూప్లేక్రిందనుండిన పెద్ద యధికారులలో నీతఁడు ముఖ్యుఁడు. మార్క్విస్ అనఁగా చిన్న ప్రభువని యర్థము.

మన దేశచరిత్రయందు ఫ్రెంచివారి యుచ్ఛ్రాయదశ క్రీ. శ. 1741 లో డూప్లేయనునాతఁడు పుదుచ్చేరికి గవర్నరుగా

వచ్చుటతో ప్రారంభమైనది. ఈతఁడు పరాసుకంపెనీవారికి చాల వృద్ధికరములైన పనులొనర్చి ఇంగ్లీషు కంపెనీవారిని పైకిరానీయక అణఁచిపెట్టి యుండెను. ముఖ్యముగా నీతఁడు వ్యాపారముతో తృప్తిపడక నాటిరాజకీయములలో ప్రవేశించెను. ఫ్రెంచివారు మదరాసు పట్టుకొనుట, కర్నాటకమునవాబైన అన్వరుద్దీను కొడుకు మహాఫుజ్‌ఖానును ఓడించుట, పుదుచ్చేరిని ఇంగ్లీషువారిచేత పడనీయక కాపాడుకొనుట–వీనివలన వీరికీర్తివ్యాపించి మన నవాబులు రాజులు వీరిసాయ మపేక్షింపసాగిరి.

క్రీ. శ. 1748 లో ముదుసలి నైజాముల్‌ముల్కు-మరణించెను. శ్రీకాకుళమునకు నవాబుగానుండి ఆర్కాడులో కర్నాటకమునకు నవాబుగా నైజాముచే నియమింపఁబడిన అన్వరుద్దీను తనబలము తగ్గునని భయపడసాగెను. నైజాముయొక్క రెండవ కుమారుఁడు నాజర్‌జంగు తాను సింహాసన మాక్రమించెను. నైజాము పెద్దకుమారుఁడు ఘాజియుద్దీను ఢిల్లీవ్యవహారములలో మునిఁగియుండెను. నైజాము మనుమలలో నొకఁడైన ముజఫర్‌జంగ్ రాజ్యమును తనకు తన తాత 'విల్లు' వ్రాసినాఁడని బయలుదేరి దూప్లే సాయమపేక్షించెను. ఇంతలో దూప్లేతో చందాసాహెబు చేరుట (1748) అంబూరుయుద్ధమున అన్వారుద్దీనును అతని కుమారులును చచ్చుట, చందాసాహెబును దూప్లే ఆర్కాడులో కర్నాటకమునకు నవాబుగా చేయుట, నైజాముకాఁబోవు ముజఫరు దానిని ఒప్పుకొని స్వయముగానే నైజాము హోదాలో ఫర్మానా

కొనుచుండుట—జరిగినవి. నాజర్ జంగును స్వయముగా ఇంగ్లీషు వా రాదరించిరి. ఫ్రెంచివారి యెత్తులకు పై యెత్తులు వేయుచునే యుండిరి. నాజరుజంగు పెద్దసైన్యముతో పుదుచ్చేరికి 15 మైళ్ల దాపునకు వచ్చెను. ముజఫరుజంగు భయపడి నాజరుజంగును శరణుజొచ్చి ఆతనిఖైదీ యాయెను. నాజరుజంగు ఆర్కాడులో ఆఱునెలలు విశ్రాంతి తీసికొనుచుండెను.

ఈలోపల ఫ్రెంచివారు చెంచిదుర్గముచుట్టు చాల ప్రదేశములను పట్టుకొనిరి. ఈకాలముననే బుస్సీ తనపరాక్రమమును చూపి దుర్భేద్యమైన చెంచిదుర్గమును పట్టుకొని సాధించి ఫ్రెంచివారి ప్రతిష్ఠను ఇనుమడింపఁజేసెను. ఇంతలో డూప్లే సముద్రమార్గమున సైన్యమంపి మచిలీపట్టణమును పట్టుకొనెను. నాజరుజంగు యుద్ధముచేసి, కడప, కర్నూలు, సవనూరు నవాబులు మోసముచేసినందున ఫ్రెంచివారిచేత ఓడిపోయి చంపఁబడెను. ముజఫరుజంగు 1750 డిసంబరులో నైజామాయెను.

ఇప్పుడు సర్వాధికారము డూప్లేచేతఁబడినది. నైజాము నకు ఆతఁడే అధికారమిచ్చెను. చందాసాహేబు కర్నాటకమునకు డూప్లేవలన నవాబాయెను. కృష్ణకు దక్షిణదేశమంతయు నైజామువారి తరఫున ఫ్రెంచివారు 'ఏజంట్లు'గా నుండిరి. క్రొత్తనైజాము పూర్తిగా ఫ్రెంచివారిమీఁద నాధారపడియుండెను. 1751 జనవరిలో ముజఫరుజంగుతోకూడ ఫ్రెంచి సైన్యమును తీసికొని బుస్సీ హైదరాబాదునకు బయలుదేరెను. పూర్తిగా నైజామును హైదరాబాదునకు చేర్పకమునుపే

కొందఱు పఠాను సామంత ప్రభువులు ముజఫర్ జంగును, తమకు తృప్తిగా సన్మానము చేయలేదని, అల్లరిచేసి నఱికి పాఱవేసిరి. బుస్సీ వారిని సమాధానించి ఉపాయముగా సలబత్ జంగ్ అనువానిని, నాజర్ జంగుయొక్క సోదరులలో హతశేషుని, నైజాముగా చేయుట కొప్పించి ఉపద్రవము తప్పించెను. సలబత్ జంగు బుస్సీకి 'ఉద్దత్-ఉల్-ముల్క్' అను మొగలాయీ బిరుదిచ్చి చాలగౌరవము చేసెను. ఫ్రెంచివారికి ఇందువలన చాలబలము చేకూరినది.

బుస్సీ నైజామునకు రక్షకుడుగా నుండెను. ఔరంగాబాదును మహారాష్ట్రులు పట్టుకొనరాఁగా బుస్సీ కాపాడెను. మదరాసులోని ఇంగ్లీషువారు ఫ్రెంచివారికి ఎదురుగా శత్రువులకు సాయము సైన్యమును పంపదలంచిరిగాని బుస్సీ వారి రస్తాలను స్వాధీనమునం దుంచుకొనియుండినందున ఊరకుండిరి. ఇందులకు కృతజ్ఞతగా నైజాము బుస్సీకి కొండవీటిసీమ నిచ్చెను (1752).

ఇంతలో 1751 లో రాబర్టుక్లైవు ఆర్కాటును పట్టుకొనుట, చందాసాహేబు మరణము, మహమ్మదాలీ ఆర్కాటులో ఇంగ్లీషువారి సహాయమున చేరుట, మొదలైన సంభవములచేత ఫ్రెంచివారిబలము తగ్గి 1752 కు చెంజి, పుదుచ్చేరీలు మాత్రమే ఫ్రెంచివారికి మిగిలినవి. 1753 కు ఫ్రెంచివారు తిరుచినాపల్లిని పట్టుకొనజూచిరిగాని విఫలులైరి. డూప్లేపద్ధతులు ఫ్రెంచివారికి విసుగుపుట్టింపసాగినవి. ఇంతలో బుస్సీకూడ అనారోగ్యముచే బందరునకు పోయెను. అతనిపరోక్షమున నైజాముయొక్క

క్రొత్తమంత్రి బుస్సీకి విరోధముగా కుట్రలు పన్నసాగెను. నైజాము ఖజానాయంతయు ఫ్రెంచి సైన్యమునకే కొల్లపోవు చున్నదని యాతఁడు ప్రచారము చేయసాగెను; రహస్యముగా నింగ్లీషువారితో రాయబారములు మొదలుపెట్టెను. 1753 కు బుస్సీ మరల హైదరుబాదునకు వచ్చెను. ఉత్తరసర్కారులలో తప్ప దక్షిణమున ఫ్రెంచివారి బలము తగ్గుచున్నదని యాతఁడు గ్రహించెను. క్షణములో నైజామును అచటివారిని తన కను కూలురనుగాఁజేసికొని ఫ్రెంచి సైన్యములను పోషించుటకు ద్రవ్యము నిమిత్తము, ఫ్రెంచివారే వసూలు చేసికొనునట్లు, ఉత్తర సర్కారులను—గుంటూరు, ఏలూరు, రాజమహేంద్ర వరము, శ్రీకాకుళము జిల్లాలను—సర్వాధికారములతో గ్రహించెను. నైజామునకు ఆత్మరక్షణార్థము పరాసు సిబ్బందిని ఏర్పాటు చేసెను (1753).

బుస్సీకి వెంటనే పైకమురాలేదు. ఉత్తరసర్కారులలోని జమీందారులు చిక్కులు పెట్టుచుండిరి. వసూలుచేయుటకు బుస్సీయే స్వయముగా పోవలసియుండెను. మధ్యమధ్య నైజామును రక్షించుటకు యుద్ధసహాయిగా పోవలసియుండుటచే బాకీ లేర్పడుచుండినవి. కానీ బుస్సీ జాగరూకుఁడుగానే వ్యవహరించుచుండెను. ఎట్లో డూప్లేకు ద్రవ్యసహాయము చేయుచుండెను. ఇంతలో 1754 లో ఫ్రెంచికంపెనీ డైరెక్టరులలో నొకఁడైన గాడెహూ అను నతఁడువచ్చి ఇంగ్లీషు ఫ్రెంచివారల

యుద్ధములను ఆపుచేయించి, ఇంగ్లీషువారితో సంధికుదుర్చుకొని డూప్లేను 1754 ఆగస్టులో ఫ్రాంసుకు పంపివేసెను. బుస్సీని మాత్రము హైదరాబాదునుండి పిలిపించిన ఫ్రెంచివారి బలము తగ్గుననియు అట్లు చేయగాదనియు డూప్లే గాడెహ్యూకు సలహా యొసంగిపోయెను. గాడెహ్యూ డూప్లేను పంపివేసినను బుస్సీ పనులను మెచ్చుకొనెను; ఇంగ్లీషువారికి అనుకూలమైనవిధమున సంధి కుదుర్చుకొనినను ఉత్తరసర్కారులను పోగొట్టుకొనక బుస్సీని హైదరాబాదునుండి కదలింపక జాగ్రతపడెను. కాని డూప్లే తలంపెల్ల భగ్నమైనది.

1755 లో నైజాము సలబత్ జంగు, తనకు కప్పము బాకీయున్నదని, మైసూరుమీఁద దాడివెడలెను. మైసూరు వారు తిరుచినాపల్లిలో ఫ్రెంచివారి స్నేహితులు. వారి కప్రియ మొనరించుట బుస్సీ కిష్టముకాదు. నైజామును నిరోధించిన నాతఁడు ఇంగ్లీషువారితో చేరును. బుస్సీ చిక్కులోపడెను. నైజాముతోకూడ బుస్సీ మైసూరికి పోయెను. అదేసమయము మహారాష్ట్రులును మైసూరిమీఁదికి ఎత్తి వచ్చిరి. బుస్సీకి అవకాశముచిక్కినది. చాల చాకచక్యముతో నాతఁడు మైసూరు వారిని ఇరువురతోను సంధి చేసికొనునట్లును, నైజామునకు పెద్ద మొత్తము ద్రవ్య మిచ్చునట్లును (1755 లో) సంధికుదిర్చెను.

కాని షానవాజ్ ఖాన అను క్రొత్తమంత్రి బుస్సీని తొలఁగించుటకు కుట్రలుచేయుచునే యుండెను. ఇంతలో నైజా

మును మహారాష్ట్రులును మిత్రులై గుత్తిని సవనూరును తమ కుభయులకుతిరుగఁబడినందులకు దండింప నుద్యుక్తులైరి. నైజాము తరఫున బుస్సీపోయి గుత్తిపాలకుని మురారిరావును జయించెను గాని తిరుచినాపల్లిలో మురారి ఫ్రెంచివారికి సాయము చేసియుండి నందులకు ఫ్రెంచివారిమీఁద నాతనికుండిన హక్కుల నన్నిటిని వీడగొట్టించెను. వెంటనే షానవాజ్ ఖాన్ బుస్సీ స్వార్థపరుఁడనియు ద్రోహియనియు చాటి తొలఁగించెను. ఇందుచే పదభ్రష్టుఁడై బుస్సీ తనకడకు నౌకరికి వచ్చునని పీష్వా బాలాజీరావు, తలంచెనుగాని బుస్సీ ధైర్యమూని, ఏమియుచేయక మచిలీపట్టణమునకు పోవునుద్దేశమునుచాటి హైదరాబాదు పోయి చేరెను. నైజామును మహారాష్ట్రులును కలసి తనమీఁది కెత్తి రావచ్చునని యూహించి, హైదరాబాదులో తనకు శత్రువు లెక్కువ గనుక, తానుండుచోటున యుద్ధమున కాయత్తముగా చుట్టును ప్రాకారము లేర్పఱచుకొనెను. బందరునుండి కొంతసైన్యమును పిలిపించుకొనెను. నైజామును ఆతని మంత్రియు నింతలో నింగ్లీషువారిని పిలిచిరి గాని వారు రాలేదు. బుస్సీయుద్ధసన్నద్ధుఁడుగా నుండుటనుచూచి నైజాబు భయపడి, వెంటనే తగ్గి, బుస్సీతో సంధిచేసికొని, గౌరవించి యథాపూర్వము ఆగస్టు 1756 లో అధికారమం దుంచెను.

1756–వ సంవత్సరమున యూరపులో 'ఏడేండ్ల యుద్ధము' ప్రారంభమైనది. బుస్సీ ఉత్తరసర్కారులమీఁదికి తనదృష్టిని మరల్చెను. ఆంగ్లేయుల కార్యస్థానములను కొన్నిటిని పట్టు

కొనెను. అందులో విశాఖపట్టణము ముఖ్యమైనది. అచ్చటి నుండి బుస్సీ ఆంగ్లేయుల నెదుర్కొనుటకు పరాసువారికి సాయముగా చంద్రనగరమునకు దండు పంపఁదలంచెను గాని ఎందులకో మానుకొనెను. ఈసమయముననే క్లైవు బెంగాలులో నుండినది. క్లైవుమీఁదికి ఎత్తిరమ్మని సిరాజుద్దౌలా బుస్సీకి రాయబారముకూడ పంపెను. కాని బుస్సీకి ఇచ్చటనే చాల పని యుండెను. తర్వాత 1757 లో నతఁడు బొబ్బిలిమీఁదికి వచ్చినాఁడు.

బుస్సీ లేనప్పుడు హైదరాబాదులోని యీతని శత్రువులు ఈతని కనుకూలుఁడైన నైజామును తొలఁగించి అతని సోదరుని నిజామాలీ యనువానిని నైజాముగా చేయుటకు కుట్రపన్నిరి. బుస్సీ 1758 లో హైదరాబాదునకేఁగెను. అచ్చటి అల్లరులలో ఎవరో షానవాజుఖానును చంపిరి. నిజామాలీ పాఱిపోయెను. బుస్సీ కొంతకాలము హైదరాబాదులో శాంతి నెలకొల్పి నైజామునకు సాయము చేయుచుండఁగా, పుదుచ్చేరి క్రొత్తగవర్నరైన లాలి, అతనిని సకలసైన్యములతోను, అన్నిటిని వదలుకొని, బయలుదేరి రమ్మని యాజ్ఞాపించెను.

ఇంతటితో ఫ్రెంచివారిబలము తగ్గిపోయినది. క్లైవు యొక్క అధికారము హెచ్చెను. ఆంధ్రదేశమునందు ఇంగ్లీషువారు ప్రవేశించిరి. బుస్సీ నిర్మించినదంతయు క్షణములో ఎగిరిపోయినది. కాని బుస్సీ గొప్పరాజకీయవేత్త; దూప్లేకు సలహా

లిచ్చి ద్రవ్యసహాయము చేయుచుండిన వాఁడు. ఈతనిపద్ధతులను చూచి క్లైవు పెక్కుగుణపాఠములను నేర్చుకొనెను. ఆంగ్లేయులకు క్లైవు ఎట్టివాఁడో ఫ్రెంచివారికి బుస్సీ అట్టివాఁడు. మనదేశమందుండిన కాలమున మన భాషలను కొంతకు కొంత నేర్చి హిందూపద్ధతుల నెఱిఁగినవాఁడు. ఫ్రెంచి వారి పద్ధతుల చేత బుస్సీశ్రమకూడ దూష్లేపనివలెనే వ్యర్థమై పోయినది. కాని తనవరకు బుస్సీ విశేషధనమార్జించి స్వదేశమునకు కొని పోయెను..

ఈ బొబ్బిలియుద్ధనాటకమును శ్రీ శాస్త్రిగారు 1916 లో ప్రకటించినను దానిని అంతకు చాలకాలము క్రిందనే రచియించి యుండిరి. వారే మాళవికయొక్క విన్నపములో నిట్లు వ్రాసియున్నారు. 'నేను ఆంధ్రసాహిత్యపరిషన్నిష్పాదితమైన శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకాధికారమున నున్న 1916—7 సం॥ల కాలములో 1916-వ సం॥మున అప్పటికి బహు వర్షములకు పూర్వము నారచియించియుండిన బొబ్బిలియుద్ధ నాటకమును ప్రకటించితిని.

' ఈనాటకములను నేను రచియించుట చాపలముచేత గాని ప్రజ్ఞాగర్వముచేత గాదు. శ్రీ విక్రమసింహపుర్యాంధ్ర భాషాభిమాని సమాజమువారు మత్కృతులనే ప్రయోగింపఁ గోరుదురు గావున, వారికి ప్రయోగార్థము' దీనిని రచించిరి. ఆ వెంటనే దీనింబఠించి శాస్త్రులవారికి తమ యభిప్రాయములను వ్రాసినవారిలో శ్రీ దొడ్ల వేంకటరామరెడ్డిగారొకరు. వీరు వట్టి

భాషాభిమానులు కారు; పండితులు, రసజ్ఞులు, స్వయము చక్కని వచనరచయిత. వీరి యుగంధరవిజయ మను నవలయు దొడ్డ రామాయణాది వచనగ్రంథములును చాల ప్రసిద్ధినందినవి. శాస్త్రులవారి యాప్తమిత్రులలో నొకరుగాన తమ యభిప్రాయములను యథాస్థితములుగా వ్రాయువారు. బొబ్బిలియుద్ధనాటకమును వారు మొదటమెచ్చుకొనక ఇట్లు వ్రాసిరి.

Kavali 10—8—1916

My dear and respected sir,

Many thanks for your kind post card received just now. I saw 'Bobbili' the other day at Nellore. Without any reserve I have to express my great regret for the thorough disappointment it gave me. I am obliged to think that the author of Pratapa and Usha is not the author of this Bobbili. As for plot and characterisation I am confident there would not be anything lacking though I have not gone through the whole book. About verses—you have wantonly sacrificed that superb and pregnant diction in order to pander to the tastes of the rabble. It greaves me very deeply. Of course there are a few jems here and there. Yet on the whole the verses have not got that dignity and eminent flights as can be found in your other works. I

cannot reasonably attribute this to your oldage. It is simply due to your determination, certainly unjustified, to please the mob who have no right to be pleased at the sacrifice of your reputation and learning. Excuse me for my openmindedness.

I am

yours ever obediently

D. Venkartarama Reddi

తర్వాత నొకజాబులోఁకూడ తెలుఁగులో వ్రాయుచు నిట్లు తెలిపిరి—26-8-16 Kavali.

"బొబ్బిలినాటకమును ఒకసారి సాంతముగాఁ జదివినాను" రంగారాయఁడు, హసేనాలి, హైదరుజంగు మున్నగు పాత్రలు మిక్కిలి చక్కఁగా స్వభావానుగుణంబుగా రూపింపఁబడినవి. వీరకరుణ రసంబులు యథావిధిగాఁ గలవు. మొత్తముమీఁద కథాసంవిధానాదులు తమ ప్రతిభకుఁ దగినట్లే యున్నవి...... కొన్ని పద్యములవిషయమున నాకుఁ దొల్లిఁటి యభిప్రాయము మఱలకున్నది. మొదటిపద్యములో 'తేనియ పట్టొకో' యనునది ఎంతయు హృద్యమైన యుపమయని నాతలఁపు. 'తితఉ' కూడ యింత స్వారస్యముగా లేదు. తమకుగల వస్తుస్వభావజ్ఞానమును జూపుటకు నిదియొక్కటియే చాలును."

తర్వాత బొబ్బిలినాటకమును ఆడఁగా చూచి తమయభిప్రాయమును మార్చుకొని చాల మెచ్చుకొని వ్రాసినారు.

Kavali 6—3—1920

My dear and respected sir,

Ever since Bobbili was published, I had no opportunity of attending the drama staged. Yes-

terday I had been to Nellore on some business, After finishing the work I went to bed. At about 12 P.M., I heard some music emanating from the Town Hall. At first I thought it might be some cenema performance. I waited sometime. Then I went to the Town Hall side simply to satisfy my curiosity. At the entrance I saw the board. On reading it I came to know it to be a performance of Bobbili by Samajam, Without even purchasing a ticket I went direct into the Hall. 4th Act was just closing. Mr. Sivaramaiah was there. We were there till the close.

The performance was splendid. The merit of the drama has become vivid to me then only. I felt very happy indeed. Mr. Sivaramayya told me that the previous portion also was splendidly enacted. I am sorry I was not present then. The delineation of the characters, the spirit and language showed the master touches very clearly.

The actors also deserve our thanks for having done their best.

Probably Bussy would have done better if he had delivered the speech with a foreign intonation. His character was life-like.

Pathos, heroism, valour, determination have aroused in the minds of the audience correspond-

ing feelings. In short, the performance was a splendid success. I am constrained to say that I was wrong when I expressed sometime ago that Bobbili is inferior to Pratapa,

How far has Amukta progressed? I long to see ఉత్తరరామచరిత enacted.

Yours ever obediently,
D. Venkataramareddi.

ఈ నాటకములో శాస్త్రిగారు భాషాభేదమును ఉషా ప్రతాపరుద్రీయములకన్న చక్కఁగా చూపినారు. విశాఖపట్టణమున కొంతకాలము బాల్యములో నుండి చదువుకొనిరి. బొబ్బిలి ఆ జిల్లాలోనిదేగదా. అప్పుడు బొబ్బిలివారిమాటలను చూచి అనుకరించిరి. తెనుఁగువారి జాతీయతాద్యోతకపదజాలము వారికి బాల్యముననే అలవడినది. అప్పుడు వింతగా కనఁబడిన వస్తువులు తర్వాత నెట్లో గ్రంథముల కెక్కనే ఎక్కినవి. ఈ బొబ్బిలి యుద్ధనాటకములో ఐదవయంకమున సిఫాయీలు తిరుగబాటు చేయుచున్నారనియు, సారాయిలేనిది వారు యుద్ధము చేయరనియు ఒక సిఫాయి బుస్సీకి నివేదించును. అప్పుడు బుస్సీ - 'అవును మా మాటగా బోడ్మిక్‌తో వారికి సారాయి మామూలు కొలతప్రకారము ఇమ్మనిచెప్పుము ' అని చెప్పును. ఈబోడ్మిక్ అనుపేరు విశాఖపట్టణములో నొక సారాయిదుకాణదారుని కుండెను. వినినక్రొత్తలో చాలవేడుకగా నుండి నందున సమయము దొరకినప్పుడు ప్రయోగించిరి. ఇట్టివి వారిగ్రంథములలో చాల చూడవచ్చును.

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున శ్రీశాస్త్రిగారి స్వతంత్ర నాటకములు అత్యున్నతస్థానము నాక్రమించుచున్నవి. ఉషా ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధనాటకములు మూఁడును మూఁడు విధముల ఆంధ్రనాటకరచనా విధానమునకు అనంతరచయితల కెల్ల మార్గదర్శకములైనవి. మొదటిది (ప్రతాప) ప్రబంధ ధోరణిని, రెండవది (ఉష) సంస్కృతనాటకముల శైలిని, మూఁడవది (బొబ్బిలి) ఆంగ్లనాటకముల సాంప్రదాయములను ఆంధ్రుల కందించుచు ఆంధ్రజాతీయతను ప్రతిబింబింపఁజేసినవి. తెనుఁగు నుడికారము పరమావధిం బొందినది. ఈనాటకములలో సంవిధాన చమత్కారము, సన్నివేశసౌభాగ్యము, సమన్వయసౌలభ్యము, పాత్రనిర్మాణకౌశలము, రసపోషణము, కవన స్వారస్యము, మొదలైనవాని చేతను, బహుపాత్రనిర్మాణముం గావించి ఎనిమిది తొమ్మిదితెగల గ్రామ్యభేదములను చూపుట చేతను ఆంధ్రులకు శాశ్వతముగా రూపకరచనావిధానమును చూపినారు.

ఈనాటకమును శ్రీ మాతాతగారు పలుమార్లు తమ శైతులచేఁ బ్రదర్శింపించుచు ఆయా ప్రదర్శనకాలములయందు తమ చిత్తమునకు రసము అందునట్లుగా మరలమరల అచ్చట నచ్చట మార్చుచు దిద్దియుంచి యుండిరి. ఆ సవరణల ప్రకారము ద్వితీయ ముద్రణమును 1934 నేను కావించితిని. 500 ప్రతులు ముద్రించితిని. ఇప్పుడు మరల దానిని యథాస్థితముగా పునర్ముద్రణ మొనరించుచు నీచారిత్రకవిషయములను వ్రాసితిని. ఐదు వందల ప్రతులు చెల్లుటకు ఇరువది సంవత్సరములు పట్టినది !!!

25-మే-1954 శాస్త్రిమనుమఁడు.



# బొబ్బిలియుద్ధనాటకము.

## ప్రథమముద్రణ విజ్ఞప్తి.

ఈ చిన్నిపొత్తమున — శీలసంరక్షణమునకై కుసుమ సుకుమారముల గాత్రవపువుల నగ్నిసాత్కరించువారును నిజసదాచార మహిమచేత శాపానుగ్రహ సామర్థ్యము కలవారును అగు నర్ధాంగలక్ష్ములచే విరాజిల్లుచు, నిజ బాహుపరాక్రమముచేత ఆసేతు వింధ్యాచలము జమీను తేర్పరించుకొని, మానముకై ప్రాణమును తృణముగా నొడ్డుచు, ప్రతాపరుద్రాది రాజాధిరాజాధిష్ఠిత హిందూరాజ్య సంస్థాపకులై క్షత్త్రధర్మౌదార్య వైదుష్యముల చేత భీష్మ విక్రమ భోజులను మఱపించుచు, అనన్యవిషయమై పరమశివుని యందే వర్తించు నీశ్వరశబ్దమువోలె దొరశబ్దము అనన్యకులనామసాధారణముగా తమకుల నామముతోనే సుఘటితమై వెలుఁగొందు ప్రాభవముగల వెలమదొరలలో నుదాహరణభూతులైన బొబ్బిలి మహావీరుల పుణ్యచరిత్రము కీర్తింపఁబడినది.

ఇక్కథకు ఆకరములు రెండు సులభములు, పెద్దాడ మల్లేశకవి పాటయు, రంగరాట్చరిత్రమను పద్యకావ్యంబును. ఇందు రెండవది కావ్యమార్గమున మెఱుఁగెక్కియున్నను, రసనిష్యందంబున పాటకు ఈడుగాక యున్నది.

ఇట్టి యీకథను చూపెడు దృశ్యకావ్యములు ఇప్పటికే రెండుండఁగా ఈమూఁడవదానిని నారచియించుట, 'వారు గంగాస్నానము చేసిరని వీరు మానుదురా' అనున్యాయంబున మర్షణీయమనియు మత్ప్రణీతములను మాత్రమే ప్రయోగించుటకు నియతి పెట్టుకొని యున్న నెల్లూరి

యాంధ్రభాషాభిమాని సమాజమువారి నిర్బంధము చేతను, వస్తుగుణాను రాగకృత చాపల్యము చేతను దీనిని వ్రాసితిననియు, విన్నవించుకొను చున్నాను.

దీనిని వ్రాసిన ముద్రించిన తీవరములో పొరఁబాట్లు పెల్లుగా నుప్పతిల్లియుండును. వానిని పెద్దలు మన్నింతురుగాక యనియు, ద్వితీయముద్రణము ఘటిల్లిన అప్పటికి నేను నుండిన నేనును యథామతి కనిపట్టి సవరించెదననియు విన్నవించు కొనుచున్నాఁడను.

వేదము వేంకటరాయశాస్త్రి.

---

## ఇందలి కథాసందర్భము.

---

గోలకొండ నైజాముగారు ఉత్తరసర్కారులలో జమీన్దారులవలన కప్పము తెండు మని ఫ్రెంచివారి సేనాపతిని బుస్సీదొరను నియమించి, ఆతనికి అతని ఫ్రెంచి దండునకు తోడుగా గొప్ప గోలకొండ సైన్యము నిచ్చి, హైదర్జంగు అనువానిని దివానుగా నేర్పరించినారు. వారు వచ్చి రాజమహేంద్రవరముకడ విడిసి ఉత్తరమంపలి జమీన్దారులకు తెలిపినారు. వెంటనే విజయనగరము నేలు విజయరామరాజు బూసీదర్శనమునకు వచ్చెను. బొబ్బిలి జమీనును హరింపవలయు నని ఎప్పుడును కోరుచుండు వాఁడు విజయరామరాజు గోలకొండవారి హర్కారాలకు లంచమిచ్చి వారు బొబ్బిలి రంగారాయనికై తెచ్చిన జాబును ఆయనకు చేరనీక ఆఁపివైచెను. అందువలన వెంగలాయీల రాక తెలియక బొబ్బిలిదొర రాజమహేంద్రవరమునకు బూసీచేటికి రాలేదు. రాజు వెంగలాయీల చేతికి రమ్మని రంగారాయనికి తాను జాబు పంపినట్లును, గర్వాంధుఁడై యాతఁడు రానియట్లును బుస్సీని నమ్మించి, ఆయహంకారము నడంచుటకై వారు బొబ్బిలిని కొట్టవలసినట్లును, రంగారాయఁడు నిరంతరము తనకు ఉపద్రవములు చేయుచుండుటవలన తాను తన పేష్కష్షును ఇయ్యలేక పోయినట్లును ఇప్పుడు వారు అతనిం గొట్టి యాతని జమీనును తన కిత్తురేని రెండు జమీనుల పైకమును నిలువలతోఁగూడ సమస్తమును తానే కట్టునట్లును, వారి నొడంబఱిచెను. ఆ ప్రకారము సెలవిచ్చునందులకై బుస్సీకి తెలియనీయక లక్షవరహాలు హైదరుజంగునకు లంచము ఇయ్యనొప్పుకొనెను.

బొబ్బిలివారు ఈవృత్తాంతము నేమియు నెఱుంగక 50 పెండిండ్ల మహోత్సవములో మునింగి యుండిరి. రాత్రి కోటలో ఊరేగింపు ముగియుచుండఁగా, తెల్లవారఁ బోవుచుండఁగా, ఊరి బయట రాజాను వెంగ

లాయీలను ముట్టడి ముగించిరి. పగలు రాయబారములు. బూసీదూత వచ్చి రంగారాయని దర్శించి హైదర్జంగుమాటగా, తత్క్షణమే వీరు సొం త్తును మాన్యములనిచ్చినట్లును, జాము సేపులో, కోట వెడలి పాలకొండకు పోవలసినట్లును తెలిపెను. వీరు అందులకు అంగీకరింపక బదులు రాయబారము పంపిరి. వీరి రాయబారిని హైదరు లోనగువారు తిరస్కరింపఁగా నాతఁడు అడ్డమయినవారినెల్ల తెగనఱకుకొని కోటకు వచ్చి తన పోక ఫలింప దాయెనని రాయనికిం జెప్పెను. అది మొదలు యుద్ధ నిశ్చయము. బొబ్బిలి వారి సన్నాహము. ఆరాత్రి 12 గంటలప్పుడు కోటఁ గూల్చుటకు ఫెంగ లాయీల యారంభము. ఘోరయుద్ధము. కోమటి చెలువలు సయితము వైరులను బుస జెక్కనీయక పోరిరి. వెలమలు తెలగాలు బలిజెలు ఆయా బురుజాలందు వైరులం జొరనీయక ప్రాణాంతము పోరాడిరి. పరాసులు ఈ బొబ్బిలి గడ్డలోని వీరుల పరాక్రమమునకు ఆశ్చర్యపడిరి, పలువురు మడిసిరి, అవశిష్టులు బురుజాలం బట్టిరి.

ఈ సమయాన రంగారాయని తమ్ముఁడు వెంగళరాయఁడు కోట వెలువడి ఫెంగలాయీలతో పోరి మడిసెను. ఇంతలో విట ఫెంగలాయీలును కోటను పతావుల పడఁగొట్టిరి. వారు లోనజొత్తు రనియు, శేషించియున్న పురుషులు మడిసిన యనంతరము ఆవైరులవలన తమకు మానరక్షకు లుండ రనియు, తలంచి, ఒక్కుమ్మడి వెలమదొరసానులు (పెండ్లికొమారితలును) తెలఁగాస్త్రీలుం లోనగు ఘోషావర్ణముల మానవతులుం వారి వరవుడులును కోటలోని యాఁడుఁబురుగెల్ల ఆబాలావృద్ధము పొడుచుకొని చచ్చిరి, తమ భర్తలచే నిహతలయిరి, చిచ్చుం జొచ్చిరి. కుమారులు తల్లులం జంపిరి, శిశువులను తండ్రులు కడపిరి.

ఇట్లు గోహారయిన వెంటనే రంగారావు కోట వెలువడి ఫెంగలాయి పేరాల మీఁదికి పోయి దుమికి, వీరలోకభయంకరముగా పోరి, జీవముతో వైరులకు పట్టువడక, సంధి కొడంబడక, అవయవములు ఆయుధఘాతులచే

లుప్తములు కాఁగా కాఁగా సూర్యోదయ సమయమున వీరస్వర్గము నలంకరించెను.

ఈతనికుమారుని శిశువును చినవేంకటరాయని పినతల్లి కడకు సామర్లకోటకు కొనిపోవుచు దాది యీ పెంగలాయీలకు పట్టుబడెను. బుస్సీదొర ఆశిశువును తగినరక్షకపరివార మిచ్చి సామర్లకోటకు పంపెను.

ఈవృత్తాంత మెల్ల తెలియుడు రాజాము తాణాలో నున్న తాండ్ర పాపారాయఁడు రంగారాయని బావ, తనదివాను మిరియాలసీతన్నతోఁ గూడ, బొబ్బిలికి వచ్చి రాత్రి డేరాలో నిద్రితుని విజయరామరాజును నిద్ర లేపి, బొబ్బిలిరాణి మల్లమ్మదేవి పలికిన శాపము ప్రకారము చిత్రవధ గావించి, తాను పొడుచుకొని చచ్చెను.

పిమ్మట సామర్లకోట నీలాద్రిరావు చినవేంకటరాయని నైజాముగారి దర్శనమునకుం గొనిపోయెను. ఈ లోపలఁ ఉత్తరసర్కారులు ఇంగ్లీషువారి ఏలుబడి లోనికి వచ్చినందున నైజామువారిసిఫారసు చేతను మదరాసు గవర్నమెంటువారు బొబ్బిలి సంస్థానమును చినవేంకటరాయనివారికి జమీనుగా నొసంగిరి.

## ఈ నాటకమందలి పాత్రములు.

### పురుషులు.

సూత్రధారుఁడు.

పారిపార్శ్వకుఁడు.

పూసపాటి విజయరామరాజు,
లేక, కళింగరాజు. లేక, రాజు. — విజయనగరము రాజు, క్షత్రియుఁడు.

౨ హర్కారాలు.

గుండాల అప్పన్న (పంతులు,) రాజుగారి సర్దారులు

౪ సామంతరాజులు—రాజుగారి సర్దారులు

మంత్రి — ... మంత్రి.

బూసీ—గోలకొండ నైజాముగారి ఫ్రెంచి సేనాయకుఁడు; ఈ రణము సర్వాధికారి.

హైదరుజంగు—బూసీకి దివాను.

౨౪ గోలకొండ సర్దారులు.

నీలాద్రిరాయఁడు—సామర్లకోట జమీన్దారు, పిఠాపురము దొర.

సుబ్బన్న, రామయ్య, భీమశంకరము, సోమన్న, పార్లు బ్రాహ్మణుఁడు వెంకన్న:—బొబ్బిలిలో పెండ్లి సత్రభుక్కులు, భూరికి వచ్చినవారు.

౨ వేగులు—రంగారాయనింగారికి బయటి వృత్తాంతములు నివేదించువారు.

రంగారావు. లేక రంగారాయనింగారు.
లేక, రంగారాయఁడు — బొబ్బిలి జమీనారుఁడు.

వెంగళరావు—రంగారాయని తమ్ముఁడు.

ప్రతీహారి—రంగారాయాస్థాన దౌవారికుఁడు.

వేదాంతి, శాస్త్రి, జోస్యుఁడు, విద్యార్థి, కవి, మాంత్రికుడు:—బొబ్బిలిలో పెద్దచెఱువు స్నానఘట్టమునకు వచ్చిన బ్రాహ్మణులు.

ధర్మారావు—రగారాయని బావమఱఁది. అతని దివాను.

హాసేవాలి—గోలకొండవారి రాయబారి.

రాయనివారి సభ్యులు.

రామయ్య——రాయనివారి కరణము.

వేంకటరంగారావు, శేక,<br>చిన్నవేంకటరాయఁడు } రంగారాయని కుమారుఁడు, బాలుఁడు

౩ బొబ్బిలి దళవాయులు.

పడవాలురామయ్య<br>ముత్త్యాలపాపయ్య } బొబ్బిలి దళవాయులు,

అప్పఁడు<br>సన్నాని<br>కుజ్జివాఁడు } బొబ్బిలి పౌరులు.

౪ పౌరులు.

౮ కోమటి చెలువలు.

దౌవారికుఁడు—బుస్సీ పేరాకడ కావలివాఁడు,

ముసేపవాల్—బొబ్బిలికోటను కొట్టిన సర్దారుఁడు.

౪ సర్దారులు.—బుస్సీక్రింద సేనాపతులు.

లాలి.—ఒక ఫ్రెంచిసర్దారుఁడు.

౪ నివేదకులు.—బుస్సీకి యుద్ధవృత్తాంతమును ఎప్పటి కప్పుడు వచ్చి చెప్పుచుండువారు.

కింకరుఁడు.—విజయరామరాజుగారి సేవకుఁడు.

సేవకులు.—బుస్సీదొరగారి నౌకరులు.

చెలికాని వెంకయ్య.—రాయనింగారి బంధువు.

జక్కుఁడు.—వెంగళరాయని తైనాతువాఁడు.

౧౦ పెండ్లికుమారులు.—వెలమదొరలు.

(బొబ్బిలివారి) నౌకరులు.

(గోలకొండవారి) నౌకరులు.

కట్టినాయకుఁడు
౪ కట్టివాండ్రు } బొబ్బిలివాండ్రు
చాటింపు కట్టివాఁడు

తాండ్రపాపయ్య.—రంగారాయనింగారి బావ.

మిరియాలసీతన్న.—పాపయ్యకు దివాను.

(మొగలాయీ) దండు.

(మొగలాయీ) సిఫాయి.

పిల్లారాముఁడు.—విజయరామరాజుగారి పానము లొత్తు సేవకుఁడు.

నైజాము.—గోలకొండ ప్రభువు.

టోగ్రాలి.—వారి వజీరు.

స్త్రీలు.

నటి.

బ్రాహ్మణి.—భూరికి సంతర్పణలకు వచ్చి నట్టిది.

చంటిపిల్ల.—బ్రాహ్మణి కూఁతురు.

మల్లమ్మదేవి.—బొబ్బిలి రాణి.

వెంకటలక్ష్మి.—బొబ్బిలివారి పెద్ద దాసి.

సుందరమ్మ —రంగారాయని కూఁతురు. (ఒక పెండ్లి కూఁతురు)

౪౯ పెండ్లికూఁతులు.

అన్న.—బొబ్బిలిరాయనింగారి పౌరోహితుని భార్య.

కామాక్షి.—ఒకదాసి.

కమలాక్షి.— ,,

పేరఁటాండ్రు. బొబ్బిలిలోని విప్రపురంధ్రులు.

౨ వేగు యువతులు.



# బొబ్బిలియుద్ధనాటకము.

శా. శ్రీనాథుం డిలకున్ భరం బుడుప నాజిం బెట్టుదున్, దాన, వీ
రానీకంబు లురఃక్షతాధ్వమున డాయన్ డూయ, నెవ్వాఁడు క
న్గో నోఁ దేనియపట్టౌశో తితఁడు వాకొ్క నాఁగ, శస్త్రార్థి యా
భానుం డేనవజార్జి లోకపతి సర్వశ్రీయుతు న్జేయుతన్.

చం. కరమున శూలి, నెన్నుదుటికంటను గీలి, సిగన్ భపాలి, యం
బరమునఁ జూలి, భిక్షఁ గొనుపాత్రమునం గకపాలి, మేన సుం
దరతమకాళి, భూషణగణంబున వ్యాళి, జడం బ్రియాళి, కం
ధరమున క్ష్వేళి యైకరుణ నన్గను వేలుపు మిమ్ముఁ బ్రోచుతన్.

## ఇఁక ప్రస్తావన

### నాంద్యంతమున

సూత్రధారుఁడు.—(ప్రవేశించి) మారిషా, త్వరగా రమ్ము.

పారిపార్శ్వకుఁడు.—(ప్రవేశించి) ఇదుగో వచ్చినాను బావా.

సూత్ర.—ఇప్పుడే ఈయార్యమిశ్రుల మ్రోల బొబ్బిలియుద్ధము నాడవలయును; నీవు పోయి పాత్రవర్గమును హెచ్చరింపుము.

పారి.—అబ్బబ్బ! బొబ్బిలినాటక మంటే నాగుండెలు తల్లడిల్లి నావొళ్లు జల్లుమంటుంది బావా. మరొకనాటకం ఆడరాదా?

సూత్ర.—[పరిహాసముగా] అంతటి బంటవేని విజయరామరాజు వేషము వేసికోరా.

పారి.—[కొంగము చిట్లించుకొనుచు] తాండ్రపాపయ్యవేసాన వొచ్చి 33 పోట్లు లెక్కపెట్టి పొడిచి చంపడానికా?

సూత్ర.—[పారి పార్శ్వకునిం బోసిక పట్టుకొని] కాదురా మూర్ఖా. మనకు కీర్తివలయు నేని దానినే ఆడవలయును. ఏల యనఁ?

ఆ. తప్పు లెల్ల నడఁచి యొప్పులు గురియించు
రంగరావ్రకీర్తి రంగమందుఁ,
బాప మడఁచి యిష్టఫలము లొసఁగఁ జేయు
పారిజాత పాదపంబు కరణి. 3

పారి.—నా కక్కరలేదయ్యా. [స్వగతము] ఇందులో యేవేసం వొచ్చినా నాకు మధ్యలో డింకకొట్టేదిగానే వొస్తుంది.

[అని తటాలున విడిపించుకొని నిష్క్రమించును.

సూత్ర.—ఔరా, ఎంతమూర్ఖుఁడు! [కోపముగా నేపథ్యమువైపు చూచి] ఆర్యా, ఇటు రమ్ము; నీవు పూనుకోక ఈపని గాదు.

నటి [ప్రవేశించి]—కోప మెందులకు ఆర్యపుత్రా?

సూత్ర.—నీతమ్ముఁడు ఇపుడు అమాంతముగా నాపుట్టి ముంచి నాఁడు. ఈయార్యమిశ్రులమ్రోల బొబ్బిలియుద్ధము నాడి మనవైరులకు చెంపపెట్లు వేయింపవలసియుండఁగా వేసము వేయక పరారి రైనాఁడు!

నటి.—వానితో నేమి ఆర్యపుత్రా? మీతమ్ములు లేరా? నేను లేనా? కోపము మాని ప్రకృత మానతిమ్ము. మన మాడవలసిన బొబ్బిలినాటకము ఎవరు కావించినది?

సూత్ర.—శ్రీమద్వేంకటగిరి సింహాపీఠాధిష్ఠాతృ శ్రీశ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రమహారాజ నిరంతర బహూకృత శ్రీమద్వేదాన్వవాయ వేంకటరాయ శాస్త్రిగారు రాజా కావించినట్టిది.

నటి.—అదే?

సూత్ర.—అదే.

నటి.—బళే! బలాశ! అది మనపాలిటి కల్పవృక్షము గదా! మతి సె నరిగి పాత్రవర్గమును సిద్ధపఱిచెదను. [అని పోనుంకించును.]

సూత్ర.—పోకుము. ఈ కార్యమిత్రులు నీశరద్గీతమును వినుటకుం జెవులూరుచుం గనుపెట్టుకొని యున్నారు.

నటి.—అటయినఁ బాడెదను.

* వచ్చెఁ జెలియ, యంచ లులియు వాసరంబులే
చెచ్చెర వికసిల్లు కల్వ శ్రీసరంబులే. వచ్చె ...

సూత్ర.—[స్వగతము] ఆహా! యేమిపాటరా దీనిది! ఈ నాటకము వలన మరల నాకీర్తి పర్వి వావైరివర్గమునకు పెద్దలచేత చెంపకాయ అగును. నిశ్చయము. నిశ్చయము.

[నేపథ్యమున]

[భేరులు మ్రోఁగును, వీరకాహళములు మొరయును]

[వెండియు నేపథ్యమున]

హా ఆలాంటిచెంపపెట్లు మేము దప్ప మరెవ్వరూ యెప్పుడూ తిని వుండరు మహాప్రభో. వీరభద్రుడి చేత దక్షప్రజాపతి సహితూ తినివుండడు!

[నటి విని తెచ్చవడి యరయుచుండును

సూత్ర.—[తెచ్చవడి] ఏమి యీ విఘ్నము!

[మరల భేరీకాహళములు మెరయును.

సూత్ర—[ఆలోచించుట నభినయించి]—వహావ్వా వహావ్వా! ఎంత మంచియుపశ్రుతి! ఆ వాద్యధ్వానములవలె మన కీర్తి వ్యాపించి, ఆ పొట్లవలె మనవైరులకు చెంపపెట్లగు ననుట. అవును గాని ఈ యడావుడియంతయు నేమి? [నిర్వర్ణించి] ఓహో యిపుడే మహాపరివారములతో విజయనగరాధీశ్వరులు

---

* దీనిని పూర్తిగా ప్రతాపరుద్రీయమున చూడనగును.

మస్నెముల్తాక్ బహద్దరు విజయరామరాజుగారు గోలకొండవారి సేనాపతి బుస్సీదొరగారి బేటికి, ఎదుట సానిమేళాలతోఁ గూడతరలి యీదారినే వచ్చుచున్నారు. ఆమొత్తము ఈగుంపులోనిదే కావలయు. ఈగందడలో తగుల్కొనక తప్పించుకొనిపోవుదము రమ్ము. [అని వడివడిగానిష్క్రమింతురు.

ప్రస్తావన సమాప్తము.

# ప్రథమాంకము.

స్థలకము:—కోటిలింగ రాజమహేంద్రవరముల నడుమ.

[విజయరామరాజు సచివసామంతాది మహాపరివారముతో యథానిర్దిష్టము ప్రవేశించును]

రాజు.—[స్వగతము] ఈమాట నాకు విజయము కలిగి నా విజయరామనామము సార్థము కావలయును.

హర్కారాలు.—[రాజు యెదుటికి చొచ్చి] ఏలినవారి హర్కారాలము మేము ? మా మొఱ్ఱ ఆలకించరేమి మహాప్రభో మాయేలినవాడా! ఆలాంటి చెంపపెట్లు (ఇత్యాది.)

రాజు.—[కని విని.] అప్పన్నా, ఏమి ఆదిలోనే యీ యపశకునము. ఎవరువీరు?

అప్పన్న:—[జనాంతికము] మహాప్రభూ, వీరు ఏలినవారి యానతిచేత [తన్ను నిర్దేశించుకొనుచు] ఈనాకరుచేత తయ్యారయిన మన వేగులు. ఇటనుండి బొబ్బిలికి ప్రకాశముగా హర్కారాలుగా తరలి, విజయనగరము దాటఁగానే వేగులుగామాఱి, అచటి వృత్తాంత మెల్లం గని, మరల హర్కారాలుగా, ఇట మాఱి, ప్రవేశించినారు. వీరు బుస్సీయెదుట రాయనిమీఁది మన ప్రయోగమునకు మిక్కిలి సాధనభూతు లగువారు.

రాజు.—[జనాంతికము] బళి బళీ! అప్పన్నా! నీవోయి మమ్ముఁ గొలువ నేర్చినవాఁడవు! మంచిది, వీరియుద్దికం గనియెదఁగాక. [ప్రకాశము] ఎవరురా మీరు? ఏల మామ్రోల నిట్లు మొఱ యిడెదరు?

హర్కారాలు.—మహాప్రభూ, మేము ఏలినవారి జాబులు బొబ్బిలికి రంగారాయనింగారికి తీసుకొవెళ్లిన హర్కారాలమండి. మమ్ముల్ని అక్కడ తన్ని చెంపకాయలు కొట్టి వెనక్కి తగిలేసినారండి.

[రాజును అప్పన్నయు మొగమొగంబులు చూతురు.

రాజా.—[హార్కారాల నుద్దేశించి] ఏమిరా, మీరు జాబు వారికి ఇచ్చినారా లేదా?

హార్కా.—ఏలినవారిజాబు లని చెప్పఁగానే, వారి తమ్ములు వెంగళరావుగారు పెరుకొని చింపి పారేశి మమ్మల్ని నోరు తెరవనీక పీక పట్టుకొని తన్ని చెంపలు వాయించి తగిలేశినారు మహాప్రభో.—"అలాంటి చెంపకాయలు" ఇత్యాది.

రాజా.—[ఆత్మగతము] చక్కఁగానే తయ్యారు చేసినాఁడే అప్పన్న! [ప్రకాశము] హా! ఏమి దీమసము! ఏమి దీమసము! [అప్పన్నతో, జనాంతికము] మఱి పరాకులరాక అక్కడవారి కే మయిన తెలిసిన ట్లున్న దేమో కనుంగొనుము.

అప్పన్న.—[జనాంతికము] నే నప్పుడే విచారించితిని. తెలిసినజాడ లేదఁట మహాప్రభూ.

రాజా.—[స్వగతము] అది నా ప్రయోగమునకు కరమనుకూలము. [అప్పన్నతో జనాంతికము] కోటలో పెండిండ్లు ఎట్లున్నవో కనుఁగొంటివా ?

అప్పన్న.—[జనాంతికము] ఏఁబది పెండిండ్లు జరుగనున్న వఁట.

రాజా.—[అప్పన్నతో జనాంతికము] తాండ్రపాపయ్య బొబ్బిలికి వచ్చినాడా ?

అప్పన్న.—[జనాంతికము] పాపయ్య పితూరీలు అణఁగఁగొట్టుటకు రాజాము లోనేయున్నాఁ డఁట.

రాజా.—[వికటముగా నటు నిటు పరిక్రమించుచు, ఆత్మగతము] బళి, అక్కఱకు వచ్చినవి రాజాముసీమలో నాచేయించిన పితూరీలు! పితూరీదార్లకు సాయముగా నేఁ బంచినరాణువ అక్కడ చాటున మాటున కావలసినంత యున్నది. కనుక ఆపితూరీలు రావణాసురుని తలకాయలే అగును. ఇతఁడు బొబ్బిలికి రాఁజాలఁడు. ఎట్టకేలకు వచ్చె నేని అంచెల

మీఁద వచ్చి, ముడులు పడఁగానే, అంచెలమీఁదనే మరలును. [ఆలోచించి, హర్షములో] ఓహోహ్హో! బుస్సీచేటికి రంగారావు రామి నాకు దేవుఁడు ఇచ్చినవరము. నాకార్యసిద్ధికి ఇదియే బీజము. బుస్సీహైదరులను ఇతనిపైకి ఎసఁగొల్పుటకై నాచేసిన సంకల్పము నెఱవేఱినది! ఇతఁడు లేనందున నాయిచ్చవచ్చినట్లు వారికడ నితనిని కొండెలు నఱకెద. ఎంత లంచమైనను ఇచ్చి వారిచే ఈవెలమలను రూపుమాపించి, మా యానంద రాజునకు బొబ్బిలి పట్టము గట్టించుకొనియెద. [మహౌద్ధత్యములో] నేను ఈబొబ్బిలిమీఁద,

కాకుల గ్రద్దలఁ గాఱాడింపనేని కాను విజయరాముఁడ.
వీరబొబ్బిలిఁ గాల్చి పేరు మాపనేని— కాను ...
రావుపురువు నెల్ల గావు పెట్టనేని— కాను ...
నీటుఁగోట పాటి బాట సేయనేని— కాను ...
ఆముదాలు సల్లి యానందింపనేని— కాను ...
పొగతోఁట వేసి యాపొగ పీలువనేని కాను ...
కోటను బులివేఁట కోన సేయనేని— కాను ...
ఆనందు బొబ్బిలి కభిషేకింపనేని— కాను ...

వీరబొబ్బిలి యనుట దీనిని తగులం బెట్టి నీఱుబొబ్బిలి చేసెదను. [ప్రకాశము, సర్దారుల నుద్దేశించి] మాసర్దారులారా వైరిలక్ష్మీబందీగ్రాహకులారా, మన నాయమును బొబ్బిలివారి నాయమునుం గంటిరా?

సామంతరాజులు.—కనకేమి? వారిదెప్పుడును పెడబుద్ధియే.

రాజు.—[అపవారించి] అప్పన్నా, నీవు నీయేలినవారిని కొలువ నేర్తువేని, ఈ కార్యాకారాలను ఇంతకన్నను తీవ్రముగా సిద్ధపఱుపుము. బుస్సీ హైదరుజంగులను రంగారాయఁడు మిక్కిలి తిరస్కరించినట్లుగా

ఈ హర్కారాలచేత ఆ యిద్దఱ ప్రాణాలను చెప్పింపవలయును. అవసరము కనుంగొని బూసియెదుటకి వీరిని నీవు కొనిరావలయును. ఈ ప్రయోగముచేత,

క. గండారు రంగరాయని
గుండానం ద్రోచి నీదు కుల నామంబుల్
బండిశ్, సార్థము సేయుము,
గండాల కులాబ్ధి యమృతగుండా, యప్పా ౪

అప్పన్న.—చిత్తము మహాప్రభూ.

రాజు.—[చెవిలో] అప్పన్నా రెండింఢ్లమాటను చెప్పనీయకుమా.

అప్పన్న.—మహాప్రభూ, అదికూడ నాకుఁ జెప్పవలయుఁనా ? [హర్కారాలను దఱికి] రండోయి రండి. వారు చెంపకాయలిచ్చిన మనము వారికి చెంపపం డ్లిత్తము. వా రిచ్చినవే పండవాకే మఱి వారివి వారికే ఇచ్చివేయుదము రండి.

[అని వారితో నిష్క్రమించును.

రాజు.—సర్దారులారా, బూసీ డేరాకు నడువుఁడు.

[అందఱును పరిక్రమింతురు.

రాజు.—ఇదె డేరాకడకు వచ్చితిమి. మంత్రిగారూ, మారాక వారికి తెలుపవలయును.

మంత్రి.—చిత్తము సర్కార్ నే నరిగి తెలిపెదను. [అని నేపథ్యమున కరిగి తానును హైదరుజంగును వెలికివచ్చి రాజుతో] వీరు హైదరు జంగుబహద్దరుగారు, బుస్సీగారికి దివాను.

హైదరు—సలాం మహారాజావార్కి.

రాజు.—సలాము హైదర్జంగుబహద్దరువారికి.

హైదరు.—మహారాజావారు మంతిరి సామంతుల్తోకూడా డేరాలోపల్కి రావచ్చును. బూసీదొరగారు కచేహారిరై యున్నారు.

[అందఱును పరిక్రమింతురు.

[అంతట బూసీ యథానిర్దిష్టముగా ప్రవేశించును.]

హైదరు.—వారే బూసీదొరగారు.

రాజా.—సలాము బూసీగారికి; సలాము వారిసర్దారులకు.

[బూసీప్రభృతులు లేతురు.

బూసీ.—[టోపీ యెత్తి] సలాము మహారాజాగారికి.

సర్దారులు.—సలాం మహారాజా గారికి.

సామంతులు.—సలాము మూసాబూసీగారికిని వారిసర్దారులకు.

బూసీప్రభృతులు.—సలాము మహారాజాగారిసర్దారులకు.

[రాజాకనుసన్నను పరివారజనులు బూసీ యెదుట నజరు లుంతురు; వానిని బూసీ పరికించును.

హైదరు.—మహారాజాగారు వారి సర్దార్లు అందరూ కూర్చుండవాలా. [అందఱును కూర్చుందురు.

రాజా.—[బుస్సీతో] తమ సర్దారుల నామధేయ విక్రమాదికముల వినం గుతూహలపడుచున్నాను.

బుస్సీ—మన్సెబుల్లాను వారికి మన సర్దారులను తెలుపుము హైదరు జంగు బహద్దర్.

హైదరు.—[ఒక్కొక్కరిని నిర్దేశించి చూపించుచు] వీరు సిద్దీబిలాల్, కల్బర్గీ కొట్టినవారు. వీరు మూసేపనాల్, మరాటిభూములకి హతాహతం చేసినవారు. వీరు హాసేన్ ఖాన్, ఆర్కాటికి కొట్టినవారు. మఱి వీరంతా ఏద్వడితే అదీ కొట్టినవారు.

బూసీ.—మన్సెబుల్లానుగారి సర్దారులను ఒకరొకరినిగా మేము తెలిసికోవలయును. [రాజా మంత్రివైపు చూచును.

మంత్రి.—[ఒక్కొక్కరిని నిర్దేశించుచు] వీరు గోలుగొండ యెఱ్ఱభూపతిగారు; వీరు కిమిడి నారాయణదేవుగారు? వీరు ఆత్రగడ్డ వారిశ్చం

ద్రుఁడుగారు; వీరు మాడుగుల లింగారావుగారు; వీరు వంకమీసపు భూపతి రాజుగారు;

బుస్సీ.—మఱి మనము కూడినపని జరిగింతమా?

రాజా.—ఈపహారాలు దాఁటి తమ దర్శనము చేసికొనునప్పటికే మా పని మోడి యెత్తుట యైనది. ఇఁకను మా భాగ్య మెట్లున్నదో? మా యేలినవారు గోలకొండపాదుషావారు మమ్ము బుస్సీదొరగారు హైదరుజంగు బహద్దరువారు అనెడి యీరెండు కన్నులతో చూచుచున్నారు.

ఆ. చల్లచూడ్కి మీరు సాఁచిన మామీఁదఁ
బాదుసాహి మాకు భద్ర మొసఁగు.
వేఁడిచూడ్కి మీరు పెట్టిన మామీఁదఁ
బాదుసాహి మాకు భయ మొసంగు. ౫

అట్లగుటంబట్టి;—

శా. అప్రత్యక్షునిఁ బాదుషాహరి నెదన్
ధ్యానించి, మీకుం దదీ
య ప్రత్యక్ష పరార్ధ్య మూర్తులకు మా
యర్చల్ నుతుల్ భక్తితో
శ్రీప్రానుగ్రహకాంక్షచే ముడుపులున్
జెల్లించి, నిర్భీతి పూ
ర్వ ప్రాకామ్య వరంబు వేఁడెదను వీ
రవ్యాఘ్రులారా మిమున్. ౬

ఇచ్చట మాకు శుభసూచకములు కలిగిన నచ్చట మాకు శుభమే.

బుస్సీ.—మావలన నేమున్నది? తమ భాగ్యమునకు గోలకొండ నిజాము వారిచి తము.

హైదరు.—షేం వారి హుకుం సెరవేర్చే నౌఖర్లము. మాపని మీకీ తెల్సునా? వారికీకోషం.

పై కాము కట్టానీ పందాలకీ కర్క్కాల్ నర్కీకుప్పర్ కూల్చడం.

మాపనీ నర్కీకుప్పల్ కూల్చడం.

కళ్కళ్కళ్లాడేటి గ్రామాల్కీ పట్ణాల్కీ మల్లల్లల్లాడ్చెయ్యడం.

మాపనీ మల్లల్ల ల్లాడ్చెయ్యడం.

కోటల్కీ ఫీరంగీ షేటూలు దూటెంచి పాటీనేలల్ శెయ్యడం-

మాపనీ పాటీనేలల్ శెయ్యడం.

దుర్గాలకీ పట్టి పుర్గు లేక కొట్టి గిగ్గిర్గిర్ దొర్లించడం-

మాపనీ గిగ్గిర్గిర్ దొర్లించడం.

లూటీల్కీ తీస్కెల్లి ఘేటగోల్కాండ్లో కొలెత్తుపోగొయ్యడం

మాపని కొలెత్తు పోగొయ్యడం.

బుస్సీ.—అది యుండుఁగాక; పాదుషాగారిచిత్తమునకు మీరే కర్తలు. వారిపేష్కాసు సరిగా చెల్లుచుండిన, వారిచిత్తము మీరు కోరునట్లే యుండును. అట్లు జరుగనందున వారు మాకు పెట్టినపని యేమో హైదరుజంగు తమకు తెలుపనే తెలిపినాఁడు. మఱి తెచ్చినారా ఏడుసంవత్సరముల పైకమును?

రాజు.—తమరు అడిగినమాటకు ఉత్తరము ఇంచుకంత విస్తరముతో మనవిచేసెద. హైదరుజంగుగారు చెప్పినపని మావిషయమై తమరు పట్టుతో కలసి యుండదు. అయినను చిత్తగింపవలయును. పింజారిదండుచేత మాదేశ మంతయు దోఁపుడు పోయినది. డెబ్బదిరెండు పాళెములలో నేమి; పండ్రెండు మన్నెములలో నేమి, ఎచ్చటను ఒక రాగిదమ్మిడీ అయినను కనులఁ జూచుటకు లేదు, దేశాంతరమునుండియేని తెప్పించి యొక మొత్తముగానో, అప్పుడు కొంత అప్పుడు కొంతగానో, చెల్లింత మన్నను—

సీ. నాగేంద్రుఁ డేలుచున్నాఁ డొకరుండు నా
యండజమీను సహస్రఫణుఁడు;
నానాట నా పజ్జ నాప్రజ మననీఁడు,
వానిఁ బట్టఁగలాఁడు వసుధ లేఁడు;
మఱి యాతఁడు వయాలి మలయు మాసీమలఁ
దద్విషాగ్నుల మింటఁ దగులుమంటఁ
బౌరులు కటకాన బ్రహ్మపురంబున
రాజమహేంద్రవరమునఁ గాంత్రు.
తే. దానఁజేసి బయటికొలఁదారులకడ
నెట్టు వేఁడినను ఋణమ్ము పుట్ట దాయె;
భస్మపటలంబులైనవహాషరగణాల
రైతు లేఁగిరి వలస లరణ్యములకు. 2

గోదావరికి దక్షిణమందలి చిల్లర జమీనుల కప్పము లెల్ల ఋణములో మీకు చెల్లియుండఁగా, పైహేతువుచేత మా సంస్థానముది ఏడుసంవత్సరముల పైకము మీకు మునిఁగిపోయినది. ఇందులకై మాతో యుద్ధము పెట్టుకొందురేని, జనక్షయమే గాని పైకము రాదు.—మఱి.

(మత్తకోకిల)

మీకు లోఁగని మాసటీలను మేము కొట్టుట సేవ యౌ
మాకు లోఁగని వారి మీరును మట్టుపెట్టుట బీర మౌ;
మీకుఁ జాగిన, వానిపైకము మీరె పోరి గ్రహింపుఁడీ;
యా కరాళుఁ దొలంచి మానతులందుఁడందుఁడుకప్పముల్ గొ

అట్టిసాయము చేయుటకు మీరు సమకట్టరేని, కప్పము చెల్లింపుమని నిక్కచ్చి చేయుదు ననియు, తల్లిసంస్థానము నెదిరించి పోరువారము గాము

గావున, మీ సంస్థానమును మీకు వదలి, మేము కాశికిఁ బోఁదలంచుకొని యున్నాము మా విన్నప మిదియ. అటుపైని తమచిత్తము.

బుస్సీ.—ఏమి హైదరుజంగు ? మహారాజాగారు ఇట్లు పలుకు చున్నారు ?

హైదరు.—ఎవరు. మహారాజా ఆనాగేంద్రుడు, మన్నెసుల్తాను వారి తాలూకాకే కొల్లగొట్టేవాడు, తగలబెట్టేవాడున్ను ?

రాజా.—బొబ్బిలి రంగారాయఁడు.

బుస్సీ.—మీరు అతనితో సఖ్యమునకైన అతనిని దండించుటకైన, ప్రయత్నము చేసినారా?

రాజా.—చేసితిమి, ఏడుమాఱులు మేము అతని బొబ్బిలికి పోయి యుంటిమి.

బుస్సీ.—అంతట ?

రాజా.—ఏడుమాఱులును బేటికి రాక మమ్ము బొబ్బిలినుండి విజయ నగరము దాఁకను బాఱఁదోలినాఁడు. మేము పరారిచిత్తగించునపుడు, దిగం ద్రొక్కి వచ్చిన పల్లకి మాకోట దర్వాజాకడకు తన బోయీలచేతఁ బంపినాఁడు. ఒక్కొక్కమాఱును మాయేనుఁగులను, లొట్టిపిట్టలను, గుఱ్ఱాలను, అనేకములను హరించినాఁడు.

సీ. *మామీఁద నతఁ డెంత మత్సరి యైనను,
విసువక సంధికై వెంచి వేము
మారాజబాంధవు మాన్యునిఁ బంపంగ,
రాయఁ డాతనిఁ జేన రాటఁగట్టి,

* పా. మామైత్త్రి నతఁడెంత మదిరోసియున్నను
విసువక సంధి గావింప వేడి,
మారాజబాంధవు మాన్యుని మేమంప,

ఖూఁదం డతని మ్రోల ఖూఁయించి, యాతని
మెడఁ గోసి, కనసీక మేకుఁ జొనిపి,
దిసమొల గావించి, కసవుగోణం బిడి,
మోమున ఱొమ్మునఁ బొట్టమీఁద
తే. వీఁపునం బట్టెనామాలు వెట్టి, శవము
నందళంబునఁ గూర్చున్నయట్లు కట్టి,
విజయనగరంపు నడివీథి వింత లడరఁ
బగలె మాదేవిడీఁ జేర్పఁ బంపినాఁడు. ౯

ప్రకృతము వారి రాజాముతాణామీఁదికి మేము దండు పంపినారము. మేము ఆటకు తరల నుండఁగా అచ్చటికి వారి దళవాయి తాండ్రపాపయ్య పోయినాఁ డని తెలియవచ్చినది. అంతట రాజాముదాడి మాని బొబ్బిలి మీఁదికే. స్వయముగా తరలనుంటిమి. ఇంతలో మీకబురు రాఁగానే మీ చేటికి వచ్చితిమి.

హైదరు.—తాండ్రపాపయ్యకే కోపం తమరు దాడీయెందుకే మానినార్ ?

రాజా.—తాండ్రపాపయ్య పేరు విన్న, వైరుల కెల్ల సింహస్వప్నము. అతఁడు చొచ్చెనా, యెదిరిదండు పులి చొచ్చిన గొఱ్ఱెలమందయే.

క. ఉండును రాయనినేనిఁ
భండానం దోడరువాఁడు; పాపయ్యను మా
రొక్కండు నను వీరుఁ గానీ
దండును గానీ సృజింప ధాతయుఁ దలఁకెఁ. ౧౦

ముస్సీ.—ఏమి, మహారాజా, మీరు అతనిని పొగడువిధము చూడఁగా, మీసంస్థానమును అతనికలన బట్టుజాగీరుగా ననుభవించుచున్నట్లున్నది గాని, గోలకొండవారి క్రింద జమీను ఏలునట్లు అగపడలేదే!

రాజా.—ఏల; త్వరలో మీకే తెలియును, చెంతకు వచ్చితిమి గదా?

హైదరు.—సరే గాని, రంగారాయడికి చేయి తల్కాయలా యేమి? ఇతనేమి రాకాశిమన్నీడా? మన్నీ కాడా? మీ రావణాసురుడు వున్నాడే, రాముడి బీబీకి పకడ్దేవు చేసినవాడు, వాడికి వాడితో గుణాకరించి, ఆవొచ్చిం దాన్కి, మళ్లీ వాడితో గుణించి, చేసినాడా మీ భ్రమాదేవుడు వాడ్కి?

బుస్సీ.—అతఁడు ఏల మా భేటికి రాలేదు?

రాజా.—నేమను హర్కారాలచేత జాబు పంపితివి, అతఁడేమో రాలేదు. అతఁడు మిమ్మును మమ్మును సరకు సేయువాఁడు కాఁడు.

[బుస్సీయు హైదరును మొగమొగంబులు చూచుకొందురు.

బుస్సీ.—మఱి మీ హర్కారాలు వచ్చి ఏమి చెప్పినారు?

రాజా.—హర్కారాలు ఇంకను రాలేదు. వారిని అతఁడు ఖూనీ చేయించినాఁడేమో యని మాకు భయముగా నున్నది.

దౌవారికుఁడు—(ప్రవేశించి) సలాం సర్కార్, దర్వాజా కాడ మహారాజావారి హర్కారాలు బొబ్బిలినుంచి వచ్చివున్యార్.

రాజా.—సంతోషము! సంతోషము!

హైదరు.—వహ్వా! వహ్వా! సమయాన్కి వచ్చినార్! రమ్మన్.

[దౌవారికుఁడు నిష్క్రమించును.

(అంతట హర్కారాలు ప్రవేశింతురు.)

హర్కా.—దండం దండం యేలినవారికి. అలాంటిచెంపపెట్లు మేము దప్ప మఱెవ్వరును తినివుండరు. వీరభద్రుడిచేత దక్షప్రజాపతి సమేతా తినివుండడు మహాప్రభో.

రాజా.—మా జాబు రంగారాయనింగారి చేతికి ఇయ్యలేదా?

హర్కా.—వారి తమ్ములు వెంకటరాయనింగారు, విజయరామరాజాగారి జాబనగానే, మా చేతులలోనుంచి జాబు పెరుక్కొని, విజయ

నగరము వాడికి- [అని యుద్ధోక్తిలో] మహాప్రభో, మన్నించాలి, వారికోట వొచ్చినట్లే మాకోటొచ్చేసింది మహాప్రభో. [అని సాగిలంబడి లేచును.

రాజా.—అంతయు మన్నించేము, చెప్పుడు. వారికోట వచ్చినట్లే చెప్పుడు.

హర్కా.—'విజయనగరం వాడికి, మాకు జాబులు జవాబులు వున్నాయా' అని అజాబు చింపేశినారు. మరి మేము గుండెనిబ్బరం చేసుకొని 'కాదు మహాప్రభో, పరాసు లొచ్చినారు, గోలకొండవారు లక్షాదక్షైన్యరాణవతో బూసీదొరగారిని, హైదరుజంగుగారిని, జమాబందికి పంపించినారు. అంత లేసి మరాటి భూములు హతముచేసిన ఆదొరలు రాజమహేంద్రవరంకాడ దండుదిగివున్నారు. మహారాజులుంగారు అక్కడికి వారిచేటికి వెళ్లుతా తమరిని గూడ ఎదురుచూస్తావున్నారు. మునపటిలో పాలుమరిచి, యీసమయంలో దయచేసి రావలిశిందని తమరితో మనివి చెయ్యమన్నారు.' అనిచెప్పినాము.

బుస్సీ.—హైదరు - రాజా.—తర్వాత తర్వాత?

హర్కా.—తర్వాత రంగారాయనింగారు "ఏమిరా పరాసులూ, కరాసులూ, బూసులూ, పిసాసులూ, వచ్చినా రని మమ్మల్ని బెదిరిస్తా రంట్రా మీరు? ఇలాంటి బూసులకు మేము భయపడ మని చెప్పరా. ఇలాంటివి వొకటిగాదు వందలువందలు జంగుబిల్లులు మా అడివినిండా వున్నా యని చెప్పండ్రా. మరాటిభూములని కొట్టినారంట్రా? కాదురా, బొబ్బిలిజ్వరానికి, మరాటిమొగ్గలు కషాయం పెట్టుకొన్నార్రా. వాళ్ల చేటికి మమ్మల్ని పిలవడానికి మీరాజాకూ బుద్ధి లేదు, మేము వొస్తామని తలవడానికి వాళ్లకీ బుద్ధిలేదు." అని కోపం చేసి పటపట పటపట పళ్లుకొరికినారు మహాప్రభో.

హైదరు-బుస్సీ-రాజా.—[మొగమొగంబులు చూచుకొని] తర్వాత? తర్వాత?

హర్కా.—తర్వాత, మేము చేతులు జోడించుకొని 'మాయేలినవారికి ఏమి జవాబు మహాప్రభో' అని యడిగినాము. అంతట—'మేము

మీవంటి పందలం గాము, మేము గోలకొండ నిజాముగారి కెదురు వెళ్తామే గాని, వారినౌఖర్లకే యెదురువెళ్లము, జరూ రుంటే, ఆనౌఖర్లు మాపేటికి రావొచ్చును; నిజాముగారి నౌఖర్లు గనక పేటీ యిస్తాము.' అనిమేము శెల విచ్చినామని మీరాజుతో చెప్పుకోండి.—అన్నారు. 'మహాప్రభో, ఏలిన వారు ఆలాగ శెలవియ్యవలసిన సమయంకాదు. పేటికి వెళ్లకపోతే కాసా చెరుపు వుంటుంది.' అని మేము మనివి చేసుకొన్నాము. ''కబురుదెచ్చే జవానుగాడ్దలు మాకు బుద్ధులూ సుద్దులూ చెప్తున్నారోయి.'' అని వారి తమ్ములుం వెంగళరాయనింగారు మమ్మల్ని చెంపలుగొట్టి తన్ని తగిలేశినారు, మహాప్రభో. ఆపైని యీకాయికిని వొచ్చి యేలినవారిని ఇక్కడ కండ్ల జూచినాము.

బుస్సీ.—వీరిని పొమ్మనుఁడు.

రాజా.—పొండిరా మీరు.

హర్కా.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

బుస్సీ.—మఱి మీపైకమునకు ఏమిచెప్పెదరు?

రాజా.—ఇఁకమీఁద ఎన్నటికిని వారివలన మాకు ఉపద్రవము లేకుండునట్లు చేసిననేగాని, మాకు డబ్బు పుట్టదు.

బుస్సీ.—ఏమి హైదరుజంగుబహద్దర్? మహారాజాగారు చెప్పిన మాటకు ఏమి యుత్తరము? మనము ఇప్పుడు బొబ్బిలివారిని కొట్టి బాకీ వసూలుచేసికొని పోఁగలము గాని, రేపటికి వారు వీరిమీఁదికి రాకుండ మన మెటు చేయఁగలము?

హైదరు.—అందుకోసం వుపాయం యేమైనా తమరు ఆలోచించి వున్నారా మహారాజా?

రాజా.—ఉపాయము సిద్ధమే; అయినను రాతిగోడలకే చెవులు గల వందురు, డేరాగుడ్డల మాట చెప్పవలయునా?

హైదరు.—అయితే యీలాగారండి. [అని రాజును అన్యులనుండి అవలికి తోడ్కొనిపోయి] ఇక్డ శెలవియ్యవచ్చును.

రాజా.—వినుఁడు మఱి; మీరు బొబ్బిలి కొట్టకని మీకు బొబ్బిలి పైకము రాదు. కొట్టినను, సర్కారుపైకము సర్కారునకు దక్కును. మీ కష్టము మీకు దక్కును. కావున, అట్లు గాక మీరు బొబ్బిలి కొట్టి బొబ్బిలి వారికి పాలకొండమన్నెము నిచ్చి మాయన్నగారి కుమారుఁడు ఆనందగజ పతికి బొబ్బిలిని పట్టము కట్టినయెడల బొబ్బిలిపైకము కూడ మేమే చెల్లించుట గాక, బుస్సీదొరకు తెలియనీక, మీకు లక్షవరహాలు కట్నము సమర్పించెదము. ఇట్లు మీరొనర్చిన, బొబ్బిలివారివలనియిడుములు మాకుండవు; పైకము వసూలగుటకు మీకు ఏ చింతయు నుండదు. ఈనూత్నమును మీరు అవధరింప వలయును. [హైదరు ఆలోచించుట నభినయించుచుండును.

రాజా.— [స్వగతము] రంగారాయఁడు బ్రతికియున్నంతకాలము భూమిలో ఎంతదూరాన నున్నను మాకు రాజ్యభ్రంశంబు, ప్రాణాపాయమును, తప్పవు. ఈ ప్రయోగముచే రంగారావు మడియును. ఎట్లన, బొబ్బిలి వదలి పాలకొండ కేఁగ నతఁడు ఒడంబడఁడు. దానంజేసి, పోరాటము తప్పదు. పోరాటములో పరాజయావమానము నొల్లఁడు; అతనికి ఈపరాసుల మీఁద జయ మసాధ్యము; కావున అతనికి రణమరణము నిశ్చితము. కాన, అతఁడు బ్రతికియుండి కాలాంతరమున మమ్ము బాధించునను భయము లేశ మయినను ఉండదు.

హైదరు.—[ఆలోచించుట నభినయించి] వహావ్వా! వహావ్వా! బాగాకుదిరింది. తమరు కోరినపని నేనుచేస్తాను. నాకి లక్షవరాలకీ ఏమి జామీను?

రాజా.—మీరు మాపని నెఱవేర్చుటకు మాకేమి జామీను?

హైదరు.—[ఒరనుండి తరవారు దూసి] ఇద్గోయీాకైజారు జామీను

మెచ్చీనారూ మాదీ మేహర్బానీకి చూచి;
యిచ్చీనారూ మాకీ కైజార్.
యవ్రంటే ? గోల్కొండా యేలే పాచ్ఛాగారు,
యివ్రంగా మీకీ మేం చెప్తాం.
యిల్లిద్దో పాచ్ఛాహి యిచ్చిన కైజారు,
హాల్లా సూస్తాదూ మేం అంటాం.
వీరబొబ్బిలి మీకుమాగ్ హానందానికి
ఖరార్, ఖరార్, ఖరార్. ౧౧

సీ. ఢిల్లీశు నల్లాయుడీను రణస్తంభ
పురినుండి హస్తినాపురము దాఁకఁ
బఱపి, యాసుల్తాను పగిడీని గొనివచ్చి
పదపీఠమునఁ బెట్టి ప్రణతుఁడైన
మాపూర్వునికిఁ జాహమాన హమ్మీర పృ
థ్వీనాయకుఁడు తనవ్రేలినుండి
వ్రేలఁ బెట్టిన యంగురీయకం బిది, హరి
యవతారములవెల్గు! నందు నడిమి
తే. యింద్రనీలంపు శ్రీరామచంద్రమూర్తి
యెఱుఁగ, బొబ్బిలి మాకు నీ విచ్చినంత.
లక్షవరహాలు నీకు వైళంబుగా వి
రాళ మిత్తు ఖరారు, ఖరార్, ఖరారు. ౧౨

హైదరు.—మరి రాండి బుస్సీదొరగారికి తయారుచేద్దాం.

[అని ఇరువురును పోయి యథాస్థానముల కూర్చుందురు.

బుస్సీ.—ఏమి మంత్రాంగము?

హైదరు.—[బుస్సీతో అపవారించి] బొబ్బిలి కూడినట్టయితే ఈరాజాకి వర్తకులు అప్పీల్ యిస్తారంట. యేలాగయినా రంగారావుకి పైకం కోసరం కాకపోతే మనమల్ని తుసాయించిన పోగర్ అణచడానికైనా మన్ని కొట్టకలిగిందే వుంది. అతను చేటికి రాక కారుకూతలు పలికినాడు. ఈరాజా మన్కి లోబడి చేటికివచ్చినవాడు. ఇతనికి పెద్దరాజ్యం వుంది. పదిరొండు మన్నె గాళ్లు దబ్బైరొండు పాళెగాళ్లు ఇతనికింద లడాయి చేస్తారు, పైగా ఇతడ్కి గొప్ప రాతికోట వుంది. ఇతణ్ని ఇక్డ పట్టినా, అంతటితో ఈపనితీరదు. ఇతనియన్నకొమారుడు ఆనందరాజు, విజయనగరం కోటలో హాయిగా వున్నాడు. అతడ్కి వేరే పట్టవాలా వుంటుంది. బొబ్బిలి వారిది మట్టికోట, దానికి మట్టితో కలపడం సులువు. ఇతనితో లడాయి పెట్టుకుంటే మనకే జయం నిశ్చయంలేదు. ఈయన పైగా నిజాంగారికి, ఎక్వా మెహానత్తు చేసి ఎర్గి వున్న జమీందారుడు. ఇతనికి కొట్టడం వారికి సమ్మతం వుండదు. కన్క, ఈయన్కి మనపక్షంమే వుంచుకొని, ఇతడి సాయంతో బొబ్బిలికి కొట్టి, వెంటనే ఇతడియ్యవల్సిన పైకంకి వసూలు చేసికొని, శ్రీకాకుళం వెల్లడం సరి యని నాకీ తోస్తుంది. మఱి ఇటు తర్వాత రంగారావు వల్ల ఇతడికి హాపాయం తప్పించడముకీ ఈయన చెప్పేది వుపాయం యేమిటంటే—బొబ్బిలివారికి దూరాన పాలకొండసీమ ఇచ్చి, ఈయనికి బొబ్బిలి యిస్తే, బొబ్బిలిపైకం కూడా తానే చెల్లిస్తా నంటాడు. అది సరి నాకీ తోస్తుంది. మఱి యితడిసాయం లేకపోతే మన్సూ బొబ్బిలికి ఎక్వా మందికి మనసిపాయీలకి బలీ వెయ్యవాలా వుంటుంది. అటుపైని తమది చిత్తం.

బుస్సీ.—[అపవారించి] మీరు చెప్పినదంతయు యుక్తియుక్తము గానే యున్నది. బొబ్బిలిని కొట్టుట యేమో సిద్ధమే; కాని ఒకరి భూములం దీసి ఒకరి కిచ్చుటకు మన కే మధికారము?

హైదరు.—[స్వగతము] అబ్బ! ఎక్కడికి వెళ్లినా యీఫరంగి [వాడితో ఇదే తంటా! ప్రకాశము] కొట్టడాన్కి యేమీ అధికారమో భూములు మార్చడాన్కి అదే అధికారం ఆలాగ చెయ్యకపోతే గోదారికి వుత్తరం పరగణాలన్ని మన్మా వొదులుకో వలిశిందే. ఈరాజున్ను ఆరావున్ను సఖ్యపడితే మన్మా రొమ్ముకి తరలవలిశిందే. వీరిలో వీరికి కలతపడినందుకీచేత మనకీ అడుగు మోప్డానికి హావకాశం దొర్కింది. కన్క వీరిపగలు ఉన్నలాగే వుంచి, మనపని మనం నెరవేర్చుకోవాలా. బొబ్బిలి వీరికి యిచ్చి వారికి ధూరం తరిమితే. పగలు తీరవు, పైకం చెల్లుతుంది. నిజాంగారి ఖుద్దున మన్మఖజానా రాశి పోయ్యవచ్చును. కన్క యీ మాఠ్వకీ మన్మ వొప్పక తప్పదని నాకీ నమ్మకం.

బుస్సీ.—మంచిది, మీరు ఈదేశమువారిని, మాకన్న చక్కఁగా ఎఱిఁగినవారు; కావున మీరు చెప్పినట్లు ఒప్పుకొనియెదను.

హైదరు.—మహారాజా; మీరు చెప్పిన వుపాయాన్కి ధొరవారు వప్కాన్యారు. తమరు కూడా బొబ్బిలిమీదికి మాతో రావాల.

రాజు.—సర్వసిద్ధము. మిక్కిలి సంతోషము. బూసీదొరవారికిని మీకును మిక్కిలి కృతజ్ఞుఁడను [ఆత్మగతము] ఆహా! యేమినాయదృష్టము ఆహా! నాప్రక్కలోని బల్లెము ఊడినదిరా. బొబ్బిలిలో ఆవలి యెల్లుండి పగలు 50 పెండిండ్లు, రాత్రి యూరేఁగింపు. తాండ్ర పాపయ్య రాఁడు! వచ్చినప్పటికిని వెంటనే రాజాముకు పోవును. ఆరాత్రి తెల్లవాఱునప్పటికి ముట్టడి పడిన, కరము జయకరముగా నుండును. [ప్రకాశము] ఇంతకు పూర్వ మెప్పుడును మాకు జోస్యులు జయము చెప్పలేదు. ఈమాఱు ఆటావలి యెల్లుండి సూర్యోదయమునకు పూర్వమే బొబ్బిలివారి కెవ్వరికిం దెలియనీయక బొబ్బిలికి ముట్టడి వేయుదుమేని జయ మని మాజోస్యులు చెప్పినారు. అట్లు అతర్కితో పపతితముగా వారిమీఁదఁ బడుటకు, మీరు వలంతులేని

నేను సాయము రాఁగలను. మనకు జయమని నిశ్చయము. విలంబము చేయుదు రేని, మనకుజయము కలుగదు.

హైదరు.—అలాగే వెల్దాం, ఇందుకీ వోచన యెందుకి?

రాజా.—మఱి మేము విజయనగరమునకు పోము. అందఱు నొక్క మొగిని కేరయుంబవలు నడువవలయును; మాతురుపులు దారి నడుపుదురు. మీరు త్వరగా ప్రయాణభేరులు కొట్టింపుఁడు. మఱి మాకు సెల వొసంగుఁడు.

బుస్సీ.—హైదరుసాహెబు, మహారాజాగారిని సాగ నంపి రమ్ము. సలాము మహారాజా.

[అందఱును లేతురు. సలాములు మార్చుకొందురు. రాజా, రాజపరివారము, హైదరును, పరిక్రమింతురు.]

బుస్సీ.—మనముపోయి మన పనులు చూచుకొనవచ్చును.

[బుస్సీ ప్రభృతులు నిష్క్రమింతురు.

రాజా.—మీరు చాల వ్యవహారసమర్థులు. పరంగివానిని క్షణములో ఒప్పించినారు. ఈ స్నేహమునకు బదులుగా, మా తాతగారికి ఢిల్లీసుల్తానుగా రిచ్చినది, రత్నాలు తాపిన యీాకై జారును, కమర్బందును, మీయొద్ద ఉండవలయును. మా ప్రక్కలోని బల్లెమును, కంటిలోని నలుసును, మీరు ఊడఁబెఱికిన వెంటనే, మేము ఒప్పుకొన్న పైకమును, పైగా మా కృతజ్ఞతను మీ రే కందురు.

[నేపథ్యములో 'ఓంభాయి, ఓంభాయి.' అప్పన్న లోనుగా పరివారము, రాజును కలసికొనును.

రాజా.—[వినుట నభినయించి] అప్పన్నా, ఎవరిది ఆసవారి?

అప్పన్న.—సామర్లకోట నీలాద్రిరాయనింగారిది.

రాజా.—పోయి, మేమిక్కడ నున్నా మని, వారు దర్శన మిప్పించిన సంతోషించెద మని, మర్యాదగా పలికి తోడ్కొనిరా.

[అప్పన్న ఆజ్ఞచేయును.

రాజా.—ఓహో! సంవత్సరకాలమునకు దర్శనము!

నీలాద్రి.—ఈదినము మాకు మహాపుణ్యదినము.

రాజా.—ఈరాక హైదరుజంగుగారి జమాబందికా?

నీలాద్రి.—అవును.

రాజా.—మేము బొబ్బిలిమీఁదికి లడాయికి వెళ్లుచున్నారము. రాయనింగారు మాతో కలసికొందురా?

నీలాద్రి.—

క. తోడల్లునిమీఁదికిఁ బో
రాడఁగ రమ్మనెదవె, యుచితానుచితంబుల్
సూడవు, ముదుకవు, పండిన
మేడి ఫలంబవు, సువస్త్వమిత్త్రుఁడ, వెపుడుం. ౧౩

రాజా.—నీ పాటియుచితజ్ఞత మాకు లేదందువా? కానీ, బొబ్బిలి కొట్టి వచ్చి సామర్లకోటను దుమ్ముదుమారము చేసెదము.

నీలాద్రి.—

ఆయువుమీఁదను నాసలు గొంటే, నాలకింపు రాజా;
రాయనిమీఁదికి వెళ్లినవారికి రాక మ దెక్కడిది?
నీటిబొట్టుకై వానకోయిల నిగిడి మొగులుఁ బొడువ;
మేటిపిడుగు భస్మీకరించు టే సాటి నీకు రాజా. ౧౪

రాజా.—[తిచ్చపడి ఆలోచించి స్వగతము] హా! రంగారాయని కార్యమున నితని కెంత నమ్మకము! కానీ! ఇటు చెప్పి వంచించెదను. [మందహాసముతో, ప్రకాశము] రాయనింగారితో వేళాకోళముగా పలికితిమి. బొబ్బిలిమీఁదికి పోవుట గీవుట అంతయు వట్టిమాట సుమా!

నీలాద్రి.—కాక నిజమా? కాదని మా కప్పుడే తెలియును.

రాజా.—[హైదరుతో, అపవారించి] ఇతనికి బొబ్బిలి ముట్టడిమాట తెలియనీకుము. ఇతఁడే ప్రస్తావించినచో మామాట కట్టివేళాకోళ మని పలుకుము. సలాము.

హైదరు.—అది కూడాను మాకీ చెప్పవాలా? సలాం. మా ఫిరంగి యగాడే నేము తల్లినా మని మీకీ తెల్సుతుంది.

[అని నీలాద్రిరాయనితో నిష్క్రమించుదు.

రాజా.—ఇతఁడిట నాకంటఁ బడుట మేలే అయినది. అప్పన్నా, మన దండును క్షణములో తరలింపుము.

అప్పన్న.—ఏలినవారి చిత్తము. [అని నిష్క్రమించుదు.

రాజా.—[పరిక్రమించుచు] అబ్బా; కూడినట్లేరా నా ప్రక్కలోని బల్లెము! వచ్చినట్లేరా నాకంటిలోని నలుసు! అయినను ఆదిలో అపశకునము, అంతములో ఈ నీలాద్రిరాయని మాటయు అపశకునమే. కాని, అది నా ప్రయోగమే. అయినను, తరలఁగానే వచ్చినది. [ఫిరంగియగాదు.

రాజా.—హా! [అని ఆశ్చర్యపడి] ఏమి యీ ఫిరంగి? అపశకునములే అని సిద్ధాంతము చేయుచున్నదా?

[నేపథ్యమున కలకలము వెంట.]

హడ్డీ హడ్డీగానే నడ్డీ యెల్లిందిగా, నడ్డీ యెల్లూతాము మేమూ,
హడ్డీవూరయితుందివూరుహడ్డాయితుంది, మేమూనిల్చినాతాణా;
పడ్డానడ్డాయితుంది,నడ్డాపడ్డాయితుంది, మేమూదాటీనా యేటూ,
పడ్డానడ్డా రెండుపాడూ వెడారీగానడ్డీయెల్లూతాము మేమూ,

రాజా.—[చెవి యొగ్గి వినుచుండి] అప్పుడే వెంగలాయీ దండు కదలినదే! అబ్బా ఏమి యీ తురకల దర్పము!

[నేపథ్యమున]

గోవిందా గోవిందా మాకు గొంతు కొయ్యకయ్యా.
రామా రామా మల్లీ యిళ్లకి రానియ్యవయ్యా.
కొండమీది కాత్రేడా నీకూ గండదీప మెడతాం!
ఆలుబిడ్డలకి మాకు ఆపతి అవల నెట్టవయ్యా. ౧౬

**రాజా.—అరరే! బళీ; అప్పన్న మాదండును గూడ తరలించినాఁడే ఇంక మేమును క్షణములో కదలెదము.** [అని నిష్క్రమించును.

(ప్రథమ ద్వితీయాంకముల నడుమ)

## ప్ర వే శ క ము

స్థలకము.— బొబ్బిలి రచ్చచావడి.

(పలువురు బ్రాహ్మణులును బ్రాహ్మణస్త్రీలును ప్రవేశింతురు.)

ఒక బ్రాహ్మణుఁడు.—ఒరే సుబ్బన్నా, ఈబొబ్బిలివారి భూరి సంభావనలో నీకేమి దొరికిందిరా?

సుబ్బన్న.—నే నింకా లెక్కపెట్టుకోలేదురా, రామయ్యా. దోశెడు వరహాలుపోశారు నావొడిలో.

ఒక బ్రాహ్మణి.—[శిశువు నెత్తుకొని యుండి] ఇదుగోనండోయి మీకు మొగాళ్లకి దోశెడు వరహాలు ఇయ్యడం వొక ఆశ్చర్యమా! మావంటి యాడాళ్లకి దోశెడుదోశెడు వరహాలు ఇచ్చాడు, అనుమారా జెవరో ధర్మా రావుమ, రంగారాయనింగారిమామగారుమ. మా కియ్యడం ఏం విన్నారు! ఈ చంటిపిల్లకి ఒకదోశెడు.

రామయ్య.—చంటిపిల్లకి కూడా దోశెడే! [అని ఆశ్చర్యపడును.

బ్రాహ్మణి.—ఇందుకే ఆశ్చర్యమా? నాచెల్లెలికి ఒకదోశెడు వరహాలు ఇచ్చాడు. 'చూలాలండీ' అంటే- 'ఆ! అలాగా? యీగుంపులో పాపం చాలా శ్రమపడ్డది!' అని 'యిందాండి, అమ్మా, పుచ్చుకోండి, గర్భములోని శిశువుకోసం పుచ్చుకోండి;' అని బతిమాలుకొన్నట్టు కడుపులోపలిపిల్లకి ఒక దోశెడు ఇచ్చాడు మహారాజు. [తోడిస్త్రీలనుద్దేశించి] రండే గోపాల స్వామిగుళ్లో పడుకొందాము. [స్త్రీలు నిష్క్రమింతురు.

రామయ్య—ఔనుగాని, యీభోజనాలచేత నాపొట్ట పగిలిపోతూ వుందిరా! [దీనస్వరమున] ఏమోయి భీమశంకరం నీప నేలా గుంది?

భీమ.—నన్నా? తిండికి పొట్ట పగలడ మేమిషిరా నాగమ్మా? ఆకాడికి నావీపువిరగొద్దుమరా, నాపృష్ఠోష్మపర్యంత భోజనానికి? అలా

అంటే తెలుసునా? వీపుమీద గుద్దితే, క్రింద మెతుకులు పడాలి; మెడమీద కొడితే, నోట బూరెలు రాలాలి. మళ్లీ మనిషి ఘోర్కా లేకుండా వుండాలి, భోజన మంటే. ఏమంటావోయి సోమయ్యా?

సోమయ్య.—అఘోరించావు లేవోయి! పృష్ఠస్థానికే యింత బడాయి అయితేనా నఖశిఖ పర్యంత భోజనాని కేమంటావు? వత్తితే కాలిగోరు కూడ పప్పుధప్పళం కక్కాలి; ముక్కు నలిమితే పీశ నెయ్యి ఔత్ఖాసా కొట్టాలి?

భీమ.—ఓయి సోమప్పా, నీనఖశిఖానికే యింత విఱ్ఱవీగేవోయి? మాఅన్నభోంచేసిం తర్వాత జుట్టు మెలేస్తే, గంగాళం ధప్పళం వస్తుంది. వొంటి చమట తుడిస్తే, మణుగు నెయ్యి అవుతుంది. పెదవి పిడిస్తే, బిందెడు పాయసం; నెత్తిమీద గుద్దితే, రెండుముక్కులలోనుంచీ, దడదడ బూరెలు రాల్తాయి. గ్రామదేవతలారా! మీదేం తిండిరా మా అన్న ముందర?

సుబ్బన్న.—ఒరే! ఆపంక్తిలో వాళ్లకింది పీటలన్నీ పగిలినవి ఎరుగుదువా? పీటలు పగులుతూవుంటే, వెదురు నేసిన ఇల్లంటుకుంటే, బొంగులకణుపులు కాలి పగుల్తూవుంటే, పటపటా, పటపటా, అని యలాగ్గా అగాదో ఆలాగ్గే అయిందిరా, చవులు గింగురు మని పోయినాయిరా!

రామయ్య.—మఱి అందుకే రెండువందలమంది వడ్రంగులు ఆ పెద్ద పెద్ద అవధాన్లగార్లకోసరం పీటలు మరమ్మత్తు చేస్తూ వున్నారు.

సుబ్బన్న.—అది సరే గాని, ఆ శతబూరె సహస్రబూరె గార్లు పందిట్లో రెండువందలమందిని విస్తళ్లకాణ్ణుంచీ ఝుడ్డీపట్టి మోసుకొనివెళ్లి చేతులు కడిగినారు, చూశావురా?

సోమన్న.—ఔనురా, కోటలో రాయనింగార్లకు పెళ్ళిళ్లు. మనకి యిక్కడ నేతివరదమూలంగా విస్తళ్లన్నీ యేకమై ఒకటే ఋద్యాంబంతి అయిందిరా. పెద్దపెద్ద శాస్త్రుర్లవార్లంతా, తప్పలేదు తినమన్నారు. మేం, యెంగిలిమంగలంగా భోంచేశాం. వొకచేత్తో విస్తర్లు కొట్టుకోపోకుండా పట్టుకొని, వొకచేత్తో భోంచేశాం. అందరం యెవరి విస్తట్లో వాళ్లమే భోంచేశామని చెప్పలేము.

[అందఱు ఆశ్చర్యపడుచు నేపథ్యద్వారమువైపు చూతురు.

[అంతట ఒక బ్రాహ్మణుఁడు పొర్లుచు ప్రవేశించును.]

పొర్లు బ్రా.—[రోఁజుచుమూలుగుచు] హమ్మా! హమ్మా!

ఇతరులు.—యేమయ్యా, దొర్లుతావు? యేడుస్తావు?

పొర్లు బ్రా.—[రోఁజుచు] ఖ ఖ ఖడుపునొప్పి!

సుబ్బన్న.— అయ్యా, నాదగ్గిర కడుపునొప్పికి మందు వుంది. యిందా, వొక మాత్ర మింగు, మింగు, త్వరగా మింగు.

[అని ఒకమాత్ర తీసి యిచ్చును.

పొర్లు బ్రా.—మా-మా-మా-త్రకి స-స-సం-దుం ఛే, మఱి రెండు భూ-భూ-భూరెలు తిననువయ్యా.

సుబ్బన్న.—ఓయి, నీయిల్లు బంగారంగానూ! ఇదెక్కడి అబ! భీమయ్యా, రామయ్యా, ఇతణ్ణి మోసుకొనివెళ్లి, మీ రిద్దఱు నిన్న యిలాంటి వాణ్ణే ఒకణ్ణి వేడి వేడి అట్లు కడుపుమీద వెయ్యించి, లోపలినెయ్యి కరిగించి, కడుపు సల్లించి, బ్రతికించాసే రాయనింగారి వైద్యుడు, అతడి దగ్గరికి పట్టండిరా; లేకపోతే, యితడిమూలంగా రాయనింగారికి బ్రహ్మహత్య వొస్తుందిరా!

రామయ్య, భీమయ్య.—ఔనురా.

అని బ్రాహ్మణుని యెత్తిపట్టి మోసికొని నిష్క్రమింతురు.

**సుబ్బన్న.**—[నిర్వర్ణించి] బూరెలు తరహా చొప్పున వెయ్యిన్నీ నూట పదహార్లు సంపాదించినాడే, ఓయి బాబో! అబకాసురుడు వెంకన్న వొస్తున్నాడు!

(అంతట వెంకన్న ప్రవేశించును.)

**సుబ్బన్న.**—వెంకన్నా, ఏమయ్యా, నీ వెయ్యిన్నీ నూట పదహార్లు మాకు రవంత చూపవయ్యా.

**వెంకన్న.**—అవి నా భోజనం మీద, కందాలు చెప్పిన కవికి, కందాలు చెప్పినవాడే కవిగదా, అని ఇచ్చేశా.

**అందఱు.**—వహవ్వా! వహవ్వా! భోజనరాజవయినావే! ఏవయ్యా, ఆకందాలు ? విందాం.

**వెంకన్న.**—వినండి మఱి:—

కం. వెంకన్న తిండి జూచిన,
నంకాళమ్మకును సైత మరగుండె పడుఁగా;
కొంకును బూరెలు మెక్కెడు
వెంకనకు జగములు మ్రింగు విశ్వాంతకుఁడుఁగా. ౧౭

**అందఱు.**—బలి బలి! ఇంకా మఱి;

**వెంకన్న.**—వినండి మఱి:—

కం. ఊటగల యావకాయలు
పూఁటకుఁ డెంకాయ బొండ్లములపాటివి నూ
ఱాటవు వెంకన్నకు నసి
పాటిత దధి గండ మిశ్ర భక్తంబునకుఁ. ౧౮

**అందఱు.**—వహవ్వా! వహవ్వా! ఇంకా మఱి;

**వెంకన్న.**—వినండి మఱి, దీనితోసరి.

కం. గారెలు బూరెలు వే నీ
నోరన్ నేఁ జూడ, నర్జునుఁడు సూడంగాఁ,
బోర హరి విశ్వరూపపు
నోరుల నక్షౌహిణులు ధణుల్ బలె వ్రాలున్. ౧౯

సుబ్బన్న—వెంకన్నా, పోగొట్టుకొన్నావు గదా యింత కష్టపడి తిని సంపాదించిన 1116 ర్లున్ను.

వెంకన్న.—రేపు మళ్లీ తింఛా. రోజూ తింఛా.

[అని కుడిరొమ్మాస్ఫాళించును.

అందఱు.—ఓర్నియిల్లు బంగారం గానూ! బకాసురుఁడవురా?

[అని నవ్వుదురు.

[నేపథ్యమున ఘణీల్ ఘణీల్ ఘణీల్ మని ఘంటారవములు.

సుబ్బన్న.—[పరికించి] ఏం బరువు లోయి, అన్ని యేనుగలు, మోసుకొని కోటవైపు వెళ్లుతూ వున్నవి?

వెంకన్న—ఈరాత్రి వూరేగింపు కదా! అందుకోసం బాణసంచు చెన్నపట్ణంలో చేయించి, విశాఖపట్ణం రేవునుంచిన్ని, భీమునిపట్ణం రేవునుంచిన్ని రప్పించారుష.

సుబ్బన్న—వహావ్వా! వహావ్వా! యీయుత్సవాలు ముగిశిందాక నేను యీవూరికి వదలనయ్యా. రాత్రంతా మేలుకొని వూరేగింపుచూతాం, అందుకోసం యిప్పుడే గోపాలస్వామి గుళ్లోకి వెళ్లి పడుకొందాం రండి.

ఇతరులు—అది మంచి పని. [అని అందఱును నిష్క్రమింతురు.

# ద్వితీయాంకము.

స్థలకము:— బొబ్బిలికోట - అంతఃపురము.

[అంతట రాణియు పెండ్లికొమార్తలును దాసీజనమును ప్రవేశింతురు.]

రాణి.— [నిర్వర్ణించి] ఆహా! ఊరేఁగింపు మహాలుదర్వాజాకడకే వచ్చినది! ఓహో యెంతరమణీయముగా నున్నది! [పెండ్లికొమార్తలను ఉద్దేశించి] నాబంగారుకొండలారా, మీ రందఱు కిటికీలకడ నిలిచి కనులపండువు గావించుకొనుఁడు. (చిఱునవ్వుతో) వట్టి మీరు వెలమకన్యలు, ఒక్కొక్కతయు తనభర్తను మాత్రమే చూడవలయును.

కొందఱుకన్యలు— [చిఱునవ్వుతో] వెలమకన్యలకంటికి ఇతరులుఏల యగపడుదురు? ఇతరులకంటికి వా రేల యగపడుదురు?

[అని అందఱును పరిక్రమించి ఊరేఁగింపు చూచుట నభినయింతురు.

రాణి.— ఓసీ; వేంకటలక్ష్మి, నీకు ఏలినవారు చదువులు చెప్పించి పెద్దదాసియధికార మిచ్చినందులకు తగినట్లుగా ఈముద్దరాండ్రకు ఈ యూరేఁగింపులోని విశేషములను వర్ణించి విశదపఱుపుము.

వేంకట— దేవిగారియానతి. మఱిచిత్తగింపుఁడు.

క. ఆకాశబాణము లవే
యాకాసంబునకు నెగసి, యమరులచెంతఁ
రాకేందువులుగ, బాల ది
వాకరులుగఁ, జెలి, కలయఁ బర్వెడుఁ గనుఁడీ. 20

మఱియు;—

శా. ఏయే వన్నె సులోచనం బిడుదుమో
యీ చుట్టుపట్లప్పుడే
యాయావన్నె విగాఁ గనంబడుఁ గదా;
యామాత్ర మేగాకివే
స్థాయద్వర్ణము లౌమతాబులు ప్రకా
శం బొంద నాతేజులన్
క్ష్మాయెల్లన్ స్ఫుటదృశ్యతావిభవమున్
గాంత్యుచ్ఛ్రియంబుం గనెన్. ౨౧

పెండ్లికొమారితలు.—వెంకటలక్ష్మి మహాకవీశ్వరురాలుగా నున్నదే!

వెంకట.—మఱియు వినుండు:—

శా. ఊరేఁగింపువి కొన్ని యెట్టెదుట న
చ్ఛోచ్ఛాంబ రాదర్శ బిం
బారూఢంబులో, యుత్సవేక్షణముకై
నాకంబె యేతెంచెనో,
నా, రంభోర్వసులన్ మహేంద్రసభ యం
దారంబు నింద్రాశ్వమున్.
భూరిక్ష్మాధ్రము నింద్రసిందుకముఁ జూ
పున్ బాణసంచా యిటన్. ౨౨

మఱియు.—

ఉ. బంగరువన్నె ఘు లురువర్ష్మము లుర్వరనుండి లేచి, త
త్సంగముఁ బాయ కే దివికిఁ జాఁగి, దిశాతతి మూయ, వాని దీ
ర్ఘాంగము లడ్డుగాఁ గడుపులం దుఱు రేకులుఁ బద్దు పేరయై
బంగరుగాదెలో నడుగుఁబట్టినకై వడిఁ బ్రోలు గ్రాలెడిన్. ౨౩

రాణి.—సరసురాలవే వేంకటలక్ష్మి. గద్యరూపమున నింపుక మాకు శ్రవణముల నమృతముం గురియింపుము.

వేంకట.—మహాలక్ష్మియాజ్ఞ.—చదలం దేలియాడు నీ దీపపుగుమ్మటములు కాగితంపులోనివలనం గల చిత్తరువులు బయలికి వెలుంగుచుండ, ఉత్సవదిదృక్షు సౌవరమిథునాధిష్ఠిత విమానంబుల చందంబున నందగించుచున్నవి. సమలంకృతంబులును ఉపరివిస్తీర్ణశోభయపార్శ్వలంబమానరత్నకంబళవిరాజితంబులును వరాద్యధిష్ఠితంబులు నైనయీరోసునుంగులు ఈవీథిపొడుగున మిన్నంటుచు నూరేఁగింపు నడచునొప్పిదము-మహాగిరులు సపక్షంబులు శ్రీరాయనింగారి ప్రాపున ఇంద్రుని సరకుసేయక సిద్ధవిద్యాధరాద్యధిష్ఠితంబులై జ్యోతిష్మత్యాది దేదీప్యమానంబులై యథేచ్ఛసంచార భాగ్యంబుననుభవించుటవో నాఁ-గన్పట్టుచున్నది. [నేపథ్యమును బరికించి] మహాలక్ష్మీ, ఊరేఁగింపు మన నగరిదర్వాజాకడకే వచ్చి నిలిచియున్నది; మేజువాణి జరుగుచున్నది.

పెండ్లికొమారితలు.—వేంకటలక్ష్మీ, ఆ మేజువాణిలోని పాట మాకు తెల్లముగాక యున్నది. దానిని నీవు యథోచితముగ అభినయ పూర్వకముగా ననువదించి మా వీనులకు విందొనర్పుము.

వేంకట.—దొరసానులయాజ్ఞ. చిత్తగింపుఁడు- ఈ గేయము నాయకుని మ్రోల విరహిణీదూత్యుక్తి. [అని యిట్లు పాడును.]

[గేయము]

బిత్తరి నీమీఁదఁ జిత్తమిడిన యాతత్తఱపము వినరా!
నాసామి, ఆ తత్తఱ ...
చిత్తజుని కాఁక హత్తి సొలసి సోల్చి, మిత్తిం గాంచఁబోసెరా!
నాసామి, ఆ మిత్తిని దల ...
"వల్లభు నిమది కల్లని యెఱుఁగక చెల్ల! కల్లనైతి నే!
ఓ చెల్ల! తాఁజెల్ల గల్ల ...

ఇంత కాలము నేను చింతించినవి యెల్ల గొంతమ్మకోర్కులఁటే?
ఓ చెల్ల ! ఆ గొంతమ్మ కోర్కు..."
సారసాక్షీ యిట్లు *కేరుచు నే నిన్నుఁ గోరుచు నున్నదిరా!
నాసామి, నిన్ గోరుచు ...
మత్తచకోరాక్షీ గుత్తంపు గాజులు గుత్తిగ రాలెనురా!
నాసామిగా గుత్తిగ రా ...
ఉంగరాలు కేల ముంగాము రాలైన సింగారిఁగందువురా;
నాసామి, ఆ సింగారిఁ గం ...
వన్నెము త్రైసరాలు సున్నను వైనయా కన్నియఁ గందురారా
నాసామి, ఆకన్నియఁ గందు ...

[ఫిరంగి యగాదు. స్త్రీలు హల్లకల్లోలపడుదురు. నేపథ్యమున] ఇదేమి తమ్ముఁడా ఊరిబయటినుండి యింత విపరీతపు ఫిరంగిమ్రోతఁ వినఁబడుచున్నది!

వేంకట [ఆలకించి నిర్వర్ణించి, రాణిని ఉద్దేశించి] అమ్మా, ఏలినవారు వెంగళరావుగారితో ఇక్కడికే వచ్చుచున్నారు.

[వేంకటలక్ష్మి తప్ప అందఱు నిష్క్రమింతురు.

[అంతట రంగారావును వేంగళరావు సంభ్రాంతులుగా ప్రవేశింతురు.]

రంగ.—

క. దిక్కులవియఁ బాతాళము
గ్రక్కదలఁగ గడ్డ గడ్డగా ఘూర్ణిల్లినా
యక్కుగవి సొచ్చి సరవిన్
దక్కుఁడు తక్కుఁడయిమ్రోత తడవుగ డిందెన్. ౨౫

* పా. దూరుచు.

వెంకటే.—ఇదేమో విపరీతముగా నున్నది.

రంగ.—వెంకటలక్ష్మీ, పన్నీరు తెమ్ము కన్నులు కడుగుకొనవలయును.

వెంకట.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రంగ.—తమ్ముఁడా, ఈ డాబామీఁద చల్లగాలిలో కూర్చుందము.

[ఇద్దఱును ఆరోహణ మభినయించి పరిక్రమించి కూర్చుందురు.]

వెంకట.—[ప్రవేశించి] ఇదిగో పన్నీరు.

[అని పన్నీటి కూజాను రంగారాయునిచేతి కిచ్చును.

రంగ.—[కయికొని, చల్లుకొని, కడిగికొని, పన్నీటిగిండిని వెంకటలక్ష్మి చేతికిచ్చి] వెంకటలక్ష్మీ, నీపని నీవు చూచుకొనుము.

వెంకట.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రంగ.—ఏమి తమ్ముఁడా, ఈరాత్రి కర్పూరములు వేసినను అత్తరువులు పోసినను, కాగడాలు మసకమసకగానే మండినవి?

వెంకటేశరావు.—అన్నయ్యగారూ, నిద్రలేమిచే మనకనులు మసకలైనందున అట్లగపడి యుండును.

రంగ.—కాదు తమ్ముఁడా; జ్వాలలు రాత్రి యెల్ల చీలికలు చీలికలుగానే అగపడినవి.

[నేపథ్యమున నౌభత్తు వాయింపఁబడును.]

రంగ.—ఏమి తమ్ముఁడా, నేఁడు మననౌభత్తు రోదనమువలె వినఁబడుచున్నది!

[ఫిరంగియగాదు. ఇరువురును అడిచిపాటుతో శ్రవణమభినయింతురు.

రంగ.—(ససంభ్రమము) ఇదేమి తమ్ముఁడా! ఊరిబయటనుండి వెండియు ఇట్టిఫిరంగిమ్రోఁత వినఁబడుచున్నది! తమ్ముఁడా, ఇది—

సీ. కల్పాంత కాలంపుఁ గాలిమొగు ల్లెల్ల
నొక్కుమ్మడిగఁ గూడి యుఱుముటొక్కొ?

క్షయమున విశ్వంబుఁ గాల్చు కాలాంతకు
గళగహ్వరపు మహాగర్జయొక్కొ?
కంబాననుండి రక్కసునిపైఁ బడు దంభ
హార్యక్షు ఘోరాట్టహాస మొక్కొ?
బెడిదంపు బడబాగ్ని వెడఁదఫిరంగి నై
మొత్తంబుగా మ్రోఁత మ్రోయుటొక్కొ?
తే. ఎత్తి వచ్చెనొ కూళరా జిట్టిహాడన?
సింతటి ఫిరంగి యాతని కేడఁ జెపుమ?
తమ్ముఁడా, రమ్ము మనమె బేతాళబురుజు
నెక్కి కనుఁగొంద మీవింత యేమొ యిపుడు. ౨౬

రా, తమ్ముఁడా, రా, బేతాళునిబురుజెక్కి ఇదేమో చూతము.

[అని బురు జెక్కుట నభినయింతురు.

వెంగ.— ఆహా! ప్రొద్దు పొడుచుచున్నది! చీఁకటి చెదరుచున్నది. [నలుగడం బరికించి] అన్నయ్యగారూ, ముట్టడి! ముట్టడి! ఆ యేనుఁగు లేమి! ఔరా! ఆగుఱ్ఱము లేమి! అబ్బా! ఆ ఫిరంగుల బారు లేమి! ఎన్ని డేరాలు! ఎన్ని డేరాలు! ఎంత కాల్బలము! దేవ అవధారు!

సీ. వీరబొబ్బిలి యిదే పేరుపొందినలంక,
యీ రాణువే యకూపార మౌర!
కాల్బలంబులె యుదకంబులు, మేల్తురం
గంబులే ఘనతరంగంబు లౌర!
వాటంపుడేరాలె వట్టిమేఘంబులు,
మత్తేభములె నీరుమబ్బు లౌర!

కడిఁది ఫిరంగులే కాలకూటంబులు,
కైదువులే భుజంగంబు లౌర!
తే. ఆవలిదరి లేదు, గణుతికి హద్దు లేదు,
కనము, విన, మిట్టిముట్టడి కలల నైన!
నెవరొ? వీ రేల వచ్చిరో ? యెఱుఁగవలయు ;
దిగుచునే యున్న దింక నల్దెసల దండు. ౨౭

రంగ.—[పరికించి] అవును తమ్ముఁడా! ముట్టడియే! ఇంతదండు విజయరామునికి లేదు. మఱి, మన కెవ్వరును పగవారు లేరు. వీ రెవ్వరు?

ప్రతీహారి.—[ప్రవేశించి] జయం జయం శ్రీరణరంగమల్ల బొబ్బిలి మహారాజ రంగరాయమహాప్రభువారికి. వేగులు వచ్చినారు.

రంగ.—వేగులకు నేఁడు తెలుపుడు లేకయే ప్రవేశము కలిగింపుము.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

[అంతట రొంఁజుచు వేగులు ప్రవేశింతురు.]

వేగులు.—మహాప్రభో, జయం జయం యేలినవారికి. విజయరామ రాజాగారు బొబ్బిలిమీదికి పరాసులని తెచ్చి ముట్టడేయించినారు. లక్షా దబ్భైవేలు గోలకొండదండు, 24 వేలు రాజా సిబ్బంది. లోపలిపురుగు బైటికి వెళ్లడానికి, బైటిపురుగులోపలికి రావడానికి లేదు.

రంగ.—ఇంక నే మయిన మీకు తెలియునా?

వేగులు.—మఱేమీ తెలియదు మహాప్రభో.

రంగ.—మఱి పొండి, మీపని చూచుకొండి.

[వేగులు నిష్క్రమింతురు.

రంగ.—తమ్ముఁడా, నాయొడమబుజము పట్టుకొమ్ము, ఎట్లు త్రుళ్లిపడు చున్నదో చూడు.

వెంగ.—[పట్టుకొని పరికించి] అన్నయ్యగారూ! మన కిది శుభ శకునము, విజయరామునికైన దుశ్శకునము. కావున మనకు వీరస్వర్గమునకు ఇది సూచకము. ఇందుకై చింతింప నేల?

రంగ.—కాదు తమ్మయ్యా. ఇదేమి నాగుండెలు కొట్టుధ్వని కోటతలుపును గొడ్డండ్లతో కొట్టినధ్వనివలె వినఁబడుచున్నది! నీకు వినఁబడుట లేదా?

వెంగ.—తమరు దిగులు పడుచున్నారే అన్నయ్యగారూ!

రంగ.—హా! ఈ సమయమున పాపయ్య లేకపోయెను గదా? తమ్ముఁడా, అతఁడు లేమి ప్రాణము లేమియే గదా!

వెంగ.—ఏమి అన్నయ్యగారూ! ఎన్నఁడు లేనిది తమరు ఈ దినము దిగులు పడుచున్నారు.

రంగ.—దిగులు గాకేమి తమ్ముఁడా! సమయ మట్టిదిగా నున్నది నాతమ్ముఁడా! మన మేమి-

శా. పారావారముఁ ద్రాగివైతుమొ? గిరివ్రాతంబు భక్షింతుమో?
తారెన్ బొబ్బిలి వీడి శ్రీ యిపుడు నిద్రాశూన్యచిత్తంబునన్.

అయినను దిగు లనఁగా నేమి తమ్ముఁడా!

వీరం బేదుదుమో? దురాన నరికిన్ వెన్నిత్తుమో? నమ్ముఁడో
వైరింగావమొ? యెట్టకేనొరులచేఁ బ్రాణంబుకోల్పోదుమో బిరా.

వాస్తవస్థితి నరసికొంట తెల్వి గాని దిగులు గాదు తమ్ముఁడా! మఱి, మన మిక్కడ కాలహరణము చేసికొనఁ గూడదు. క్షణములో స్నానతీర్థము కానిచ్చి, మంత్రాలోచన సభకు రమ్ము. తమ్ముఁడా నాచేరువకు రమ్ము [అని రాఁగా కవుంగిలించి] జేపు ఉందుమో, ఉండమో? ఒక తల్లికడుపునఁ బుట్టితిమి, ఒక్క టేమనస్సుగా అత్మగా బ్రతికితిమి. తమ్ముఁడా, ఎన్నఁడైన

నీయుత్సాహములకు భంగము చేసియుంటినా? నావలన నీ కేమయినం గొంఁతె కలదా తమ్ముఁడా?

వెంగ.—ఏమి అన్నయ్యగారూ! ఇట్లు పలికెదరు! తమవలనను నాకు భంగమా? తమవలన నాకు కొంతయా? బాలుఁడ నైన నాదుండగములను, తప్పులను మన్నింపవలయును.

రంగ.—నీవంటి తమ్ముఁడు నాకుఁ బైపుట్టువునం గలుగునా?

వెంగ.—నేనే మెఱుఁగుదును? ఎట కైనను తమశుశ్రూషకు రాక నేను మాత్రము వెనుకఁ దగ్గుదునా?

రంగ.—రమ్ము తమ్ముఁడా, రమ్ము. (అని కవుంగిలించి, ముద్దుగొని) దైన్యమని తలంపకుము, వీరుల మయినను మనుష్యులమే గదా?

[అంతట వేగులు వేగముగ ప్రవేశింతురు.]

వేగులు.—జయం జయం ఏలినవారికి! మహాప్రభో! ఎదిరిదండులోని తలమానుకులని తెలుసుకొని వచ్చినాఁ, మహాప్రభో.

రంగ.—ఎవ రెవరు?

వేగులు.—మహాప్రభో, ఒకడు విజయరామరాజు.

రంగ.—[స్వగతము] అతఁడు కూడ నొక తలమానిసి యఁట? ఈ చేఁతకు త్వరలోనే తలలేనిమానిసి అగును [ప్రకాశము] ఇతరులను చెప్పుఁడు.

వేగులు.—గోలకొండవారి యీపౌజు కంతా మొనగాడు మూసాబూసీ అనే ఫరంగిదొర. వారి ఫిరంగీకి దొర్లని కోట యీదేశంలో లేదట. హైదరుజంగు సాయెబు అతనికి దివాను. సర్దార్లు మరాటి భూములు, కల్బర్గ సంస్థానము భువనగిరిసంస్థానము కొట్టిన ఖానులంట. ఇంతేనండి యిప్పటికి తెలిసింది.

రంగ.—సరి పోయి రండి.

వేగులు.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

రంగ.—ఏడు మాఱులు ఇతనిని నేను జయించితిని. ఈ మాఱు నన్ను ఇతఁడు త్రొక్కివైచినాఁడు. గోలకొండవారికి నేను ఏమియు ఇతనికన్న అపరాధము చేయలేదు. పేష్కస్సు ఇతఁడును చెల్లింపనివాఁడే గదా? వీరు ఇతనిని మాని నన్ను ముట్టడించుట చూడఁగా, ఇతఁ డేమో కుట్రచేసి వీరిని సామీఁదికి తెచ్చినాఁ డనుట నిశ్చయము. ఈరాజు సమయము: కాచి నన్ను చిదుగఁ గొట్టినాఁడు. పెండిండ్ల సమయ మిది తనకు మంచిసమయ మని ఆలోచించి, యిప్పుడు ముట్టడి తెచ్చినాఁడు. నిద్రలో సింగమును పట్టినట్లు నన్ను తెలియనీయక పట్టినాఁడు. ఆహా! బయట వీరు ముట్టడి వైచుచుండఁగా లోపల ఊరేఁగింపులు ఉత్సవములు చేయుచుంటిమి. హా! దైవ మితనికి ఇప్పటికి ఇంతమాత్రము అనుకూలించినది. కానీ యుద్ధమే జరుగనీ, ఈపఠాసులు నాపోటు నొకమాటు రుచిచూతురు గాక. కానీ! వీరిసంఖ్య హెచ్చయిన నేమి?

వెంక.—అన్నగారికి విన్నపము, నే నుండఁగ తమరు పూనుకో నేల? ఇప్పుడు తమ సెలవైన—

వసుధ నిండినయీ ఫౌఁజుచీకటికి నేఁ
బట్టపగల నయ్యెద!
ఎడలేక పెరిఁగిన యీ దండు కాటికి
నెరగలి నే నయ్యెద!
చలియింపకున్న యీ సైన్యమేఘములకు
ఝంఝావాయువ నయ్యెద!
అద్దరి లేని యీ యరిసేనాంభోధికి
నగస్త్యముని నయ్యెద! ౨౯

సెల వీయవలయును.

రంగ.—నీ వుండఁగా నాకేమి పని తమ్ముఁడా? కానీ, అగడియ రానీ. మఱి నీవు పోయి త్వరగా రమ్ము.

వెంగ.—అన్నగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రంగ.—హా! ఇంతకాలమునకు నాచేతికి అటిన సమరము పోసఁగినది. విజయరాముని గెల్చిన నేమి కీర్తి? నాపోటు ఢిల్లీగోలకొండలలో మాఱుమ్రోఁగును గాక! పెండ్లికి తరలు రీతిగా పోరికి తరలెద. [నిశ్వసించి] హా! నిన్న పెండిండ్లు నేఁడు మరణములు!

ఆ. కన్నెవలపుతోడి యన్ను మిన్నల వీడి
కైఁ గొనంగ వలసెఁ గైదువులను;
బెండ్లి కంకణంబు వీరకంకణముగా
వెలమ యువలచేత విధి దవిల్చె. ౩౦

ఏమి యీమానవ జన్మము!

ఆ. అంతలోన నెలయు నంతలో మ్రబ్బును;
నంతలోన వాన యంతఁ బిడుగు;
బండి నిండి పఱచి గండిలోఁ బడినట్లు
పడియె నౌర! పదవి బాలికలకు. ౩౧

హా కోటలో ఊరేగింపు బయట ముట్టడి!

ఆ. మధువు లాని, యాద మఱచి, మత్తాగొని,
యాటపాటలందు నసఁగి పెనఁగి,
తేఁటియాండ్రు గండ్లు గూఁటిలో సుఖముండ
బయటఁ *గారుచిచ్చు ప్రబ్బి కొనియె. ౩౨

ఏమి యీ దైవమాయ?

ఆ. అకట! నిన్నఁ బెండ్లి యైన యిందఱు బాల
లేమి వెలితి నోము నోమినారొ!

---

* పా. దావవహ్ని

అంతిపురములోని హల్లకల్లోలంబుఁ
బౌరజనుల గోడుఁ బట్ట వసమె? 33

[ఆకాశమున చూపు నిలిపి] విజయరాముఁడా, ఇంతపని చేసిన నీవు నాచేత నేమి గతి పొందుదువో? త్వరగా సామతీర్థము కానిచ్చి,-అహో! ఏమి!

ఓరోరీ, నానగండా యుదురుమిడుకనీ
యూరి కైచ్చెత్తి వఁట్రా?
క్రూరా, మే ముత్సవ వ్యగ్రుల మగుటను నీ
కుఁ జయం బబ్బె నఁట్రా?
పోరా, మా కొల్చువేల్పుల్, పొడుచు కయిదువుల్
పొల్లులై పోయె నఁట్రా?
చోరా? మామీఁదికిఁ ఫ్రాంసులను బదములం
జొచ్చి రేఁ దెచ్చి తఁట్రా? 34

ఈరాత్రి యిట్లు ముగిసినది:—ఆస్థానము చేరెదను.

[అని నిష్క్రమించును.

[ద్వితీయ తృతీయాంకముల నడుమ]

## విష్కంభము.

స్థలము:— పెద్ద చెఱువు నీరాట రేవు.

[కతిపయ బ్రాహ్మణులు యథోచితముగ ప్రవేశింతురు.]

**వేదాంతి.**— శాస్త్రులుగారూ, అవు నయ్యా, నీమాట నిజమే! ఎంత దండు ఎంతదండు! వీరు ఈచెఱువును ఈప్రక్కనుకూడ చుట్టవేసిన యెడల ఊరికి ఇప్పటికి ఈనీళ్లు దొరకక పోవును.

**శాస్త్రి.**— వేదాంతిగారూ, ఈమాఱు రాజు మంచిరాజనీతిని ప్రయోగించినాఁడు. పెండ్లిసమయ మగుటచేత మనదొరలు ఎదిరి పోరనేర రని, మనయూరిమీఁదికి ఈగోలకొండసిద్దిలను పౌఁజును తెచ్చినాఁడు. [అందఱ నుద్దేశించి] అయ్యా, బ్రాహ్మణోత్తములారా, మన ప్రభువునకు జయము కలుగునట్లుగా ఈసమయములో మనబ్రాహ్మణోపాయములు ఎవరికి తెలిసినవి వారు చేయరాదా? పురుష ప్రయత్నముచే గ్రహదోష ములుకూడ తొలఁగి మేలు కలుగును గదా?

ఆ. వ్రాత దైవ మండ్రు, చేఁతఁ బౌరుష మండ్రు;
వ్రాఁత ప్రబలమేని చేఁత నణఁచు;
చేఁత ప్రబలమేని వ్రాఁత నడంచును;
గానఁ గడిఁది జతన మూనవలయు. 38

అయ్యా, జోస్యులుగారూ, ప్రశ్న చెప్పుఁడు.

**జోస్యుఁడు.**—యుద్ధప్రశ్న, శీఘ్రమే, హా! ఈరాత్రియే యుద్ధము జరుగును.

**ఇతరులు.**— ఎవరికి జయము? ఎవరికి జయము? రాజునకా రాయనింగారికా?

**జోస్య.**— ఎవరికిని లేదు. గ్రహములు చాల గందరగోళముగా నున్నవి.

[అని నిష్క్రమింతురు.

విద్యార్థి.—నేను రంగారాయనింగారికి జయము కలుగునట్లుగా నాపాఠములను మానుకొని సుందరకాండ పారాయణము చేసెదను.

[అని నిష్క్రమించును.

కవి.—అది దినములపని. నేఁడే యుద్ధము జరిగిన నది కార్యకారి కాఁజాలదు. కావున నేను రాయనింగారికి జయము కలుగునట్లుగా అమృత బీజములను, విజయరామ రాజునకు కీడు కలుగునట్లుగా విషబీజములను, పెట్టి పద్యాలు చెప్పెద. [అని నిష్క్రమి.

మాంత్రికుఁడు.—ఈసమయములో ఆపని చేయరాదు. పొరపాటున విషబీజము లిందును అమృతబీజము లందును పడినయెడల కొంప మునుఁగును; ఇప్పు డేమయిన మంత్రప్రయోగము చేయవలయును.

శాస్త్రి.—మంత్రాలకు మామిడికాయలు రాలవు. ఈసమయములో ఇంద్రజాలము అక్కఱకు వచ్చును.

వేదాంతి.—శాస్త్రులుగారూ! ఈపెండిండ్లు ఈముట్టడులు చూడఁగా లోకవృత్త మంతయు ఇంద్రజాలముగానే అగపడుచున్నది! అయ్యా,

ఆ. సుఖము లెల్లఁ గలలు, శోకంబులును గలల్;
తా ననెడు తలంపు హానిఁ దెచ్చె!
అరయ నింద్రజాల మఖిలప్రపంచంబు,
నిత్యసత్య మాత్మ నెగడు నొకటి. 3౬

శాస్త్రి.—అవును వాస్తవమే! ఇట తడయఁ జనదు.

[అని అందఱు నిష్క్రమింతురు.

---

# తృతీయాంకము.

స్థలకము:—రంగారాయునింగారి యాస్థాని.

[అంతట రంగారావు, వెంగళరావు, ధర్మారావు, గుమాస్తాలు, వేగులు, పరివారంబును ప్రవేశింతురు.]

రంగారావు.—చెప్పండు మా కన్నులారా, మీరు ఇంక నేమి కని పట్టి వచ్చితిరి?

వేగులు.—మహాప్రభో! పాపారాయునింగారు వస్తే కనిపెట్టడానికి రాజాందారిలో విడిసినాము విజయరామరాజు; తనదండంతా తనకాణ్ణే పెట్టుకొనున్నాడు. దానెంబణ్ణే హైదరుజంగుహేరా; బూసీహేరా దానెంబణ్ణుంది. సిద్దీబిలాలున్ను కడమ గొప్పసర్దార్లున్ను దానెంబణ్ణే. మాలపిల్లి కాణ్ణుంచి వరసగా కొండబోటు దాకా ఫిరంగీలబారు నిలిపినారు. దానికీ బుస్సీహేరాకూ నడమ మందు కొట్లు. ఊరిచుట్టూరా అడివిలాగ సిద్దీలని, ఫరంగీలని, బుడతకీచులని, ఇంగిలీసులని, వలిందులని, తురకలని, ముట్టడి నిలిపినారు. వారివారి సందుల్లో, వారివారి పడాళ్లు కుదురుకొని వున్నారు. పరానుల దండంతా ప్రతివాడికిన్ని తుపాకీలు, సన్నీలు కత్తీ కటారీ, బల్లెం బాకు; గోలకొండ తురకదండులో ప్రతివాడికి ఇవే గాక డాల్ తల్వార్, ఈటె ఇవిన్ని, విల్లు ఊచలున్ను. రాజాదండులో విల్లు ఊచలు లావు, తుపాకులు కొంచెం; బల్లెం బాకు ఈటె లావు. రాజు తన్నె సిబ్బందిని యుద్ధానికి పెట్టక చాకిరీకి పెట్టినాడు.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయం జయం ఏలినవారికి, హైదరు జంగు బహద్దరు కాడినుంచి రాయబారి సర్దార్ హాసేనాలిగారు వచ్చివున్నారు.

రంగ.—ధర్మారావూ, నీవు ఎదురు పోయి వారిని తోడ్కొనిరమ్ము.

ధర్మ.—చిత్తము. [అని ప్రతీహారితో నిష్క్రమించును.

రంగ.—(వేగులతో) మీరు మరలి పోయి ఇంక నేమయిన తెలిసి కొనిరండి.

వేగులు.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

[అంతట హాసేనాలిని తోడ్కొని ధర్మారావు ప్రవేశించును.]

ధర్మా.—వారే రంగారాయనివారు. తమరు ఇటు చెంతకు దయచేయవలయును.

హాసేనాలి.—[సమీపించి] సలాము రంగారావు బహద్దరువారికి.

రంగ.—[లేచి] సలాము హాసేనాలి సాహెబుగారికి, ఇట్లు కూర్చుండుఁడు.

[అని కుర్చీని జూపును. మువ్వురు కూర్చుందురు.

హాసేనాలి.—గోలకొండ నిజాముగారి యాజ్ఞచేత ఉత్తరసర్కారుల పేష్కస్సులు వసూలుచేయుటకు వచ్చిన సర్వాధికారి బూసీదొరగారి దివాను హైదరుజంగు బహద్దరువారు పంపఁగా మేము మీకడకు వారి రాయబారము తెచ్చినారము. వారి సర్దారులలో మే మొకరము. మేము వచ్చినపని హైదరుజంగు బహద్దరు వారి ధోరణిగానే వినుండు.—"మీరు గోలకొండ నిజామువారికి ఏడుసంవత్సరముల పేష్కస్సును ఎగవేసినారు. విజయనగరమురాజుగారి తాలూకాలు దోఁచుకొనుట, ఊరులు తగులఁబెట్టుట, లోనగు నేరములు ఎన్నియో చేసియున్నారు.

రంగ.—[ఆత్మగతము] హా; ఏమి ప్రయోగము! ఎంతపని చేసినాఁడు రాజు! [ప్రకాశము] తర్వాత, తర్వాత ?

హాసేనాలి.—"మఱియు, మా రాకను రాజు మీకు తెలిపినను 'నౌకరుల భేటికి మేము రాము' అని మమ్ము తూల నాడినారు. పైగా మేము పంపిన ఫర్మానాను సరకు గొన్నవారు కారు.

రంగ.—[ఆత్మగతము] ఆహాహా! ప్రయోగము విషమువలె ఎట్లు ఎక్కిపోయినది! [ప్రకాశము] మఱి ?

హా సేనాలి.—"అది యెట్లనటుండ-

(ఉత్సాహ)

నేము వచ్చి కాచి యుండ, నీకు లెక్క లేదొకో?
దీపుసాన నొభ తడిచి ధిక్కరింతువా మముగ్?
హోము మాని, యీక్షణాన నాఁపి దాని నీగడిగ్
జాములోన ఖాళి నేసి సాగు కట్టువల్వతోగ్.  3౨

ఇట్లు చేయనిపక్షమున మరల సూర్యుఁ డుదయించులోపల, మీపుట్ట కోటను మట్టిలో కలిపి, మీజాతము నెల్ల రూపుమాపెదము." ఇదయ్యా తమకు హైదరుజంగు బహద్దరువారు పంపిన రాయబారము. మేము వచ్చినపని అయినది, మఱి మేము మరలెదము.

రంగ:—అయ్యా! మామాటయు కొంచెమువిని మరలుఁడు.

ఆ. సత్యవంతు లెపుడు సత్యదూరులఁగూడ
సత్యవంతు లనుచు సమ్మతింత్రు
సత్యదూరు లన్న సత్యవంతులఁ గూడ
సత్యదూరు లనుచు సంశయింత్రు.  3౩

హా సేనాలి.—వాస్తవము. పార్సీలో అట్లే యొకసామెత కలదు దానికి తెలుఁగు-"కల్లరి కందఱు కల్లరులే, నిజమరి కందఱు నిజమరులే."

రంగా.—వీరులరు మీరు సత్యదూరులరు కానేరరు. మఱియు వివేకులకు విస్తర మనపేక్షితము కావున సంగ్రహముగా వాక్రుచ్చెద.

హా సేనాలి.—అట్లే చేయుఁడు.

రంగ.—మీరు తెచ్చినరాయబారములో అసత్యవాదము విశేషముగా నున్నది. మేము, విజయరామరాజా భూములలో అడుగుపెట్టలేదు. అతఁడు మమ్ము రూపుమాపను, మాబొబ్బిలి యేలను, దలఁచుకొన్నవాఁడై

యున్నమాటలకై నను మాతో పోరియున్నాఁడు. మేము, ఓడనందున, మా మీఁద మీ హైదరుజంగుగారికడ కుట్రచేసి, మాయింటి మీఁదికి ముట్టడి తెచ్చినాఁడు. నిన్న పగలు మాయింట పెండిండ్లయినవి. రాత్రి ఊరేఁగింపు అయినది. కంకణాలువిప్పలేదు. ఈసమయ మెఱిఁగి మామీఁదికి ముట్టడి తెచ్చినాఁడు.

హసేనాలి.—[ఆత్మగతము] నృశంసుఁడు [ప్రకాశము] మఱి?

రంగ.—మమ్ము కోట వదలి పొమ్మనుట చూడఁగా, మాజమీనును తనకు ఖరారు చేయించుకొన్నాఁడని తలంపనై యున్నది. అది యుండుఁగాక; ఎన్నిమాఱులో మమ్ము సఖ్యార్థమని బేటికిరావించుకొని సంఘాత సంహారము గావింప సమకట్టినాఁడు. దానంజేసి, అతనికిని మాకును, జాబులు జవాబులు కూడ నిలిచిపోయినవి. కావున వారివలన మీరాక మాకు తెలియ దాయెను. ప్రత్యేకము మీకడనుండి మాకు జాబు రాలేదు.

హసేనాలి.—[ఆత్మగతము] అతఁడుమా ఫర్మానా వీరికి అందనీకుండ హరించినాఁడా? ఆహా! ఆ హార్కారాలదంతయు వట్టినాటకముగా నగపడుచున్నది. ఏ మాశ్చర్యము! [ప్రకాశము] కానిండు.

రంగ.—ఈకారణముచే మేము మీబేటికి రాజమహేంద్రవరమునకు రామైతిమి. ఎప్పుడును, నౌకర్లబేటికి మేము రా మని పలికిన వారము గాము. మా తెలుపుకొనుట ఏమనఁగా?

క. నైజామువారి కట్నము
హాజీ లేడేండ్ల కైనయది చెల్లింతుర్
మీరాక తెలియమియే హేతు వైనను, మేము మీబేటికి రానందులకై,—
రాజమహేంద్రవరము మొద
లోజఁ బ్రతిమంజిలి కిత్తు నొకవేయివరాల్. ౩౯

మఱియు:—

క. శస్త్రము లయినవి గాఁగ
రస్తుల నెంతైన సరఫరా గావింతుర్;
హస్తులనుర్ హయములనుర్
బిస్తీలను దోలి పంపి ప్రియ మొనరింతుర్. ౪౦

క. నౌబత్తు మేము మానము;
నౌబత్తును మాకు ఢిల్లినాథుఁ డొసంగెన్.
ఈ బసను మేము విడి పో;
మీ బస నిర్మించికొంటి మేము వసింపన్. ౪౧

రాయబారము వచ్చిన గొప్పవారికి, మీకు మా వాస్తవస్థితి విశదపఱిచితిమి. గోలకొండనిజాముగారికి మామీఁద ఆయాసము కలుగకుండునట్లు హైదరుజంగునకు సత్ప్రత్యాశాలంబము చేర్పుట, వీరులకు మీకు ఉచితము. వినునేని ఎల్లవారికి క్షేమము. వినఁడేని మేము యుద్ధమ్మునకు సిద్ధముగా నున్నాము. ఏది యెట్లయినను, ఈయడావిడిలో తప్పనిదొక్కటికలదు; అది విజయరాముని మరణము.

హసేనాలి—రాయనింగారు చిత్తగింప వలయు. విజయరామరాజే మయిన నగును గాక. మీబొబ్బిలి మాకేల?

ఆ. నిజము మింటి నడిమి నీరజాప్తుని భంగి
మబ్బు * డాఁచుమాత్ర మాసిపోదు;
కల్ల పూఁతపసిఁడిగతి మెఱుం గగుఁగాక.
యొకసి చూచినంత విరిసిపోవు. ౪౨

---

* పా. గ్రమ్ముమాత్ర.

నన్ను తమరు ఇంతగొప్పచేసి ఇంత విశదముగా సకలవృత్తాంతములను తెలివిచ్చితిరి. గావున, నేను మీకు కేవలము అపరిచితుఁడ నైనను మీసౌజన్యమందు పక్షపాతినై హైదరుజంగుం గూర్చిన నాయోచనం బురస్కరించుకొని తమకు హితైషినై చెప్పెద. హైదరుజంగు మహామూర్ఖుఁడు; తప్పైనను, ఒప్పైనను, పట్టినపట్టు వదలఁడు. మీరు నాబత్తు నిలిపి జామునేపు కోటవెలుపల నుండినం జాలును; వానిదురాగ్రహము తీరును. నేను మీన్యాయము మాసర్వాధికారికి బుస్సీదొరకు తెలి[పి] మిమ్ము మరల కోటలో ప్రవేశపెట్టెద. యుద్ధమేల! లక్ష డెబ్బదివేలతో పిడికెఁడుమందికి ఎంతవీరులకైనను పోరాట మననేమి?

సీ. లక్ష డెబ్బది వేల ల్పష్కరుతోఁ బోరు
పిడికెఁడు మందికి బెడద గాదె?
బెడిదంపుఁ బిడుగు లేనెడు ఘనాఘన మైనఁ
బెనుగాలి కెదు రెక్కి పెనఁగఁగలదె?
ఒక్కఫిరంగికిఁ దుక్కు దుమారమై
మట్టిలోఁ గలియదే పుట్టకోట?
విండ్లఁ జువ్వలు మందుగుండ్లను గెల్చునే?
యేటుబారుల కెన యీటె దోంట్లు?
తే. ఎరగలిం బడు మిడుతల కీడు గాఁగఁ
దెలిసియును గొదగొని పోయి పొలియుటయును,
బాలవృద్ధుల సతులఁ దుపానులోని
పిట్టలను జేతయును, వెట్టిపట్టు గాదె? ౪౩

అయ్యా,

క. అల వచ్చినఁ దల వంపుము,
పులి వచ్చినఁ జెట్టు నెక్కు, పోయిన దిగుమా! ౪౪

అన వినలేదా? తుపానులో మహావృక్షములు నిట్ట నిగిడి కూలుదురు, తుంగ వంగియుండి అనంతరము తల యెత్తును. మీకు, ఇపుడు, పోరాటము నకు కాలము గాదు, పెండ్లియుత్సవము లింకను ముగియలేదు.

ఆ. రేయి గూబ వచ్చి మాయించుఁ గాకిని;
పగలు కాకి గూబఁ బట్టి చంపు;
కాలబలము; దీని గణుతించి పోరెడు
వీరుఁ డెల్లయెడల విజయ మొందు. ౪౫

కాలానుకూల్యమును చూడవలయును గదా? ఇప్పుడు ఈయవాంతరమును, ఎట్లయినను దప్పించుకొని యనంతరము గోలకొండకు తెలుపుకొని యపరాధులను దండన చేయింప వచ్చును. కనుక, నన్ను మీతమ్మునిఁగా భావించి నా ప్రథమప్రణయమునకు భంగము చేయక, అతఁడు కోరిన యీ రెండుపనులను చేయుఁడు. క్షణము సేపు నికారి వెళ్లితిమని తలంపుఁడు.

రంగ.—సాహెబుగారూ; మీరు చెప్పిన దెల్ల మాహితము గోరిన మాట గాని, మఱి వేఱుగాదు. మీ రెవరో మాకు అకారణబంధువు లనుటకు సందేహము లేదు. మీయుపదేశముయొక్క సారము, మాకు దాని మూదిలోనే తెలిసినది. మీతోఁడి సద్గోష్ఠిని సంక్షేపింప నొల్లక మీమాటలను అంతము వినుచుంటిమి. మీరు చెప్పిన నీతిపద్యము, మాకు వెలమకులము వారికి పాఠాంతరముగా నుపదిష్టము; ఎటు లన-

క. కలి వచ్చిన నడి గట్టుము,
పులి వచ్చిన నీఁటెఁ బొడువు, పొలియుదు నొలుమీా;
వెలమలతోఁ బోరాడకు;
వెలమలసిరి కాసపడకు, విస మది నీకుఁ. ౪౬

మాసేసాలి.—రావుగారూ! అది ధర్మమార్గమేగాని కార్యమార్గము గాదు.

రంగ.—అవుఁగా

(స్రగ్ధర.)

ప్రాణంబు ల్తీపులౌ ద్రాబల కగునయముల్
భాయి, మా కేల నేర్పన్?
ప్రాణం బన్నం దృణప్రాయ మగువెలమ వీ
రాళికిం గూర్ప వేలా?
నాణెం బౌకప్ప మిత్రున్, నగరు వెలువడన్,
నౌబతు న్మాన; హైదర్
నాణెంబు న్దప్పనేనిన్, నరహరి యొసఁగున్
నా కిహంబో పరంబో. ౪౭

పారమింతే, సాహెబ్ సలామ్. ఎంతటి పుణ్యము చేసినవారోగదా రణమరణము దొరకును? [తమ్మునినుద్దేశించి] తమ్ముఁడా! సాయబుగారు మన యందు అకారణమైత్రివహించి, చాలసేపు మనకు సాంగత్య మొసంగినారు; నీచేతులతో స్వయముగ వారిని సత్కరింపుము.

[నౌకర్లు అత్తరు పన్నీరు చందన తాంబూలములం దెచ్చి వెంగళరావుకడ నిలుతురు.

హసేనాల్లి.—అయ్యా! మీకు కోపము వచ్చిన వచ్చునుగాక! నాకుఁ దోఁచిన మాట పలికి పోయెదను. నాకు మీ పరువు వెట్టిగా నగపడుచున్నది. మీ బీరము ఏనుఁగు తనతలను తానే మన్నుకొట్టుకొనున ట్లున్నది! అయ్యా,

క. మీకు శుభమేని రణమృతి,
మీకులపాలికలు కూళ మ్లేచ్ఛులపాలై
చీకాకగుటయు శుభమా?
యీకానిమతంబు మానుమీ వెట్టిదొరా. ౪౮

[వెలమదొరలు ఉగ్రముగా చూతురు.

రంగ.—హసేనాలీభాయి, వేరేల?

క. మాకులము సతులు పుణ్య
శ్లోకలు, తముఁ జూచు పాలసులపాలిటికిన్
భీకర దర్వీకర దం
ష్ట్రాకర విషవహ్ని కీల లని వినవె సఖా. ౭౯

[వెంకట్రావు సాహెబును సత్కరించును.

రంగ.—సలాము హసేనల్లీ బహద్దరుగారికి.

హసేనాలీ—మఱి ఇఁక నేమి చేయవచ్చును! సలాము పెద్ద జమీన్దారుగారికి.

రంగ.—తమ్ముఁడా! వారిని సాగనంపి రా!

వెంక—అన్నగారి చిత్తము.

[హసేనాలీ వెంకట్రావు నిష్క్రమింతురు.

రంగ—ఎవరోయి అక్కడ?

ప్రతీహారి.—(ప్రవేశించి) ఏలినవారియాజ్ఞను శెలవియ్యవలెను.

రంగ.—మాజోస్యులవారు ఈక్షణము దర్శనము ఇప్పింపవలయును.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రంగ.—[సభ్యులనుగూర్చి] అయ్యా! మనమును మనమీఁద తప్పు లేకుండుటకై రాయబారము పంపవలదా?

సభ్యులు.—అవశ్యము పంపవలయును.

రంగ.—ధర్మారాయుఁడా మాబావగారిని పాపయ్యను పంపవలసిన పనికి నిన్ను పంపుచున్నాను. మీయక్కగారిని మాకు రాణిగా మీతండ్రిగారు వివాహము చేసినపుడు అరణముగా నీప్రాణమును నీవే ఇచ్చుకొంటివి. ఇంతకాలము మాకు దివానవై మాకు సకలవైభవములం గూర్చుటయే గాక, విజయనగరమువానిని మాజమీనువైపు కన్నెత్తి చూడకుండ చేసితివి. నీ కన్న మా పరువును, మాభాగ్యమును, కాపాడువాఁడు

ము లెవ్వఁడు కలఁడు? కావున, నీవు పరాసుదొరకడ కేఁగి, మా సేనాలీతో మేము పలికిన విధమునకు వెలితి రాకుండ, నీమతివిభవము ప్రకారము, కాయమో పండో, ఏర్పరించుకొని రావలయును. పైక మెంత యడిగినను, గోలకొండసర్కారునకు, అంగీకరింపుము. లంచ మడిగిన తమలపాకుతోడిమ నైనను ఒప్పుకొనకుము.

ధర్మా.— రాజేంద్రా! పాపయ్యగారు చేయవలసినపనికి నన్ను పంపితి మని తామే అనుగ్రహించితిరి గదా; అంతకన్న వేఱు గౌరవము నాకుం గలదా? కార్యము పంటే అగునట్లు ఎంతయేని మెలఁకువతో వ్యవహరింతునుగాని, వారు తూలఁబలికిన, వెలుపోటు రుచిచూపి వచ్చెదను. అది సమ్మతమయిన నన్నుం బంపుఁడు.

రంగ.—మాకు అదే కావలసినది. కనుక నీవే వెళ్లి రావలసినది. మఱి లేచి, నూటికి సిబ్బందిని వెంటఁగొని, సంధికి పోవుటగా, తెల్ల జెండాతో తెల్లతొడుగులతో, పడఁచాలురామయ్య సహాయుఁడుగా, పోయి రమ్ము.

ధర్మా.— ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

[అంతట వెంగళ్రావు ప్రవేశించును.

రంగ.— తమ్ముఁడా, మా సేనాలీ కోపముతోనే పోయినాఁడా?

వెంగ.— అన్నయ్యగారికి ఏమని మనవి చేయుదును అతని పరితాపమును! కడపట నాచేతులు పట్టుకొని, 'అయ్యా, నాభత్తు అయినను మాన్పుఁడు. దానిం దెలిపి మీ సౌమ్యతనే చెప్పి, మీవెట్టి చెప్పక, కోట ఖాలీ చేయవల దని జాములోపల మీకు బూసీదొరవారికడనుండి కబురు పంపఁ గడంగెద.' అని చెప్పినాఁడు.

రంగ.—నీ వేమంటివి తమ్ముఁడా?

వెంగ.—మీ రన్నమాటయే అంటిని.

రంగ.—అంతట?

వెంక.—అంతట దీనతతో సలాము లిడి వీడుకోలు వడసినాఁడు.

సభ్యులు.—ఇతఁడు మిక్కిలి సౌమ్యుఁడు, మిక్కిలి సజ్జనుఁడు; తురకలలో తప్పఁ బుట్టినాఁడు. ఇతఁడు ముందు పోయి మనలనుగూర్చి మంచిమాట చెప్పుట మంచిదే.

రంగ.—అవును. [సభఁ గాంచి] ఏఁ డయ్యా మాకరణము రామయ్యా?

రామయ్య.—[లేచి] అయ్యా! ఉన్నాను.

రంగ.—మేము వ్రాసినట్లుగా పాపయ్యకు జాబు వ్రాసి తెమ్ము.

రామయ్య.—ఏలినవారి చిత్తము. [అని నిష్క్రమించును.

రంగ.—[వెంకటరావు నుద్దేశించి] తమ్ముఁడా, నీకు నేను పెట్టెడు పనికి నామీఁద కోపము చేయకుము. నీ వయిన మిగిలియున్న విజయ రాముని వంశమునకుఁ గానిక, మరల బొబ్బిలిని, మనవంశములోనే నిలుపుదువు. నాతోఁగూడ నీవును పోర సమసిన, నిఁక భూమిలో మన పేరెక్కడిది? కనుక నీవు మన స్త్రీలను పరానుల చేఁతబడి యవమాన పడకుండ, వలస తీసికొని పాలకొండ మన్నెమున కేఁగుము.

[వెంకటరావు భ్రాంతుఁడై దిగులుపడి రంగారాయని చూచును.

రంగ.—ఏమి లేవవు? ఎప్పుడును నా నోటిలోని మాట నా నోట నుండఁగానే పని నెఱవేర్చువాఁడవు. ఇంతవరకు యుద్ధములో నెప్పుడును ముందు మెయిన నడపించినవాఁడవు. ఇపుడు వెనుకకు పంపినందులకు నాపై కోపమా? సమయమట్టిదిగానున్నది? ఈజన్మములో నంత ఈదినమున ఉందుమో ఉండమో? ఇట్టి సమయములో నాయాజ్ఞ నెఱవేర్ప త్వరపడ వేమి?

వెంక.—హా! రాజ్జాలు చేయవలసినపనియా నాకు సంభవించినది! ఏమి యీ దైవవిలాసము!

రంగ.—హా! ఎట్టికాలము వచ్చినది!

వెంక.—అన్నయ్యగారూ, రాణివాసములను తరల్చి మరలి తమ దర్శనము చేసికొనియెద; వారితో నేటాకరిం బంపవలయును.

[అని నిష్క్రమించును.

రామయ్య—[ప్రవేశించి] ఇదిగో జాబు; రెండు నకళ్లు వ్రాసి తెచ్చితిని.

రంగ.—చదువు రామయ్యా చదువు.

రామయ్య—[చదువును.]

"స్వస్తి శ్రీ బొబ్బిలి నేలు రావు గోపాలకృష్ణ రంగారావు బహద్దరువారు, మా బావగారికి, తాండ్ర పాపారాయనివారికి, కడపటి దండములు మ్రొక్కి వ్రాయుట.— విజయరామరాజు రాజాము సీమలో పితూరీలు చేయించుట మిమ్ము వెంగళరాయని పెండ్లికి రానీయకుండుటకోసమని మోసపోయితిమి. అందులకు కాదు కాదయ్యా. బొబ్బిలిని తెక్కలి లేని పిట్టను జేసి చిదగఁగొట్టుటకు, అని యిప్పుడు తెలిసినది. మఱేమున్నది బావా! రాజు మనసుంటిపోఁదికి గోలకొండ పరాసుపాఁజును ముట్టడి దెచ్చినాఁడు. రెండు లక్షలకు కాకిమూఁక పరాసుమూఁక కమ్ముకొనియున్నది. రాత్రి దొంగప్రొద్దున దొంగతనముగా ముట్టడి వేసినారు. వేగుప్రొద్దున ఫిరంగి వేట్లు వేసి తెలిపినారు. గడియకో అంగడియకో ఫిరంగివారలు బొబ్బిలిని వేసికొందురు. మేము పాపకారి పెండిండ్లు చేసితిమి. కోటలోపల చుట్టాలు వచ్చి నిండియున్నారు. స్త్రీలను కోటలో నుంచి, జగడమాడుట సరిగాదు. మాకు కోటలోపల రస్తు లేదు. వలసలు తరలుటకు త్రోవలు లేవు. బావా, వెంగళ్రాయఁడు ఇంకను, కంకణాల చేతులతోనే యున్నాఁడు. మా కందఱకు సంఘాత మరణము సిద్ధమైన దయ్యా. పెద్దలనాటి బొబ్బిలికోటకు మాకు ఋణము చెల్లినది. ఇక్కడ స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు అందఱు నీపేరు పల్కుచు, అంగలార్చుచున్నారు. నీవు వచ్చిన, మాకు ఈసంఘాతమరణము తప్పును. ఏడేడు పదునాలుగేండ్లకును బొబ్బిలికోటను ఆ యముఁడును పట్టలేఁడు; జయముకీర్తియు క్షేమమును కలుగును. నీవు రాకున్న, రాజామునకు తరలిననాఁటి చూపులే నీకును నాకును కడసారి చూపులు సుమా! పెండ్లికి రాలైతి వని చింతిల్లుచుంటిని. ప్రాణము గాచ రాలేని చెప్పవలయునా?

ఈజాబు చూచిన తక్షణము, బావా, రాజామునకు బొబ్బిలికి సందున విజయ రామరాజు దండువిడిసి యున్నాఁడు, అతని దండును విఱుగఁబోడుచుకొని కోటకు రావలయ్యా, ఇన్నూటితో వెంగళరాయని నీకు ఎదురు పంపెదను. నీకోసము దిడ్డితలుపు తీసి యుంచెదము. నీవును మిరియాలసీతన్నయు మాల పల్లిమీఁదుగా, కొండబోటు తిరిగి, ఆదారిలో హైదరుజంగు జేరా యున్నది, ఆ హైదరుజంగును విడిదలలో నఱికి, రావలయును. ఈరాత్రి వత్తువేని, నీకును నాకును చూపు లుండును. ఇవే బావా! నాకడసారిదండములు.—

ధాతు-పాల్గున-శు. 3 సోమవారము.

రంగ.—దివ్యముగా వ్రాసితివి. మేమే చెప్పిన ఇంత చక్కఁగా కుదురదు, ఇదిగో మొహరు. [అని యుంగరము తీసి రామయ్యచేతి కిచ్చును.

[రామయ్య మొహరు వేసి, మొహరు రంగారావుచేతి కందిచ్చును.

రంగ.—ఈజాబులు పగతురచేతఁ బడకుండ పాపయ్యకు ఎట్లు చేరఁ గలవు?

రామయ్య.—మహాప్రభూ, నేను వెళ్లి అసంవిధానము చేసెదను.

రంగ.—మంచిది పోయి అట్లే చేయుము.

[రామయ్య నిష్క్రమించును.

ప్రతీహారి—[ప్రవేశించి,] జయము జయము ఏలినవారికి ? మహా ప్రభో, జోస్యులవారు కాశికి వెళ్లినారు; వారి సిషువుడు ఏలినవారి సభకు రాను భయపడి [అని వ్రాఁతయొకటి రంగారాయని మ్రోల నిడి,] ఈరాత తన గురువుగారు ప్రశ్నవస్తే యేలినవారికి అందించమని తనచేతి కిచ్చి వెళ్లినా రని యిచ్చినాడు.

రంగ.—[కైకొని, ఇట్లు చదువుకొనును.]

*మ. అమృతాహారులసంగడి న్వలచి కాయంబూడ్చి స్వర్వాటికిఁ
గమనించుఁ సకళత్రబంధుసచివాక్రందప్రయోధంబుగా

* ఈపద్యము మదీయము. ఏతత్ స్థానమున ప్రథమముద్రణమం దుండినట్టిది, మదీయము గాదు. వే. వెం.

సముదారాతి చమూ మహోదధి నగస్త్యక్రీడఁ బెంపొందిరం
గమహీనాథుఁడు ధాతుఫాల్గునకలక్ష్మిన్ దుర్యవేఁ బ్రొద్దునన్.

[ఆత్మగతము] హా! ఇందువలననే వారు సాకుం జెప్పక యేఁగినారు. హా! ఇట్టి వ్రాఁత బ్రహ్మ వ్రాసియుండఁగా నరుఁ డేమి సేయఁగలఁడు? హా హా హా! పుట్టలోని యుసుళ్లనన్నిటిని కిరాతుఁడు పట్టినట్లు కోటలోని మాజాలము నంతయు ఒక్కమొగిని పట్టినాఁడు, విజయరాముఁడో, యముఁడో! ఈజోస్యము చూడఁగా, బాబు పాపయ్యకు చేరదు, రాణివాసములవలసయు జరుగదు, రాయబారంబును ఫలింపదు.

వెంగ.—[ప్రవేశించి] విన్నపము. తమయాజ్ఞను తెలుపఁగానే, రాణిగారికి, చాల కోపము వచ్చినది. జవాబు చెప్పుటకు వారే తమకడకు, అదె వచ్చినారు.

వెంకటలక్ష్మి.—[అపటీక్షేపముగా ప్రవేశించి] జయజయం ఏలినవారికి. దేవిగారు వచ్చియున్నారు.

[అంతట కూఁతునుం గొమరునిం దోడ్కొని రాణి ప్రవేశించును.]

రంగ.—[సంభ్రాంతుఁడై] ఏమి యిది; స్త్రీలు ఆస్థానికి వచ్చుటా? ఎన్నఁడైన కలదా? ఇ దేమి సాహసము! ఏమి యీదురాచారము! మతి పోయినదా? ఘోషా ఏ మయినది?

[సభ్యులు వెంగవెంగంబులు చూచుకొని తటాలున నిష్క్రమింతురు]

రాణి.—ఇంటికప్పు తెగఁ గాలి, నెత్తిమీఁద పడుచుండఁగా, నిఁక నేమి ఘోషా? ఇంతకాలమునకు పూసపాటిరాజు నన్ను రచ్చకెక్కించి, తమతో తెగువమాట లాడించినాఁడు. ఇన్నాళ్లకు మీ కేమి వెలమబుద్ధి పోయి రాచబుద్ధి వచ్చినది! మమ్ము నందఱను పాలకొండకు తలస పంపిన, ఆ పాలకొండకు ఆణిదారుఁడు గదా ఆపూసపాటిరాజు, అతఁడు లోలోపల, దండు పంపఁడా మామీఁదికి అక్కడికి? సిపాయి కొక్క వెలమస్త్రీని గట్టఁడా విజయరామరాజు? పరులచేత చచ్చుటకు మా.

కేమి కారణము? మీ రేమి ఏలినను, అనంతకాలము రాజ్యము శేలెదరా? యుగములు జగములు గలంత కాలము భూమి పాలించెదరా? చచ్చిన పేరు బ్రతికిన లేదు. మీరు చావను మేము బ్రతుకను ఆలోచించితిరా? చచ్చినను మేము కోటలో చావవలయును గాని, పరులచేత మేము చావము.

రంగ.—ఈమాట మాతమ్మునిచేత చెప్పి పంప రాదా? స్వయముగా ఏల రావలయును?

రాణి.—ఏల యనఁగా, ఈబిడ్డలను మీయొడిలో ఉంచి వారికి మీకు కడసారి చూపు లందిచ్చుటకు తెచ్చితిని. (అని కొమారితను తండ్రి ప్రక్కను నిలిపి) రావమ్మా! సుందరమ్మా! మీనాయనను కడసారి చూపు చూచుకోవమ్మా, (పుత్త్రునింగూర్చి) నాకొండా! మీనాయనగారియొడిలోఁ గూర్చుండుము.

[అని పుత్త్రుని రంగరాయని యొడిలో కూర్చుండఁబెట్టును.

రంగ.—రావమ్మా అమ్మా, అమ్మా రా. కడసారిచూపా యిది? [అని కూఁతును కవుంగిలించి, ముద్దుగొని] ఇవే అమ్మా మేము నీకిచ్చిన సారె చీరలు! (శిశువును లాలించుచు)

ఉ. నాయన, నీదు నెన్నొసట
నల్వ లిఖించెను మీకుఁ గాలకూ
టాయిత మౌ దురంతయు వా
తంబునఁ; బున్నెము లిట్టు లుండఁ, మా
నాయనసాటి వాఁడు వని
నమ్మితి నా చిటుపూప; యకార సీ
పాయిగో రాచపాదలిగొ
బానిస వాడువె రావుసంతజా? ౫౧

బాబూ, పూసపూటిరాజునకు ఏమియూడిగము చేయుదువో తండ్రీ! ఇందులకా నీవు బ్రతుకుట? [అని ముద్దుగొని కత్తిదూసి నఱకఁబోవును.

సుందరమ్మ.—(కనులు మూఁతబడి) 'బాబయ్యా; పాపయ్యా.'

[అని తండ్రి కాళ్లు పట్టుకొనును.

రాణి.—(కత్తి పట్టుకొని). ఏమి! వెలమదొర లిట్లు వెఱ్ఱిదొర లైతిరి! ఆహూనయే గదా విజయనగరముమీఁద మీపగ తీర్చుకొనవలసినవాఁడు? ఆతనిని మాచెల్లెలు జగ్గమ్మ కడకు సామర్లకోటకు పంపఁదగును. వానివలన మరల మీవంశము, ఆ సూర్యచంద్రులున్నంత కాలము, వర్ధిల్లును; వానిని కాదు మీరు నఱకవలసినది. శత్రువులకంటెఁ బడకుండ వెలమరాణులను మమ్ము నఱకవలసినది.

రంగ.—చక్కఁగాఁ జెప్పితివి; మెడచాఁపు.

[రాణి రంగారాయని పాదములకు ప్రణమిల్లి మెడ చాఁచును. రంగ. నఱక నుంకించును.

సుందరమ్మ.—[తండ్రి కాళ్లను చుట్టుకొని] అయ్యో! బాబూ! బాబూ! [అని అంగలార్చును. శిశువు కత్తి కడ్డముగా తల్లిమెడను కౌఁగిలించుకొనును.

వెంగ.—ఇప్పుడేల అన్నగారూ? ఇంకను సమయ మున్నది అంతకు వచ్చినప్పుడు చూచుకొందము.

రంగ.—అటయిన మీరు ముగ్గురు సెలవు పుచ్చుకొండు.

[రాణియు, బాలుఁడు, సుందరమ్మయు, వేంకటలక్ష్మియు నిష్క్రమింతురు. సభ్యులు ప్రవేశింతురు.]

రంగ.—నేను అనుకొన్నట్లే అయినది. రాణివాసములవలస జరుగ దాయెను. మఱి మా వంశపరంపరగా మాదొరతనమును కాపాడుచు వచ్చిన దళవాయులారా—

[నేపథ్యమున]

ఏలినవారు కొలువుతీరియే యున్నారా? ఉన్నారు ప్రభో.

[అంతట ధర్మారావు, నెత్తుటం దోఁగుచుఁ బ్రవేశించును.]

[అందఱు సంభ్రాంతులై కందురు.

ధర్మారావు.—దండములు బాబుగారికి, దామర్ల ధర్మయ్యను తమయానతి సెలవేర్చి వచ్చినాఁడను.

రంగ.—మేము సంధి కని తెల్లయొడుపుతో పొమ్మనఁగా మీరు ఎఱ్ఱయొడుపుతో నేల పోయితిరయ్యా.

ధర్మా.—ఇది తెల్ల దుస్తే; పరాసుల నెత్తుటిలో నెఱ్ఱనైనది.

రంగ.—కూర్చుండుము. ఏమి? ఏమయిన దచ్చుట? వివరముగా చెప్పుము.

ధర్మా.—(కూర్చుండి) మేము గోపాలస్వామిని సేవించి, మ్రొక్కులు ముడుపులు గావించి. పోయి, బుస్సీకచ్చేరికి తెలుపుకొని చొచ్చితిమి. చొరఁగానే, విజయరామరాజు, ఆకచ్చేరిలో నున్నవాఁడు. నన్నుఁ జూచి, చివుక్కున లేచి, హైదరును కన్నుగీటి తోడ్కొనిపోయి, తన వ్రేలియుంగర మొకటి ఆతనివ్రేల నుంచి, చెవిలో ఏమియో చెప్పి, చేతిలో చేయి వేయించుకొని పోయినాఁడు. 'సంధి పొసఁగనీయకు''ఎంతమాత్రము పొసఁగనీయను' అన్నమాటలుగా, పెదవుల కదలికచేత తెలిసినది.

రంగ.—అంతట? అంతట?

ధర్మా.—అంతట,—బూసీ కొలువులో లేఁడు. సర్దారులు ఇతరులును, ఇరువది నలుగురు ఉండిరి. హైదరు తనకావునకు అరుదెంచెను. నేను, 'సలాము' అనఁగానే, హైదరుజంగు దెబ్బదిన్న పామువలె, నామీఁదికి ఎగిరి— 'ఏమి నీ పాళెగానికి దివాణ మన్న లక్ష్యము లేదా? నాబత్తు మానఁడు, కోట వదలఁడు, తాను వేటికిరాఁడు; తన నౌకరును నిన్నుఁ బంపినాఁడు, మాకడకు? చూడు; కన్నుమూసి కన్ను తెఱచు

లోపల సిపాయిగానికోట ధూళీధూళిగా ఎగరఁగొట్టి, మిమ్ముల నందఱను మహమ్మాయి చేయించెద.' అని బొబ్బరించి, సాభత్తు నిలిచిననే గాని మాకు వేఱు కార్యము వినంబడదు? అట్లనిపోయి మీవేఁటకానితో చెప్పుకో.' అన్నాఁడు.

రంగ.—అంతట?

ధర్మా.—అంతట, నేను 'మాదొరను తూలనాడెదవా!' అని కత్తి దూయఁగానే, హైదరుజంగు గడగడ వణఁకి ఖానులవెనుకకు దాఁటి నాఁడు. ఖానులు, 'ఇటువంటివెలమలు కాఁగానే రాజానకు లోఁగరు' అని యొకరితో నొకరు అనుకొని, గలగల పలికి, లేచిరి. కొందఱు పోయి బుస్సీని దెచ్చిరి.

రంగ.—తర్వాత? తర్వాత?

ధర్మా.—బుస్సీ వచ్చి-'అయ్యా, మీ రెంతకూరులయినను దివాణ మునకు వచ్చి కత్తి దూయ వచ్చునా?' అని నన్ను అడిగెను. 'నేను శ్రీ బొబ్బిలిజమీన్దారు రంగారాయనింగారి దివాన నై రాయబారము వచ్చి, ఈ హైదరునోట తూలుమాట మాయించెదనా?' అని నేనడిగితిని.

సభ్యులు.—బళీ! బళీ!

ధర్మా.—అంతట, బుస్సీ 'మేము ఇంతచెంతకు వచ్చియుండఁగా నైన మీజమీన్దారు స్వయముగా మాబేటికి రాక, రాయబారము పంపుట యుచితమా?' అని యడిగినాఁడు.

రంగ.—సరి. అందులకు?

ధర్మా.—అందులకు, సత్యమున హరిశ్చంద్రుఁడు, ఔదార్య సాహసముల విక్రమార్కుఁడు, విద్యలో భోజుఁడు, ఈవిలో కర్ణుఁడు, కోపమున రుద్రుఁడు, నగు మాదొరగారు మీబేటికి మర్యాదలలో హెచ్చుతక్కువలు కలుగునేమో యనియే రాలేదు గాని, వేఱొండు గాదు. అట్లు వారు శంకించుట సరియే యని నాకైన మర్యాద చేతనే

తమకు విశద మాయెఁ గదా? ఇపుడు వారి కేమియు మరియాద లోపముచేయుమని మీరు సెలవిత్తు రని, ఈ యుత్తరక్షణములో వారిని ఇటికిం దెచ్చెద. వారిని కని వారితో క్షణము భాషించినచో, వారి మైత్రిని మీరు వదలరు. వారిపై కుట్ర చేయరు. వారిని జేర్పరు.' అని జవాబు పలికితిని.

రంగ.—అంతట?

ధర్మా.—అంతట, బుస్సీ—నన్నుఁ గూర్చుండు మని, తాను గూర్చుండి, నేనుం గూర్చుండి, ఇతరులుం గూర్చుండఁగా. నన్నుం గూర్చి.—'పోనీ! ఆమాట కేమి? మీ వ్యాయ మెల్ల మా సేనల్లీవలనఁ దెలిసినది. మీరు రాజమహేంద్రవరమునకు మా వేటికి విదేశము రామికి, కారణము తెలిసినది. మీరు కట్టనోప్పకొన్న యగావులవలన, అందులకు సమాధాన మైనది. మా దివానుమాట తప్పించుట మాకు శక్యముగాదు. అతనిని గోలకొండ నిజాముగారు స్వయముగా నియమించినారు. అతని సలహా ప్రకారము మేము వ్యవహరించునట్లుగా, మాకు హుకుము చేసినారు. కనుక, నాభత్తుకోటల విషయమున మీరు లోఁబడనియెడల పోరు తప్పదు. లోఁబడిన, మీకు పాలకొండసీమను బొబ్బిలికి బదులుగా మే మిచ్చెదము. అందులకు మీరు అంగీకరించిన, పోరు తప్పి, మనము ఖాయిఖాయిగా పోవచ్చును.' అని వక్కాణించెను. అంతట 'మీతో రాయబారమువలనఁ బ్రయోజనము లేదు.' అని నేను లేవఁగా, ఖానులు గీనులు, అందఱును, కనులెఱ్ఱఁజేసికొని, కత్తి దూసికొని, 24 గురును నన్ను పొదివిరి. హైదరు నన్ను అడ్డగింపుఁడని పండ్రెండు పహారాలకును, పహారాలో పెట్టింపుఁ డని ఖానులకును, ఆజ్ఞ చేసెను.

సభ్యులు.—ఏమి యాగడము!

రంగ.—అంత?

ధర్మా.—అంత, నేను 'నీపహారాలో నిలిచితి నేని నేను వెలమబిడ్డ నఁటరా? అని కేక వేసి,—

[పంచచామరము.]

తటాలునన్ బటాలు దూసి తన్నుఁ గాచు సామునన్,
బటాన్ మొగల్ ఘటాఘటీలు భ్రాంతులై ననుం గనన్,
బటాలు ఱెక్క, లేఁ దిమిన్, సపత్నవార్ధి దూఁటి, బల్
హటాహటిన్ హుమాపయిన్ దదుక్తిఁ జెప్పవచ్చితిన్. ౫౨

నా పరిజనములును, జవ్వాన ఈఁటెలు వంచి, అడ్డ మయిన సిపాయి మందల నెల్ల తెగఁబొడిచి, కూల్చుచు దారి చేసికొని, తమ పోటు రుచి చూచినవారు చూడనివారును, దిగులుపడి నిశ్చేష్టులై పడుచు లేచుచు తమ్ముఁ గనుచునుండ, నావలె నే అక్షతశరీరులై నావెంట నే వచ్చియున్నారు. నేను జేసినపని తప్పో ఒప్పో తమరే ప్రమాణము.

రంగ.—ధర్మారాయఁడా! మాపరువు నిలిపితివి. శత్రువులకు వెలమపోటు రుచి చూపించి, అక్షతశరీరుఁడవై వచ్చి మాకు కనుల పండువు గావించితివి. ఇంతకన్న ఒప్పేమి యుండును? చాలును, అలసితివి. పోయి సేద దేఱుము.

ధర్మా.—మహాప్రసాదము. [అని నిష్క్రమించును.

రంగ.—[సభ్యుల నందఱ నుద్దేశించి] అయ్యా, ఇంక నే మున్న! పోరు పొసఁగినది.

క. ఈసమయంబునఁ బాపయ
మాసమ్ముఖమందు నన్న, మార్కండేయున్
బాస టయి హరుఁడు గాచిన
వాసిగ, మముఁ గావఁడే యవనయమువలనన్! ౫౩

[ఉత్సాహ.]

గడియలోనఁ గోట నింకఁ గాడుసేయఁ బన్నుదుర్
గడి ఫిరంగిమోహరాలు కందకంబు చుట్టు రాన్;

కొడిని దివిచి పాదుషాహి కొడిని...(కొడా)
విజయరాము కొడిని—గోత్తళంబుపై
నిడెదుకొఅకు లగ్గయెక్క నిడుదు రుడుపనిచ్చెనల్. ౫౪

ఆ. అన్నలార, కూడియాడిన చెలులార,
విందులార, వినుఁడు విన్నపంబు:—
ఆలుబిడ్డలందు నాసగొందురు మీరు,
తల్లిఁ దండ్రి భక్తిఁ దన్పుచుండ్రు. ౫౫

ఆ. ఇట్టి ప్రళయమందుఁ గట్టు సేయము మిమ్ము,
మమ్ముఁగూర్చి మీరు మ్రంద నేల?
మీర లిపుడె పోయి వారిఁ గాచికొనుండు;
మాకు వచ్చె మారి, మమ్ము విడదు. ౫౬

దళవాయులు.—మహాప్రభూ! మాకొలిచిన వేలుపా! [మానోద్రేకముతో]

ఎంతమాట సెలవిచ్చినారు మమ్మేలినదొరవారు!
ఈఁటెకొక్క మొఖాసా తింటిమి యిందఱము మేము.
ఏలినవారి యన్నముచేత నెదిగిన దీ యొడలు;
ఏలినవారికి దీని నియ్యక యేఁగుదుమా మేము?
మీరు పెట్టిన దండకడెములు మేము ధరించితిమి,
మీ చేతుల మీ రిచ్చిన దుస్తులు మేము ధరించితిమి,
పెద్దల నాఁటి నెత్తురుకోకలు పిలిచె మమ్ము రంగ,
పరుల నల్ల రుచిగన్న పటాలు పైకిఁ దుమ్మె రంగ.
ప్రాణము మీరు, దేహము మేము, రావు రంగరాయ;

ప్రాణముఁ బాసిన దేహము నెవరు బసలకు రానీరు.
బంటు వెల్మలము మేమే గామా? యొంటర్లము గామా?
బంటు గంటు తెలగాలము గామా? యొంటర్లము గామా?
విలయము వచ్చిన సమయమునందు వెనుకకుఁ దగ్గుదుమా ?
చచ్చిన వేరు, బ్రతికిన లేదు, సాహసాంక రంగ.
మీ రణభేరి మ్రోఁగినప్పుడే మీకె యెఱుక గాదా?
గుభేల్! గు భేల్? గుభే! లనులకు, మాకు
శుభము? శుభము! శుభము!
ఘణులుఁ! ఘణులు! ఘణు! లనులకు, మాకు
మణులు! మణులు! మణులు!
భయము! భయము! భయ మనులకు! మాకు
జయము! జయము! జయము!
మీరగ పోరను మేము నిలువను మీరు తలఁచినారా?
మీతోడిదె మాలోక మన్నది మీరు మఱచినారా?
అడ్డుమాటలు సెలవు లియ్యక యాదరించి పొమ్ము,
పనిగొనవయ్యా, పనిగొనవయ్యా, ప్రభువరంగరాయా. ౫౭

[అని ప్రాంజలు లగుదురు.

రంగ.—దళవాయులారా! మీ యనురాగమునకు మిక్కిలి సంతోషము. ఆటయిన యుద్ధమునకు సన్నద్ధుల రగుఁడు. మహావీరులారా! మీరు ఒకొక్కరును పగతురతో కలయఁబడుదు రేని నూర్లను వేలను రూపు మాపఁగలవా రగుట లోకవిదితమే! అయినను పరాసుమూఁక, అనంతముగా నున్నది. మీ చేతులకు నయితము తఱుఁగునదిగా నగపడదు. సముద్రమునకు

ఏలము జేయుటగా నున్నది. పైగా మనము ముఖ్యముగా ఊఁచలోను, ఈఁటెలోను; కూల్చువారము. వారు ముఖ్యముగా గుండుతోఁ గూల్తురు. మఱి వారిపాల నున్న నల్లమందు మారమ్మతో పోరుట కష్టము. కోట కావున, మాటులనుండి మనము పోరితిమా, వారిగుండు మనపైఁ బాఱదు, మనయూఁచ వారినికూల్చును. నల్లమందు మారమ్మ మనమీఁదికి రాఁజాలదు. ఫిరంగులు మోర్జాచేసి కోటను గూల్పం గడంగుదురు. మీరు ఫిరంగివాని నెల్ల ఊఁచవాత జేయుదురేని, వారి యాపని నెఱవేఱదు. మనము బయటి కేఁగితిమా, వారు సులువుగా కోట పట్టుదురు. అనంతరము మనము రెండునిప్పులనడుమ మాడిపోవలసినదే. కోటలో నున్నట్లయిన, నా నియమించు సేనావిన్యాసమును నెఱవేర్పుఁడు. ఏమి? నాయూహ సరిగా నున్నదా?

దళ.—మిక్కిలి సరిగా నున్నది,

రంగ.—ఏమి? పడవాలు రామయ్యా?

పడవాలురామయ్య.—కోటలో పరాసులు చొచ్చినచో, మన యాఁడువారి దుర్గతి నూహింపఁగలమా? కోటనుండి, ఎంతమాత్రము మనము వెలువడంగూడదు. ఏలినవారియానతి సర్వోత్తమముగా నున్నది.

రంగ.—బేతాళుని బురుజుమీఁద, మా జెండాను నాభత్తును కాపాడుట, ముత్యాల పాపయ్యవంతు; 200 మంది సిబ్బంది.

ముత్యాలపాపయ్య.—మహాప్రభూ, దండములు. మహాప్రసాదము! ఇప్పుడు నేను ఏలినవారినౌకరను, ఇంతవరకు ధర్మానకు మీ యుప్పు తినుచుంటిని.

రంగ.—హనుమంతునిబురుజు మా వెంగళరాయనివంతు; 200 మంది సిబ్బంది.

వెంగ.—మహాప్రసాదము ఇప్పుడుగదా నేను యువరాజను, ఏలిన వారి తమ్ముఁడను.

రంగ.—కోమటి పేట బురుజు మా బావమఱంది ధర్మారావువంతు; 200 సిబ్బంది. పడవాలురామయ్యది బలిజెబురుజు, 200 సిబ్బంది.

పడ—రామ.— మహాప్రసాదము! నన్నేలినదొరా!

రంగ.—కడమ 1200 కాల్బలము, 250 గుఱ్ఱములు చలికాని వెంకయ్యక్రింద సిద్ధముగా నుండవలసినది. మఱి, మీరందఱు ఇండ్లకు వెళ్లి క్షణములో మీ తావులు చేరవలసినది. ఇంతలో నే పరాసులఫిరంగులు వినఁబడినా, ఆక్షణమే మీ తావులకు పోవలసినది. మా ధర్మారావులో ఆయనవంతునకు మే మిడిన తావును చెప్పవలసినది.

దళ.—ఏలినవారియాజ్ఞ.

రంగ.—ఊరిలో వారివారి యాత్మసంరక్షణ వారువారు చేసికో వలయుననియు, మావశము తప్పిన ప్రక్రియము వచ్చిన దనియు. చాటింపు చేయింపవలసినది.

పడ—రామ.—ఏలినవారియాజ్ఞ.

రంగ.—వారు ముందుమిగులవలసినదేగాని, మీరెవ్వరును ముందు మిగులకుఁడు. మఱి యిఁక ఏగడియకు ఎవర మే మగుదుమో గావున, మాకును మీకును ఇదియే కడపటిచూపు.

[అందఱు రంగారాయనిం జూతురు.

రంగ.—మఱి మనము తడయఁ జనదు.

దళ.—జయ బొబ్బిలి రంగారాయ మహావీర!

[అందఱు నిష్క్రమింతురు.

# చతుర్థాంకము.

[రాణి పురోహితభార్య వేంకటలక్ష్మి వేగుయువతులును ప్రవేశింతురు.]

రాణి.—[పురోహితభార్యను నిర్దేశించి] అవ్వగారూ ఈదాసీయువతులను ఇరువురను బయటివృత్తాంతములు తెచ్చుటకై పంపుచున్నాను. [అని వారింగని] ఓ ధన్యురాండ్రారా మీరు పోయి మీయన్నదమ్ములద్వారాన రాజువిడిదలలోని వృత్తాంతములం దెలిసికొనివచ్చి నివేదింపుఁడు.

వేగుయువతులు.—మహాలక్ష్మీ తల్లిగారి చిత్తము.

[అని నిష్క్రమింతురు.

రాణి.—అవ్వా, అరుంధతీదేవిగారూ, తాతగారేమయిన మాకు ఈయిడుమ తప్పునని చెప్పినారా?

పురో-భా.—ఏమి చెప్పుదును తల్లీ, మీపురోహితులవారికి నాతో పలుకుటకు తీఱలేదు. నిరంతరము శాంతిక పౌష్టికములకు జతనములు చేయుచుటగా నున్నారు.

రాణి.—వారి యాశీర్వచనము లైన ఇపుడు ఫలింపరాదా?

వేగుయువతులు.—[ప్రవేశించి] దండం దండం మహాలక్ష్మీ తల్లిగారికి.

రాణి.—బాలికలారా, ఏదేని చల్లనివార్త తెచ్చితిరా?

వేగు.—చల్లనివార్త లెక్కడివి! మాతల్లీ, ఆ పాపాత్ముడి హృదయం ఏమి చెప్పుదుము మహాలక్ష్మీదేవీ?

రాణి.—వివరముగా చెప్పుఁడు.

వేగు.—ఆరాజు తనకూ మన దొరగారికీ వున్నపగలు బొబ్బరిస్తా వున్నాడంట. బొబ్బిలికోట దున్నించి, ఆముదాలు జల్లిస్తాడంట. ఆ పాటిపా గారికి పుచ్చుకోక తనపగలు తీరవంట. రాయునింగారి శిరస్సు కోసు

కొని పోతాడంట. తనయున్నకుమారుడికి ఆనందరాజుకి బొబ్బిలికోట పట్టం కడతాడంట. ఈలాగ గర్జించి ఇంకను పాడుమాటలు పలికినాడంట తల్లీ.

రాణి.—వానిని గూడ వినిపింపుఁడు. ఇప్పుడు మాకాలము అట్టిది.

వేగు.—మఱి రంగారాయనింగారి బంగారపు మంచముపై కురుంటే నేగాని, తన పగలు తీర వని అరుస్తావున్నాడంట.

రాణి, పురో. భా.—హరి! హరీ!

రాణి.—బాలికలారా మీయనురక్తిని మఱవను. [వేంకటలక్ష్మి బాలికలకు పసుదనంబిచ్చును.]

వేగు.—రాయనింగారికి జయంకలిగితే మాకేమితక్కువ.

రాణి.—మంచిది పోయిరండి. [వేగుబాలికలు నిష్క్రమింతురు.] కాని: ఇందులకు బదులు నేను గోపాలస్వామి సన్నిధిలో పలికెద. అవ్వగారూ, ఇఁక మాకు స్వామియే దిక్కు. గోపాలస్వామిని కడసారి సేవించుకొని మేము సిద్ధముగా నుండెదము. వేంకటలక్ష్మీ, మాబాబును, మా కొమార్తను, తెమ్ము. పెండ్లికొమార్తలను, దాసీజనసమేతముగా తోడ్కొని వచ్చి, గోపాలస్వామికి, పూజచేయించి, మాకు దర్శనమునకు సిద్ధము చేయింపుము.

వేంక.—దేవిగారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాణి.—[ఒకదాసిని ఉద్దేశించి] ఓసీ! కామాక్షీ! నీవు బ్రాహ్మణవీథి కేఁగి పేరఁటాండ్రను గుడికి తోడ్కొనిరా.

కామాక్షి.—దేవిగారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

[అంతట సుందరమ్మ చినవేంకటరాయఁడు
పెండ్లి కొమారితలు, దాసీజనమును ప్రవేశింతురు.]

వేంక:—[వచ్చి] దేవిగారు ఆజ్ఞాపించినట్లు స్వామికి ఆచార్యులచే పూజచేయించితిని. మఱి తమ రందఱు దర్శనము చేయవచ్చును.

రాణి.—రండి, నాబంగారు కొండలారా; మావంశాంకురము లారా, రండి; [అని కొమారితను కుమారునిం జేరఁ దివిచి.] రండి నన్నుఁ గన్న తల్లులారా! రా రండి గోపాలస్వామికి కడసారి సేవచేసి కొందము.

[అందఱు మల్లమ్మదేవివెంట దేవళములోనికి ప్రవేశ మభినయింతురు.

రాణి.—ఆహా!

తే. పరమపురుషునింటి పట్టుసొచ్చిన మాత్ర
నాత్మ యెంత శాంత మయ్యె నహహా!
జాగిలంబులట్లు చాఁచిల్చితిను వగల్
కలయుఁబోలె విరిసి తొలఁగి పోయె. ౫౮

[ఆత్మగతము] అయినను మరల దిగులు మిగులుచున్నది.

[కామాక్షియు పేరఁటాండ్రను ప్రవేశింతురు]

రాణి.— [పేరఁటాండ్ర నుద్దేశించి] అమ్మారండి: మాకడపటి పూజను గైకొండి. [అని వారికి పసుపు కుంకుమ పువ్వులు ఇచ్చి] ఈనూలి పోగును గైకొండి. [అని వస్త్రాభరణములిచ్చి మ్రొక్కును.

పేరఁటాండ్రు.—ఈ మీ యిడుమలో సత్కారము లెట్లు గైకొందుము తల్లీ!

రాణి.—కమలాక్షీ, ఈవస్తువులను, గొనిపోయి వీరియిండ్లలో నప్పగింపుము. [వారింగూర్చి] అమ్మా, మీకు ఉద్దేశించినవి మేము మరల ఎట్లు ఉంచుకొందుము? అమ్మా, నిరాకరింపకుఁడు.

రాణి.—పిల్లలారా! రండి స్వామికిని అమ్మవారికిని మీకోర్కి చెప్పుకొండి.

బాలికలు.—[ఇట్లు వేఁడుకొందురు..]

పరమ పురుష, నీదు పాద పద్మముల
శరణుఁ జొచ్చితిమయ్య ; సామీ ! నిన్ను శ...
కరుణతో మాప్రాణేశ్వరులకై యీ యొక్క
గండము తప్పింపు; సామీ! ఈయొక్కగండము....
బాలల ము మే మే పాపమె ఱుంగము
ప్రాపని నిన్నే న మ్మితిమి; సామీ ప్రాపని...
వ్రాలితి మి నీదు పాద పద్మములందుఁ
బాలింపు మని వే డితిమి. సామీ పాలింపు....
ఎల్లలో కముల తల్లిరో లక్ష్మి, నీ
పిల్లల కు దిక్కు గమ్మా; అమ్మా నీపిల్లలకు...
ఉల్లము మామీఁదఁ జల్లఁగఁ జేసి మా
వల్లభు లను గావ వమ్మా. అమ్మా మావల్లభు...

**రాణి.**— స్వామిమ్రోలను నామొఱ వెట్టుకొనెద. స్వామీ, మాదొరల పాలిటికి ఈయొక్కగండమునైన కావరేవా? ఇమాఱు రాయనింగారి కోట విడిచి కొండలోనికి వలస వెళ్లితివా? ఎక్కడికి స్వారి వెళ్లితివయ్యా గోపాలస్వామీ.

ఉ. భావజుతాత; మాదొరల పాలిటి వాఁడవ; వారి నిత్తఱిన్
గావుము దేవ; మాకు నలికంబునఁ గుంకుమ నిల్పు మాధవా.
ఈవిలయంబుఁ ద్రోచెదవ యేని యొసంగెద నీకు హైమముల్
సీవిరు లాతపత్రములు సింగపుద్వారము తార్క్ష్యయానముల్.

మామీఁద నీ పగలు పట్టితివా గోపాలస్వామీ? మాదొరలు పోయిన శుక్రవారపు టారగింపు నీకు ఎవ్వరు చేయుదురు స్వామీ?

[స్వామి మెడలోని పూదండలు ధరణిం బడును. కిరీటము గిఱ్ఱునఁ దిరుగును.

రాణి.—ఆహా అపశకునము! [అని ఇట్లు పాడును.]

అపశకు నంబులే చూపెను!

అక్కటకటా! ఆప॥

సామీ మనకు

దివిజ శరణ్యుఁడు దీనల పాలిట- అపశ-ను॥

తపులనీఁ డాయె నె దను గని కరమును,

దిపురుద మమ్మతో దీనిఁ దెల్పుకొనంగ- అన॥

రాణి.—బాలికలారా, అమ్మవారికి మొఱపెట్టుకొందము. అమ్మా! తల్లీ! ఈపెండ్లికొమారితల కంకణాలు స్వర్గములో విప్పింతువా?

బాలికలు.—[ఇట్లు పాడుదురు.]

నమ్మిన మముఁ గావనమ్మా!

అమ్మా తల్లీ, నమ్మి॥

అమ్మా నీ పైన మా యంగలార్పులు విని, నమ్మి॥

ఇమ్మహి నీకన్న నెవరు దిక్కు మాకు?

నెమ్మి మా కిమ్మా మా యమ్మా లక్ష్మమ్మా, నమ్మి॥

రాణి.—హా! అమ్మవా రేమియు సూచన చేయదాయెను. కానీ, స్వామి యొకటియు, అమ్మవారొకటియు అనుగ్రహింతురా? మఱి, యిఁక గుడి వెలుపడుదము. [అని పరిక్రమించి] ఇదిగో, వీథిమన్న [అని మన్నె త్తుట నభినయించి] ఓ దేవతలారా! నా పూర్వజన్మపుఁ గొఱనోములచేత నిపుడు నాపై కరుణింపరేని, ఓ గోపాలస్వామీ, ఓ మహాలక్ష్మీ, [ఊర్ధ్వ మవలోకించి] ఓ సూర్యనారాయణమూర్తీ, ఓదిక్పాలురారా, నేనే వీర పతివ్రతనేని, మీకు నేను ఈపుట్టువున త్రికరణశుద్ధిగా సేవలుచేసి

యుంటినేనియు, ఇది యైన నగుఁగాక:—నా యార్యపుత్రునికే, ఈవిజయ రామునివలన మరణ మగునేని, అమూఁడవనాఁడే వీనిగతియు [అని మన్ను తూర్పారం బట్టుచు] ఇట్లు అగుఁగాక. ఈ పాపాత్ముఁడు నాయార్య పుత్రుని పసిండి మంచముపై పరుండునయేని దానిమీఁదనే వీనికి చిత్రవధ యగుఁగాక. [పెండ్లికొమారితల నుద్దేశించి] మఱి, మనము పైయాలోచన చేసికొందము. [ఒక దానిని] ఓసీ కమలాక్షీ, నీవు పోయి షరాబును మే మడిగితి మని చెప్పి, [ఉంగరము దీసి యిచ్చి] యీగుర్తు చూపించి వేయి వరహాలు తెమ్ము.

దాసి.—దేవిగారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాణి.—వేంకటలక్ష్మీ; ఈ స్వామియెదుట, ఈ యమ్మవారియెదుట ఈ నారాయణమూర్తియెదుట, నిన్ను మావంశమును నిలువఁబెట్టునట్లు వేఁడుకొనుచున్నాను. మాకుఁ గల 33 దాసీజనములలో నిన్ను పెద్దదానిగా గణనచేయుచుంటిమి. నీవు మాసంస్థానమును నిలుపఁగదే వేంకటలక్ష్మీ. సామర్లకోటలో మాచెల్లెలు జగ్గమకడకు వేంకటరాయని నీవు కొనిపొమ్ము. మేము బలిమిచావులు చత్తుమని మాచెల్లెలితో చెప్పుకువే వేంకటలక్ష్మీ.

వెంకట.—అమ్మా! మీరు చావను మేము బ్రతుకనా?

[అని కన్నీరు నించును.

రాణి.—[అశ్రులు దుడుచుకొని] కాదే; మా వేంకటరాయఁడు బ్రతికిన, మేము బ్రతికినట్లే గదే; వేంకటరాయని పెద్దవాఁ డగుదాఁక, నీవు పోషింపుము. అతర్వాత, మానాయనయే నిన్ను పోషించును. మాకుమారుఁ డని తెలిసినచో, మానాయనను పగవాండ్రు బ్రతుక నీయరు. అడ్డగించువారితో బాపనవారి యచ్చమ్మకొడు కని చెప్పవే. ఓసి మా బాబయ్యకు మొలకు నులకత్రాఁడు తెచ్చి మొలత్రాఁడు గట్టుఁడు.

[ఒక దాసి పోయి త్రాఁడు తెచ్చి కట్టును.

రాణి.—అరత్నాల మొలత్రాఁడు తీసివేయుఁడు. [తీసి వేయుదురు.

రాణి.—ఆభరణముల నెల్ల నూడ్చివేయుఁడు. [అట్లే చేయుదురు.

రాణి.—[బాలు నెత్తుకొని] అయ్యో! నాయనా!

క. దారులు గొట్టుకిరాతులు
ఘోరాటవిలోన నధ్వగుల కిడునిడుమల్
క్రూరను దల్లిని జోరిని
గారాబుఁగుమార నీకుఁ గావించితిరా! ౬3

[అని యేడ్చి] ఓసీ; మా నాయనకు విభూతి తెండు.

[ఒక దాసి పోయి తెచ్చును.

అవ్వ.—ఇటు తెమ్ము. [అని కైకొని తాను పూయును.

రాణి.—నాయనా, తండ్రికంటె యోగశాలి వని పెద్దలు చెప్పిరి గాని, యిట్లు పకీర వౌదు వని యెవ్వరును చెప్పరైరి నాకొండా! [అని అశ్రువులు తుడుచుకొని] ఓసీ; మా నాయనకు ఒక జందెము తెండు.

[ఒకతె దారము తెచ్చును. అవ్వ దానిని జందెమువలె చేసి బాలునికి వైచును.

రాణి.—[పుత్త్రుని నిర్వర్ణించి] నాయనా!

క. ఏ పేద తల్లి కడుపున
నో పుట్టితివి వేని హాయి నుందువు తనయా!
యీ పాడు మల్లి కడుపున
నే పట్టి, పుట్టి యిట్టి యిడుమఁ బడితివే! ౬౪

వేంకటలక్ష్మీ; 'వడుగ్గా నదా?' అని యెవరైన నడిగిన, 'కాలేదు, అయిన కుబ్జవాంద్రను చూచి యేడ్చి తానును జందెము వేయించుకొన్నాఁడు' అని చెప్పవే.

కమలాక్షి.—[ప్రవేశించి] దేవీ, ఇవుగో 1000 వరహాలు, ఇదుగో తమ యుంగరము.

రాణి.—వేంకటలక్ష్మీ, ఒడిపట్టు. [కమలాక్షి నుద్దేశించి] ఓసీ, అవరహాలు ఆ యొడిలో పోయుము.

[అట్లే చేయుదురు. వేంకటలక్ష్మి గట్టిగా కట్టుకొనును.

రాణి.—ఈపదారమున కాళింపకే వేంకటలక్ష్మీ. కోట తరలఁగానే, సోలుజర్లు, సిపాయీలు, రౌతులు, చుట్టవేసికొందురు. వారికి నీయొడిలోనిపదార్థము నంతయు వెదచల్లుము. దానిని వారు ఏఱుకొను సందడిలో నీవు తప్పించుకొనిపోవే; [అని శిశువును ముద్దాడును. శిశువు కన్నీళ్లు విడుచును. తల్లి మరల కన్నీళ్లు ఇడుకొని, బిడుతని కన్నీళ్లు దుడుచుచు తనకన్నీళ్లను తుడుచుకొని] అయ్యో! అయ్యో! నీవును ఏడ్చుచున్నావా! నాయనా! నిన్ను నేనెట్లు ఎడఁబాయుదును నా కూనా! [అని బాలుని కన్నీళ్లను ముద్దులతో తొలఁగించి] వేంకటలక్ష్మీ. వీఁడుగో నీబిడ్డఁడు; మాబిడ్డఁడు గాఁడు. [అని వేంకటలక్ష్మిచేతికి వేంకటరాయుని ఇచ్చి కన్నీళ్లతో] వేంకటలక్ష్మీ, ఈదిడ్డివాకిటినుండి వెలువడుము.

వేంకట.—ఇదే దేవిగారికి నాకడసారి దండము. [అని శిశువును దింపి, రాణికి మ్రొక్కి లేచి కైజారు ఒడిలో సముదాయించుకొని, కన్నీళ్లుబుకఁగా అడఁచుకొని] తల్లీ!

ఉ. వేవురు సోలుజారు లరివీరులు వచ్చిన, నీకటారితోఁ
జావఁగఁ గ్రుమ్ముదాన, నెడసందునఁ బట్టిని బట్ట నీను; దాఁ
గేవల మింద్రజాల మనఁ గిడ్వడనీయక కాతు నాదొరన్;
జీవము మాకు నిల్పఁగ వశీకృతమాయుని సంస్మరించెదన్. ౬౫

[ఆకాశము చూచుచు] స్వామీ! నారాయణమూర్తీ, ఈనాయనను జగ్గమ్మకు ఎట్లుచేర్పించెదవో! [రాణి నుద్దేశించి] నాతల్లీ,

ఉ. రావులవారు నేర్పిన పరప్రతిఘాతనవిద్య లెల్ల బా
గా వినియుక్తిగొల్పెద; నపాయము లేని యుపాయయుక్తిమై

సేవగ నైనఁ జేరిచెద నీకొడుకుం బినతల్లిసందిటం,
భావజ బాలభావ పరిభావుక రూప మహఃప్రభావునిం. ౬౬

[అని శిశువును ఎత్తుకొన్నదై నేపథ్యద్వారము వఱకు రాణి లోనగువారు కూడవచ్చి చూచుచుండఁగా నిష్క్రమించును.

రాణి.—[మోమున చేలాంచల ముంచుకొని యేడ్చి] మా నాయనకు నాకును ఈవిధమున ఋణము తీఱిపోయినది. [అందఱు ఏడ్తురు.

పురో. భా.—అమ్మా! ఏడువకు. నీబిడ్డఁడు నీ చెల్లెలికడ క్షేమముగా వర్ధిల్లును. ఏడువకు మాతల్లి. ఏడువకు.

రాణి.—[మఱియు వెక్కుచు ఏడ్చి కనులు తుడుచుకొనుచు] అవ్వా! తమకును మాకును గూడ నిటనే యిట్లు ఋణము తీఱినదా?

పురో. భా.—కాల మిట్లు వచ్చినది నాతల్లీ! అయినను ఇప్పుడైనను పరమేశ్వరుఁడు మనలను గావరాదా?

రాణి.—అవ్వా, ఎప్పటికైనను, మన మెడఁబాయవలసినదే గదా! తమరు ఈ పేరఁటాండ్రతో వెళ్లవచ్చును.

పురో. భా.—ఔను మాతల్లీ.

[అని దుఃఖదుఃఖముగా అగ్రపురంధ్రులతోడ నిష్క్రమించును. కామాక్షి దత్తములం గొని వెంట నేఁగును.

రాణి.—బాలికలారా, వీరపత్నులకు మనకు ఈ దీనత్వము తగదు. మనము మన ప్రాణేశ్వరులు పోవుతావునకు వారికన్న ముందేపోయి అచట వారికి స్వాగతము చెప్పవలసినవారము. అందులకు సిద్ధపడుదము రండు.
[అందఱు నిష్క్రమింతురు.

(చతుర్థ పంచమాంకముల నడుమ)

## ప్ర వే శ క ము.

(అంతట పలువురు పౌరులు ప్రవేశింతురు.)

ప్రథముఁడు.—ఒయ్యొయి సన్నాసీ, కోటలో నేమోయి చెవులు గింగురునేలాగ యీరోజల్లా ఖణీల్ ఖణీలు ఖణీల్మని మోగుతూ వుంది?

ద్వితీయుఁడు.—ఓహో అప్పడా మఱేమీ గాదు; కత్తులు, కఠారీలు, ఈటెలు, బల్లాలు, బాకులు, ఈలాంటి వన్నీ చికిలీ చేయిస్తూ వున్నారోయి.

అప్ప.—ఏమి చికిలీ అయినా చేయించేరుగాని, ఈకత్తులూ కఠార్లు, ఆ నల్లమందు మారెమ్మ ముందర అక్కరకు రావురా. నేను పెద్దలు చెప్పగా చెప్పగా విన్నాను కొన్ని విశేషాలు.

సన్నాసి.—నాకు చెప్పరా ఆవిశేషాలు.

అప్ప.—వినుమఱి. ఈ నల్లమందు మారెమ్మ అనే ఆమె కాళికా దేవి, అదే కాళరాత్రట. కాగానే మనకళ్లకి నల్లగా బొగ్గువర్ణంగా కనబడుతుంది. ఆమెకి కిట్టనివాళ్లు దగ్గిరికెళితే భగాలు మని మంట మండి అంతర్ధానమవుతుంది. వాళ్లు కాలి చచ్చిపోతారు.

సన్నాసి.—అవునురా, అవునురా.

అప్ప.—మఱి మన యీ దేశాల్లో నుంచి మంత్ర తంత్రాలకి పలాయమాన మైపోయిన భూత ప్రేత పిశాచ బ్రంహ్మరాక్షస శాకినీ ఢాకినీ కాంకినీ ఠాకినీ పినాకినీ బడబాకినీ గోడదూకినీ పాడెపీకినీ నింగినాకినీ నేల దేకినీ నీడగోకినీ దయ్యాలు ఆమెకిపరివారము. అవి ఆమెతో కూడా యెప్పుడూ అంతర్ధానంలోనే వుంటవి. యుద్ధంలో ఆమెకి కిట్టనిపక్షం వాళ్లని తెలియ నీకుండ మీదబడి చంపి రక్తం తాగేస్తవి.

సన్నాసి.—తినేస్తరట కూడా.

అప్ప.—అవును మఱి. మఱీ-ఆ మెయెప్పుడున్ను పరంగు లింగిలీసులు వొళందులు బుడత కీసులు సిద్దీలు వున్నారే, వాళ్లపక్షము. ఆమే వీళ్లకి గొట్టాలూ వుండలూ యిస్తుందే అవే తుపాకులు ఫిరంగులూ యినపగుళ్లున్ను. ఉండలవెనక తానేవుండి వూత్తుంది.

పౌరులు.—ఈళ్లల్లోబుడతకీసు లన్నావే అ దేం పేరండీ?

అప్ప.—వాళ్లు గుఱిగా చూస్తే బుడతలు, అనగా కుఱ్ఱవాళ్లు, కెవ్వున కేకేసి కీసుకీసుమంటూ లగువు వేసి చచ్చి పడిపోతారు.

పౌరులు.—నిజమేనా నిజమేనా? ఏ మాశ్చర్యము!

అప్ప.—అవుతే అబద్ధం చెప్పతానా?

పౌరులు.—అబ్బా! యీళ్లచేత మనపని యేమాద్దో గందా?

పౌరులు.—వొళందు లన్నారె వొళందు లేంటయ్యా?

అప్పన్న.—వాళ్లువొళంగులు- వొడ్రంగులు— అనగా కంపాల్లు. సముద్రం కిందవూళ్లు, యిళ్లు, మైదానాలు, ఆకాశం, అన్నీ కట్టుకొని, తిమి తిమింగిలాల మందలని గేదెమందలలాగ పాడి చేసుకొంటూ, ఆపాలు బడబానలంలో కాచుకొని తాగుతూ, హాయిగా వుంటారు అందుకోసం వాళ్లకి వొళందు లని పేరు.

ఒక కుఱ్ఱవాఁడు.—[బ్యా అని యేడ్చుచు] నాకు బయమేస్తావుంది. నన్ను మాయింటికాడికి తీసకెళ్లండి. [అని ఒకపౌరుని పట్టుకొనును.

ఆపౌరుఁడు.—తీసకెల్తాలే, మాకా డుండు, భయ ముండదు.

కుఱ్ఱ.—అబ్బా! నాానుండను. [బ్యా అని యేడ్చుచు పరువున నిష్క్ర-1.

సన్నా.—బాగా నరుకుతావురా. మఱికొందరి పేరు పరంగు లన్నావే ఆదెందుకొచ్చింది?

పౌరులు.—కుఱ్ఱోడు యెళ్లినాడు లెండి, మఱి శెప్పండి.

అప్ప.—పిరంగీలు కాల్చడంలో అంతటి వాళ్లు మరి లేరు. కడమవాళ్లంతా తుపాకీలు యేలాగ యెత్తి రొమ్మున పెట్టుకొని కాలుస్తారో, వీళ్లు యెంత పిరంగీ అయినా అలాగే యెడమచేత్తో యెత్తి రొమ్మున బెట్టుకొని కాలుస్తారు. అదీ కారణం ఆపేరురావడానికి.

పారులు.— ఇంగిలీసు లేంటండీ?

అప్ప.——వాళ్లమతంలో 'యేంజెల్సు' అంటే దేవతలు. వీళ్లు దేవతల అవతారమని ఆపేరు వచ్చింది. అలాగే వీరున్నచోట అధర్మం జరగ దంటారు.

పారులు.——మరి యీళ్లందఱు తెల్లగా వుంటారే, అదే మండీ?

అప్ప.——పూర్వము హనుమంతుడు మొదలయిన వానరవీరులు సీతాదేవిని చూచివచ్చి మధువనంలో చొచ్చి తేనె లన్నీ తాగేసి, దధిముఖుణ్ణి అవమానపఱిచినప్పుడు అతడి మొఱ్ఱని సుగ్రీవుడు వినకపోతే, దధిముఖుడంటే అతని మొఖం పెరుగులాగ తెల్లగా వుంటుం దన్నమాట, అతను అలిగి దేశాలమీద పాఱిపోంగా, అప్పట్నుంచి ఆదేశాలన్ని గడ్డగడ్డగానే, చెట్లు, చేమలు, కొండలు, అడువులు, ఆకాశం, నదులు, జీవరాసులు, అన్నీ కాలమానంతో కూడ, పెరుగుగడ్డలలాగ తెల్లబడి పోయినవి. వీళ్లు ఆదేశాల వాళ్లు.

పారులు.—ఏమి శిత్ర మండీ? మరి సిద్దిలో?

అప్ప—వాళ్లు ఏపనిమీద వెళ్లినా అది సిద్ధే; అందుకోసం సిద్దీలు. పూర్వం వాళ్లు బొమ్మరాకాసు లట, వాళ్లకి మేకలు పొట్టేళ్లు ఆటవు. ఒక్కడొక్కడూ పూటకి ఒక యెద్దుని తినేస్తాడు.

సన్నా.—కొంద రంటారు పూటకు ఒక పెద్ద శిద్ది నెయ్యి వీళ్లకి అన్నంలోకి కావాలట. అందుకోసం ఆపే రొచ్చిందట.

పారులు.—ఓయిబాబో ఓయిబాబో! ఏమి యింతండీ!

అప్ప.—అమాట కేం గాని, నాకొక స్వాములవారు చెప్పినారు; రెండుపాదాలు రెండు శిద్దెలు, రెండు పిక్కలు అంతకన్న రెండు పెద్ద

నిలువు శిద్దెలు. తొడలు అంతకన్న రెండు పెద్ద నిలువు శిద్దెలు, పిక్కలు మటే ప్యాధ రెండు శిద్దెలు, కడుపు వొక ప్యాధ అడ్డ శిద్దె, రొమ్ము ఆలాంటివే రెండు నిలువు శిద్దెలు, బుగ్గలు రెండు శిద్దెలు, తలకాయ ఒక శిద్దె, ఈలాగ పుట్టినా డట వీళ్ల మూలపురుషుడు. ఆమూలంగా వీళ్లకి శిద్దీలని పేరట.

పౌరులు.—ఐటయితే యీళ్లకి మనోరు సాల్లే రంటారా?

అప్ప.—మనవారికే ఈపఠానులు చాల్లే రంటాను.

సన్నా.—అది యలాగ? వివరంగా చెప్పు.

అప్ప.—యలాగంటే, మనదొరలు భేతాళుడి వంశస్తులు.

సన్నా.—అయ్యో నీ తెలివి! భేతాళనాయు డని వీరి మూలపురుషుడురా; భేతాళుడు గాడు. ఆయన వోరుగంటి ప్రతాపరుద్రమహారాజు కాడ ప్రధాన సేనానాయకుడుగా వుండి, తురకలని పారదోలి, వోరుగంటి ఆంధ్రరాజ్యాన్ని స్థాపించినవాడు.

అప్ప.—అ దంతమాత్రం గాదు. భేతాళుడు భేతాళుడు భేతాళుడే. ఆభేతాళుడు ఈకోటలోనే నివాస ముండి, పిశాచాలని యేలుతూ వుండేవాడు. అప్పుడు హనుమంతుడు ద్రోణపర్వతం తేవడానికి వెళ్లుతూ, మంచి తిండి వుంటే మోయడానికి బలము వుంటుం దని, భేతాళుడియింటికి చుట్టంగా వొచ్చినాడు. తన బురుజు తనకి యిద్దటికీ చాలదని, భేతాళుడు ఆక్షణాన పిశాచాలచేత హనుమంతుడికి వేరే బురుజాకట్టించి, అది ఆయనకి బస యేర్పరిచి, అందులో తిండి పెట్ట్యాడు. అందుచేతనే యీబురుజుకి భేతాళబురు జని, ఆబురుజుకి హనుమంత బురుజని, పేళ్లు వచ్చాయి.

సన్నా.—శహబ్బా! శహబ్బా! మంచి సొరకాయలురా! పోనీ మని విన్నకొద్దీ పరుగుతున్నావు. కాని, ఇంకా నరుకు. నీకు తగిన వినేవాళ్లే దొరికినారు!

పౌరులు.—ఇంకా శెప్పండయ్యా, శెప్పండి; మనదొరలు పఠానులని యలాగ గెలుస్తారో?

అప్ప.—వినండి మతీ. వెలమదొరలలోనే మతీ కొండఱు నరసింహ మూర్తి వంశస్థులు. అందుచేత వెలమదొరల ముందర, యీభూలోకంలో, మ రేవీరులున్న తల యెత్త లేరు.

సన్నా.—ఓయి నీ తెలివి! సర్వజ్ఞ సింగమ నాయనింగారని మతీ వోళ మూలపురుషుడు రా. ఆయనికి తెలియని శాస్త్రంగాని విద్యగాని లేనందున, ఆయనికి సర్వజ్ఞ బిరుదు వొచ్చింది. ఆయన వెంకటగిరిరాజ ధానిగా తూర్పుసీమంతా యేలిన దొర.

అప్ప.—అన్నా! సన్నానిగాడు! మాటమాటకీ పుల్లేస్తాడు!

[అని సన్నాసిని చిటమట లాడుచుం జూచును.

సన్నా.—ఏమిటీ! అప్పిగాడు మనిషిలాగ కగుతున్నాడు!

[అని కోపించును.

[అంతట వెట్టివాఁడు ప్రవేశించి యిట్లు దండోరా వేయును.]

ఆలివిగాని పెళయం వొచ్చింది. (డుండుం.) పరాసులు గడెకో గడెకో కోటమీది కొస్తారు. (డుండుం.) పూరిజన మంతా యెవరిసొత్తులు, పానాలు, వారికాత నైనలాగ కాపాడుకోవలిశింది. (డుండుం.) యీలాగని రేలినవోరు సాటించమన్నారు.— (డుండుం.)

[అని నిష్క్రమించును.

పౌరులు.—[దిగులుతో] ఈసాటింపుకి గుండె నోటుక్కొ మంటున్నది బాబో!

అప్ప.—నా కేమో భయంలేదు. నా కింకా 2000 బ్రాహ్మణార్థాలున్నా యని జోస్యుడు చెప్యాడు.

పౌరులు.—వవ్వా వవ్వా! మంచి జోశ్యమయ్యా. మాకంతా సావూ, పరాసులూడమూ, తప్పదు. ఏం శేతాం బాబూ?

(అంతట కోమటి చెలువలు నీళ్ళబిందెలతో తిరిగి తిరిగి వెనుకకు చూచుచు వడివడిగా నడచుచు ప్రవేశింతురు.)

సన్నా.—ఏమమ్మా, కోమటక్క లంతా వడివడిగా గుంపుగా వొస్తున్నారు?

ఒకతె.—ఎందుకా అన్నా? సిద్దీలు అక్కడక్కడ పొంచుండి ఆడవాళ్ళకేసి తప్పుడు చేష్టాలన్నీ చేస్తున్నా రన్నా.

[అని వడిగా షరిక్రమించును.

అప్ప.—నేను వెళ్తా; నా కీరోజు బ్రాహ్మణార్థం వుంది.

[అని నిష్క్రమి.

సన్నా.—బలే తండిపోతు! నేను రేపు వుంటానో వుండనో? అందుకోసం అరు వేడవడం యెందుకు? గోపాలస్వామిగుడి నంబ్యాచార్లు నాకు చక్కరపొంగలీ దధ్యోధనమూ పెడతా నన్నాడు. వా ట్నెందుకు పోగొట్టు కోవడం?

ఒకపొరుగు.—అయన్ని తండిపో తన్నావే,మరి నువ్వేంటయ్యా?

[సన్నాని పలుకక నిష్క్రమించును.

ఒకతె.—(ఇతరలతో) అక్కోవ్ వో అక్కా. యీపరానులు సిద్దీలు వీళ్ళంతా మనరాజునింగారి యింటికి పెళ్ళిళ్ళకి వొచ్చిన చుట్టాలే గదా. వారికి చుట్టాలైతే మనకీ చుట్టాలే గదా. కడమ చుట్టాలకి వారు విందు చేస్తే, వీళ్ళకి విందు మనం చేతాం. వీళ్లు మనపేటకొస్తే; (పాటగా)

రెండవది.—వేడి వేడి నూనంటి, అక్కో వోఅక్కోవ్.

మూడవది.—వేడి వేడి నీళ్లోసి, ,, ,,

నాలుగవది.—పలసని యంబలి పెట్టి, ,, ,,

ఐదవది.—అందులోకి నంచుకోను మిరపగుం జేసి, ,, ,,

ఆఱవది.—తాగడానికి తెగబారెడు చుట్టిచ్చి, ,, ,,

ఏడవది.— తలకీ పన్నెకళ్లూ పాత్రాలూ ఇచ్చి, ,, ,,

ప్రథమ.—పెద్దనిద్ర పొమ్మాని పండుకోలేడదాం.

వారందఱు.— ,, ,,

[అని పాడుచు నిష్క్ర.

పౌరులు.— యీళ్ల గోలేంటో మనకి తెలలేదు. రండి. రాయనింగారు మనమల్ని కాళీకాలం తప్పితే, మన మెల్లి రాయనింగారిని కాయాల; మనం కత్తులతోను కటారులతోను పొడవలేక పోతే, పొడిచే వోళ్లకి కావలిశినయి అందిత్తాం, నౌకరీ చేతాం; అందుకు రాయనింగారిని అడుక్కుందాం. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము సమాప్తము.

---

# పంచమాంకము.

స్థలకము.—బుస్సీడేరా.

(హైదరు, విజయరామరాజు, బుస్సీయు యథోచితము ప్రవేశింతురు.)

బుస్సీ.—ఏమి మహారాజా? ఈరాత్రివేళ కట్టు పంచెతోను కాలి నడకతోను వచ్చినారు? హైదరుం గూడ తెచ్చినారు?

హైదరు.—ఈ ఘనము బొబ్బిలికోటమీదికి నడిస్తిమా, కోట పడతా మంట; ఈ రాత్రి తప్పితే బొబ్బిలి మనవల్ల గా దంట.

బుస్సీ.—అది యెట్లు మహారాజా?

రాజా.—డొంకలోనిపులి పొదలో చేరినది; తాండ్రపాపయ్య కోటలో లేఁడు, రాజాములో నున్నాఁడు. హర్కారాలచే రంగారాయఁడు అతనికిఁ బంపిన జాబు ఇదిగో. ఎటయినను మనరాక ఈగడియకో పైగడియకో అతనికి తెలియక మానదు; తెలిసినంత నే అతఁడు రాక మానఁడు; వచ్చినంత నే మనల నందఱను రూపుమాపక మానఁడు.

బుస్సీ—[అప్రియముగాఁ జూచుచు] ఇసీ! ఆ హర్కారా లిట నున్నారా? వారివలన నింక నే మయినం దెలిసికొందము.

రాజా.—ఆహర్కారాలు ఇరువురు బికారివేసముల బిచ్చమెత్తుకొనుచు 11 పహరాలు దాఁటినారు. 12 డవ పహరాలో మీరాసాహెబు వారిని అడ్డగించి, సోదా చూచి, వారి గోధుమరొట్టెలను విఱువ నుండఁగా, వారు ఆరొట్టెలను పెఱుకుకొన యత్నించి, వాని చేతినుండి తీసికోలేక, ఆజాలుముచేత లేచిన మన సిపాయీలమీద, తమ కాసెకోకలలో దాఁచుకొనియున్న బాకుమాత్రముతో కలియఁబడి, సాయుధులను నూర్గురను పొడిచి, తాము పొడుచుకొని చచ్చినారు. మీరాసాహెబు నాకు ఆ రొట్టెలలోని యీజాబులను తెచ్చి యిచ్చినాఁడు.

బుస్సీ.—[ముక్కుపై వ్రేలిడుకొని] ఆహా! ఈబొబ్బిలిలో హర్కారాలే ఇంత పని చేసినారు! బంట్లు దొరలు ఏమి చేయుదురో! అయ్యో, ఇపుడు అంధకారము; తెల్లవాణ్ణి నిండు. హర్కారాలు దొరకిరిగదా? ఇంక తాండ్ర పాపయ్యకు కబురు అందు ననుభయము లేదు గదా?

రాజా.—అయ్యయ్యో! దొరగారూ! ఏమి యిట్టు సెల విచ్చెదరు! ఇట్టి హర్కారాల నెందఱ నెన్ని దిక్కులకు వారు పంపినారో? ఎందఱు తప్పించుకొని పోయియుందురో? అంధకారమునకు 12000 మన్నె ఫౌజు చేతను ఇలాయీలు వేయించి పట్టపగలు గావించెద. ఎట్లును మీవలన నిపుడు కాదందురేని, నాకు సెలవిండు; నేను నాయూరి కేఁగి మీపేరు చెప్పుకొని బ్రతికి యుండెద.

హైదరు.—సర్దార్, రాజు భారి అంతాపనిచేసినారు! ఈహర్కారాలు ఇంతా పని చేసినారు. ఇంకా జోగులు దొర ఏమి చేస్తారో! కన్క మన షితేహితులు చెప్పేలాగ వారిని ఏమటుపాటుగా కొట్టడం వరీ పని నాకీ తోస్తుంది.

బుస్సీ.—ఎవరురా అక్కడ?

ద్వారపాలుఁడు.—[ప్రవేశించి] ఏమి సర్కార్ అజ్ఞ?

బుస్సీ.—పోయి తుఁబములో సర్దార్ల నందఱను తోడ్కొనిరా?

ద్వా.—చిత్తము సర్దార్. [అని నిష్క్రమించును.

(నేపథ్యమున కాహళము ఊఁదుదురు)

బుస్సీ.—ఏమి తంట తెచ్చెదరు రాజా మీరు?

రాజా.—తంట తీర్చుపని నేను తెచ్చినది.

[సర్దారులు ప్రవేశింతురు.]

బుస్సీ.—కూర్చుండుఁడు. [అందఱు కూర్చుందురు.

బుస్సీ.—ఇప్పుడు మీరు బొబ్బిలిమీఁదికి నడువవలయును.

సర్దా.—ఏమి సర్కార్! ఇలాగ హుకుం చేసారు! ఈ చీకటిలో ఈ నిద్రమబ్బులో యలాగ నడుస్తాం?

హైదరు.—మామూల్ లేనిమాట వచ్చిందేమి మీనోటికి మన్కీ చదుర్ను ధిక్కరించిన పోగరుబోతులకి మన్మా ఏమఱుపాటమే కొట్టవాలా లేదూ!

రాజా.—నా 12,000 మన్ని సేవచేత, ఇలాయీలు, కాగడాలు, మతాబులు వేయించి మీకు పట్టపగలు చేసెదను.

హైదర్.—శబాశ్! అదీ సరి! బలే మహరాజ్.

ముసేపనాల్.—[గాయము చూపుచు] అరాయభారిది వఖ్పోటు ఇద్దో సర్కార్; నేను నడుజ్దాను బొబ్బిలిమీదికి. తెల్లవారేలోపల, వాడ్కీ వారివార్లకీ నేను కర్కర్కర్ కొయ్యవాలా వుంది. బొబ్బిలిజెండా తెగ్గొట్టి, మనజెండా ఎత్తకుంటే నాపేరు ముసేపనాల్ గాదు: నాకీ ఫిరంగివాత వెయ్యండి. నేను బొబ్బిలికొడితే నాకి యేమీ యిస్తార్.

బుస్సీ.—6000 వరహాలు ఇప్పించెదను.

మూసే.—6000 వరహాలు నాకీ వద్దు. నేను బోనగిరి కొట్టినాక్, కల్లికోట కొట్టినాక్. ఇట్వంటి బీసాదికితానికి నేను కోటలు తియ్యలేదు. బొబ్బిలి ఏడుగడియలు దోపు ఇయ్యవాలా, ఇస్తే బొబ్బిలి కూలుజ్దాక్.

రాజా.—బళీ! బళీ! సర్కారునకు వరహాలు లాభము. ఇది మఱియు మంచిదే.

బుస్సీ. హైదరు.—అలాగే కానీ.

మూసే.—మఱి నాపని చూజ్దాక్. సలాం, సలాం.

[అని నిష్క్రమించును.

సర్దార్లందఱు.—సలాం; సలాం. [నిష్క్రమింతురు.

బుస్సీ.—లాల్ఖాక్, మఱి, ఏతత్కాని కొత్తఃము వను స్వవృత్తాంతము మాకు చూచి వచ్చి స్పష్టముగా చెప్పుటకు సమర్థు లగువారిని అయిదాగ్గురను నియమించవలయును.

లాల్.—చిత్తం. సలాం. [నిష్క్రమించును.

రాజు.—నేను వేషము మార్చుకొనెదను. నా సేన తీర్పాటుచేసెదను.

బుస్సీ.—ఈ రాత్రి మమ్ము చంపుటకు వచ్చితివి రాజా నీవు.

రాజు.—సలాము. [అని నిష్క్రమించును.

(నేపథ్యమున వెలుతురు.)

బూసీ.—ఆహా ; ఎంత వెల్తురు !

హైదరు.—ధనంలో తీయించినాడు మషాల్ రాజా;

[నేపథ్యమున బాకా భేరి, డంక, నగారా, నౌబత్తు.]

ప్రథమ నివేదకుడు.—[ప్రవేశించి] సలాం, సలాం. మునేపసాల్ కాలు చెప్పినారు. అయా సర్దార్లకింద 12,000 సిపాయీలు, 6000 పరంగులు, 6000 ఇంగిలీసులు, 13000 చట్కాట్లు, 6000 వలంగులు, 3000 బుడతకీసులు. 4000 గోసంగులు, నడుము గట్టినారు. వీరుగాక హిందూ తురక సిపాయీలకు లెక్క లేదు. కోట మీదికి నడస్తున్నారు.

బుస్సీ.—మంచిది, [నివేదకుడు నిష్క్రమించును.

ద్వితీయ నివేదకుడు—[ప్రవేశించి] సలాం, సలాం, మందుకోట్లకి శెల్వు అయింది. తోటాలు గిటాలు, పంచి పెడ్తావున్నారు.

బుస్సీ.—మంచిది. [ద్వి. నిష్క్రమించును.

(నేపథ్యమున)

[ఓనోరి, ఆహో బిళాన్ని, భూతసాధుణ్ణి, పెద్దగుండ్లతో మట్టి కోట మీదికి మోర్జా చెయ్యండి. రామసింగును, లత్మణసింగును, భేతాళున్ని, అనుమంతుణ్ణి, చిల్లపెంకులు, చిట్టెపురాళ్లు, మంగలకత్తులు, డబ్బుల తిత్తులు, ఏగానులు, గులకరాళ్లు గట్టించి వెలమలమీదికి మోర్జాచెయ్యండి. జంట ఫిరంగులు, జబరజంగులు, బోకుమారులు, ఓటుఫిరంగులు, మగర దిండ్లు, అన్నీ తయ్యారు చెయ్యండి. కంచుఫిరంగులు గట్టించండి. చెకుముకి

బారులు, 13000 తయ్యారు చెయ్యండి, 6000 జజ్జాయిబారులు, అనుపు దిద్దండి.]

ప్ర.—[ప్రవే.] విజయరామరాజాగారు యుద్ధం చూడడానికి ఏనుగ మీదికి దివాన్ హైదర్జంగుగారిని పిలుస్తున్నారు.

బుస్సీ.—పోవోయి; పోయి, తమాషా జూచిరా.

[హైదరు నిష్క్రమించును.

ప్ర.—సర్కార్, తమ పటాలం వారందఱు తిరగబాటు చేస్తున్నారు.

బుస్సీ.—ఆశ్చర్యము! ముందు నడత కలసినవారే!

ప్ర.—కైపు లేనిదే వారు ఏమీ చెయ్యలేరంట.

బుస్సీ.—అవును. మామాటగా బొడ్కిన్‌తో వారికి సారాయి మామూలుకొలత ప్రకారము ఇమ్మని చెప్పాము. [ప్ర. నిష్క్రమించును.

ద్వి.—[ప్రవేశించి] సర్కార్! తమ పోల్జర్లు సారాయి తాగి కఫరు తప్పి ఒకరిమీదికి ఒకరు గనీలు దూసుకొంటున్నారు. ఇఖ తుపాముఖునా ఆలశ్యంచెయ్యడం సరి గాదు. గుండు పారించడానికి ముసేఫనాల్ మూడ్లో సెలవు అడ్గుతారు. ఆకాశమంత కొఁగడాల పట్టపగల్ అయివుంది.

బుస్సీ.—వారిగుండు ముందు మిగిలిన బాగుగ నుండును. [గడియారము చూచుకొని] 12 గంట లయినవి.

(నేపథ్యమున ఫిరంగి మ్రోఁత.)

బుస్సీ.—[దద్దిరిల్లి శ్రవణ మభినయించి, కోపముతో] ఎవరురా మా కడపటి సెలవు లేకయే ఫిరంగియు గాదు చేయించినాఁడు?

ద్వి.—కోటలో జాముఫిరంగీ వేశివుంటారు సర్కార్.

(అంతట హైదరు రాజును తత్క్షణమునం బ్రవేశింతురు.)

రాజా.—[స్వగతము] ఈ ఫిరంగిచేత నాపని సాధించెదను [ప్రకాశము] ఏమి దొరగారూ! ఇఁక నేమున్నది? వచ్చి పడ్డారు మనమీఁదికి బొబ్బిలివారు. ఫిరంగులు. మోర్జా చేసి కొట్టుచున్నారే!

బుస్సీ.—అది వాంఛిరంగి యని నిశ్చయమా?

రాజా.—ఇంకను సందేహమా? ఎగుట నున్న, మమ్ము గుఱి పెట్టుదురని మేము పరారి చేసి వచ్చినారము.

బుస్సీ.—ఓయి సిపాయి, ఇదే నా కడపటి యాజ్ఞ.

[ద్వి. నిష్క్రమించును.

[నేపథ్యమున— కోలాహలము.

ఫిరంగి ప్రముఖాగ్నేయాస్త్ర ధ్వనులు.—

మార్! మార్! ఫైర్! ఫైర్!

ప్ర.—[ప్రవేశించి] మనఫిరంగీలు పేలినవి. కోటబురుజు లంతట మనుష్యులని పేలింది, సిబ్బందీలని పేలింది. మనవాళ్లు అన్ని పక్కలా ఒక్క మాటే కోట కూల్చడానికి ఫిరంగీలు కాలుస్తున్నారు.

[అని నిష్క్రమించును.

ద్వి.—[ప్రవేశించి] సలాం సర్కార్, ధర్మారావుకీముందు మిగిలి ఆడంగులు లడాయి చేస్తున్నారు. బకాల్ బీబీలు సర్కార్! అళ్లు కొప్పులు విప్పి వెనకసిగలు దట్టంగా వేసి, పైటచెంగు నడుంకట్టు కట్టి, రాళ్లు రప్పలు వళ్లో కట్టుకొని, రోకళ్లుతీసుకొని, వేరివారి స్త్రీలు కలపటమైనారు. రాళ్లు మనరాణువమీదికి గిరవాట్లు యేస్తారు. ఒడిశాలలతో కొడుతున్నారు. దగ్గిరికి యెల్లిన షోల్జర్లని మండీ యేసుకొని రోకళ్లతో పండబెడుతున్నారు. ఆళ్లమీదికి యెల్లినాడే సిద్దిబిలాల్ ఆడూమర్గయా. సగముమంది సర్దార్లు బకాలుపేటమీదికి ఉడాయించినారు. కడ్డ అందఱు బురుజాలకాడ, కింద లడాయిమాని, ఈళ్లలడాయి తమాషా చూస్తావున్నారు. కోట మీద ఆళ్లకి దీపాలులేవు. మనరాజాదీపాలు ఆళ్లకీ వెన్నెల వుంది. దానిచేత అళ్లు మనసర్దార్లకీ గురీ పెడతారు. వఖ్ గురికి టకీసుల్తాన్ మర్గయా. మనగురికి ఆళ్లు కొంచెంకొంచెం అందుతారు; ఎక్వా అందడం లేదు. సలాం.

[అని నిష్క్రమించును.

బుస్సీ.—స్త్రీలు యుద్ధము చేయుటా! సిద్దిబిలాల్ వారిచేత చచ్చుటా? కోమటిస్త్రీలా! టకీసుల్తాను దొరినాఁడూ! మేము ఎక్కడను ఇట్టిది రొంయుఁగము! ఏమి యీగడ్డ బీరము?

రాజా.—ఏమి! నేను ముందే చెప్పలేదా? నన్ను బట్రాజంటిరే మరి?

బుస్సీ.—ఏమయ్యా రాజా? మాకు స్త్రీలతో లడాయి చేయిందవు నీవు?

రాజా.—[సమందహాసము] ఓడిపోదు మని భయమా?

బుస్సీ.—బలే జిత్తులమారివిగా నున్నావయ్యా? ఆఁడువారితో జగడము అవమానము కాదా?

రాజా.—[సమందహాసము] గెలిచిన మానమే.

బుస్సీ.—నీవు మానిసివి గావోయి?

రాజా.—ఏ మన్నను సరియే.

హైదరు.—సాహెబు, నాకీ శెల్వు ఇయ్యండి, నేను ఆ తమాషా చూచి వొస్తాణ.

బుస్సీ.—చూచి వచ్చి మాకు చెప్పుము. [హైదరు నిష్క్రమించును.

బుస్సీ.—[రాజా నుద్దేశించి] ఏమి రాజా యీ స్త్రీలు ఇజార్లు అంగీలు తొడిగి డాలు తర్వారు పూని పోరుదురా?

తృతీయ నివేదకుఁడు.—[ప్రవే.] సలాం సర్కార్, బకా ల్బీబీలు, వజ్రాల్ కెంపుల్ బంగారు జవాహరీ యేస్కాని, కాశ్మీర్ బనారస్ చీరల్ ము స్సీబుతో జగ్గిగా మెరుస్తా కోటబురుజుమీద కంటికి చూపడగానే, వారికి పహారీలు తల్బుకొని మన తుర్కి సిపాయీలు వకరికి వకరు యెనక్కి మోచేతి పోట్లతో నెట్టుకొని తోసుకొని లగ్గలెక్తా వున్నారు. ఎడ్డం దొందరలో సగం మంది కింద ఖందకం వుందీ లేదూ, అందులో పడ్డారు. తతిమ్మాసగం...[అను నర్ధోక్తిలో]

బుస్సీ.—స్త్రీలు త్రోయఁగా క్రింద పడి చచ్చినారు, ఇంతే గదా?

తృ.—బస్ సర్కార్. [అని నిష్క్రమించును.

బుస్సీ.—మనమును చూతము వచ్చెదరా మహారాజా?

రాజు.—నాకు క్రొత్త గాదు. మీరే చూడుఁడు.

ద్వి.—[ప్రవే.]సర్కార్ సలాం, బకాల్చిబీలు లగ్గలు యెక్కొని ఆసిపాయీల మీద తెర్లుతావున్న నూనె ఉడుకుడుకు నీళ్లు, కాగుతావున్న అంబళ్లు పోసి 1000టికి, కళ్లల్లో మిరపగుండ గంపల్ గంపల్ గా కుమ్మరించి 15000టికి, కూల్చిన్యార్. తప్పించుకొని ఎక్కి కలియబడినవాళ్లని కోటీలో కోకళ్లతో గుమ్మి పడదోసిన్యారు. సన్నెకళ్లు రోళ్లు, కేనీ ఎంద రినో, తల్కాయలు పగల్గొట్టిన్యారు. [నిష్క్రమించును.

[బుస్సీ ముక్కుపై వ్రేలుంచుకొనును.

చతుర్థనివేదకుఁడు.—[ప్రవే.] సర్కార్, మనివాడు చంద్రోలు మహాత్ముగు అబీబీలతో కలియబడి మిరపగుండ మాగెష్టు కన్ను నిండి కబోదిర్యై కోకటిదబ్బకి ఖందకంలోపడి సచ్చిపోయినాడు. [నిష్క్రమించును.

బుస్సీ.—జిహోవా! జిహోవా! మేము పోరిన మే మేమగుదుమో!

[హైదరు రక్తవస్త్రములతో అంబటి తలతో ప్రవేశించును.]

బుస్సీ.—ఆఁ! ఎవరు నీవు?

హైదరు.—క్యా సాబ్, నేను హైదర్జంగు కాదూ? నాకే తెల్వదూ మీకీ?

రాజు.—ఏమి సాహేబ్? మీరు పోరితిరా ఏమి? మీ యొడలంతయూ ఈ నెత్తురేమి?

హైదరు.—మేము పోరలేదు రాజాభాయి. బకాల్చిబీలపోరు సూడడానికి వెళ్లి సిపాయీల నడ్మ మే వున్న్యాం. బీబీలగోకళ్లకి వాళ్ల తల్కాయల్ పగిలి నామీద కురిశిన నెత్తుర్వ్యానాకే నావొల్లంతా యట్లా అయింది. మటి వఖ్టే, ఈపగిడీ ఈగర్మీచా ఈబాడీ లేకపోతే, నా ముఖం వుడ్కి పోయి

వుంటుంది. ఆపిసాసీలు అంబల్కి పోనీనారయ్యా! నా మొఖంమీద! ఆఖీ మీద! చూడడానికీ పోతే సావడానికి అయింది! ఈళ్ల మొగవాళ్లు చేరాలకీ పోయినారంట; ఈళ్లు మనవాళ్లకి దంచుతావున్నారంటూ అక్డాఅక్డా ఒకడు రెండు బీబీలు సస్తా వున్నారు సాబ్. నాకీ నోటీ తెరిస్తే అంబలి నాల్కాకీ లక్కాలాగా వస్తుంది; నాల్కా కాల్తుంది; అంటుకుంటుంది; వదల్దు. తమాషా చెప్పడానికి వచ్చినాణ్; కడుక్కోండాంకి లోపల్కిపోతాణ్.

[నిష్క్రి.

ద్వి.—[ప్రవేశించి] సిద్దీమక్కాలు, బకాలుబురుజు పట్టినాడు. బకాలుపేట అంతా దోపుడు అయింది. బీబీలు మాయమైనారు.

[నిష్క్రమించును.

బూసీ.—మఱి మన మేల పోవుట ?

ప్ర.—[ప్రవే.] సలాం సర్కార్. బొందిలిగూడెం, మన్నెగూడెం మాడిపోయినవి. సాపుగా దోచినారు. కాపుగూడెం మీదికి దౌడుతీస్తినారు.

[నిష్క్రమించును.

చ.—[ప్రవేశించి] సర్కార్ సలాం. కాపుపేటలో షుకురుల్లా పోరుతాడు. కాపులు నాగేళ్లు, కాళ్లు, కఱ్ఱలు, గండగొడ్డళ్లు, కొడవళ్లు, గునపాలు, పాఱలు వీటితో కొడ్తారు. 'అదే యిది బలరాముడి దెబ్బ చూడరా' అని కాపువాడు నాగేటితో కొట్టాడు. మనవాళ్లు 300 మంగులు డింక కొడ్తారు.

[అని నిష్క్రి.

[హైదరు అంబలి కడిగికొని ప్రవేశించును.

తృ.—[ప్రవే.] సర్కార్, వకనాగేలు కఱ్ఱ మొన షుకురుల్లా సాహెబుకీ పుఱ్ఱెలో దూరి ఆఖీ మొ బైటికివచ్చింది. ఇంకొకడు గడ్డపాఱతో తల్కాయ రొమ్మాకీ కొడితే కాపువాడు నాగేలు లాక్కొన్నాడు. షుకురుల్లా తన్నుకొని గింజుకొని పీనులలో కలిసిపోయి నిద్రపోతా వున్నాడు.

[నిష్క్రమించును.

చ.—[ప్రవే. హైదరల్లీ నుద్దేశించి] సర్దార్ సాహెబ్, ఖిల్లా! పడి యెడమ అన్నిపైపుల అగాడి పిచాడి లడాయి అయితుంది. తఫ్ సర్దార్ తఖసర్దార్కు ఖుమ్మక్కు చెయ్యడానిక్కి లేదు. తమరు వస్తే కాపుపేట అయినా పడిపోతుంది, అని అనమరల్లి సాహెబు చెప్తారు.

హైదరు.—నేను యేలడాయికి అయినా వజ్జానుగాని కబ్బుఖుకురుల్లా నాగేటి లడాయికి మాత్రం రాను. [చ. నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి రాజా? మమ్ముల నందఱను ఇక్కడ గుండానవైచుటకు తెచ్చినారా?

రాజు.—నేను ముందే చెప్పలేదా? నన్ను బొబ్బిలివారి బట్రాజంటిరే!

చ.—[ప్రవే.] సర్కార్, మర్గయా అనమరల్లి ఖాన్; మర్గయా సర్కార్; అనమరల్లిఖాన్; మర్గయా; [అని నిష్క్రమించును.

ద్వి—[ప్రవే.] సర్కార్, షేపేఖాన్ తెగినాడు. మనివాళ్లు ఇప్పుడు కాపుపేటమీద వున్నారు. కాపుపేట వాళ్లకీ కిందా వుంది. [అని నిష్క్రమించును.

తృ.—[ప్రవేశించి] మన హార్కారా వుంట్లే ఖూఖూభాయి, ఆడు దారిలో బాణం తగిలి మర్గయా. నేం ఇంకా మర్గయా లేదు. [అని పోనుంకించును.

దౌవారికుఁడు.—అగ హార్కారా జవాన్, నీవు ఇంకా మర్గయా లేదూ అన్నావే. నీవు కూడా మర్గయా అయినావు వోయి; లేకోపోతే రెండుకీ తెచ్చినావువోయి అఖూఖూ గాడిది సమాచారమ్?

తృ—అరే మేము ఇంకా మర్గయా లేదూ అంటే!

దౌవా.—ఉందీ అంటే!

తృ.—అరె లేదురా అంటే!

దౌవా.—అరే ఉందీరా అంటే.

తృ.—నీకి ఇప్పుడు మర్గయా చేస్తాన్. [అని కత్తి దూయును.

దొవా.—ఎగ్తాలీకి చెప్పినాక భాయి.

తృ.—నీకి యెగ్తాలీ వుంది, మాకీ సావు వుంది.

దొవా.—అదే నేను చెప్పినమాట. పోభాయి పో. [తృ. నిష్క్రమించును.]

చ.—[ప్రవేశించి] సర్కార్ సలాం, పెద్దబురుజు వుందీ లేదు, దాన్కి బేతాళం సామ్ చెప్తారు. ఆబేతాళబురుజుమీద్కి మన్వాళ్లు నిచ్చెనలు వేసియెక్తారు; ఎక్కినంత మంది ఖందకం వుందీ లేదు కిందా; అందులో పడ్తారు. ఘూరాన్కి చీమల్బారు కన్పడ్తుంది. బారు ఎక్కుతుంది, నిచ్చెన జాడించినారు లాగ బారు పడిపోతుంది. ఎల్లుబంటిబారు ఎక్తుంది, కోతుల్బారు పడ్తుంది. [అని నిష్క్రమించును.

[తృ. మిక్కిలి రోజుచు మహాసంభ్రమముతో ప్రవేశించును.

బూసీ. — ఏమిరా యీయుడావిడి?

తృ —సాబ్! ఏమిచెప్పడం; పెద్దఫిరంగిగుండు నాకీ భాఅని తర్మ కొనివచ్చింది, బురుజుమీదానుంచీ. నేను దాన్కికంటే ముందు రావాల కోసం బలేపర్గుమేవచ్చినాక, దాన్కి చేత గాభరా అయింది.

బుస్సీ.—[హైదరుతోను రాజుతోను జనాంతికము] వీఁడు తెచ్చు వృత్తాంతమంతయు ఇట్టిదిగానె యుండునా? [ప్రకాశము] ఏమిరా ఒడలు తెలిసి మాటలాడుచున్నావా?

తృ.—పోయి మూడండి సాబ్, ఇంకా అది యెన్క దిగబడే వస్తా వుంటుంది. ఇప్పట్కి మీకీ తగుల్తుంది.

బుస్సీ.—పోరా మూర్ఖా.

తృ.—సాహెబ్, ఎన్ని ఫిరంగులు కొట్టినా గోడ దెబ్బకీ దెబ్బకీ వఖుతులం పెల్ల రాల్తుంది. గోడ పగల్దు, బొక్కపడదు. గుండు గుండు అక్కడ అక్కడ గుచ్చుకొని గాండాముఋగం తోలు మచ్చాల్ లేదూ, అదీలాగా వుంటుంది. దగ్గ వెల్లడానికి పాచినీళ్లు, ఖంపు, అద్పు, బురద, పూబి, ఖందకం. దాన్కిమీద బంతేన కట్టి, ఖిల్లాకి బొక్కా చెయ్యడానికి

పోతే,ఉప్పర్నుంచి,చాటుచాటు మే వుండి ఖాఫస్లబడాబడా రాయిబండల్ దొర్లుతారు. మనివాళ్లు తుపాకులు లక్ష పేల్చినా, చాటు మే వుంటే ఖాపర్కు తగల్దు. ఖఖ్వాఖ్ ఖాఫుర్ హాగ్పడ్తాడు; వాడ్కి దూరం గుండు తగుల్తాదూ లేదు; వాడు పడ్తాడూ లేదు. ఆఖాఫుర్ గాడ్ది బాణం కిందికి భుర్రుభుర్రు భుర్రుభుర్రు వస్తుంది. ఖఖాన్కి ఖఖాన్కి ఖఖు ఖఖు మన దాడీవాలా మర్గయా. చీకటి చేసి, వంతెన వేశి బొక్కా కర్తాహే. బలే దళ్ సరివుంది. బొక్కా అవతల్కి పోదు 'కోట పట్టలేము, ఖుమ్మక్కు కావాలా.' చెప్తారు ముసేటకితాణ సాహేబు.

బుస్సీ.—లగ్గలెక్కు వారికి ఖుమ్మక్కు చేయుమను.

తృ.—బస్. [అని నిష్క్రమించును.

బుస్సీ.—హైదర్సాబ్. రాతికోటకంటె, ఇటికకోటకంటె మట్టికోట పడగొట్టుట కష్టముగా నున్నది!

హైదరు.—ఇప్పుడు తెలుస్తావుంది.

చ.—[ప్రవేశించి] సర్కార్ సలామ్, బేతాళ్ బురుజు మే ఎవిరి రాణ్వా కిటకిటవుంది. వాళ్ల సామికి రథం పుచ్చం లేదూ? ఆద్మీ ఆద్మీ నిండి ఆరథం వుంది బురుజు. అక్కడ ముత్యాలపాపయ్యంట వాళ్లకి సర్దార్. వాడు సింహం వున్నాడు సర్దార్. వాళ్లది పట్టాకత్తులు మనదీపా ల్మతా బులో తళ్ళళా తళ్ళళా తళళళా మెర్గుతుంది, అది తళ్ళళా మన కన్నుకీ గుచ్చుకొంటుంది, మనకీ కబోదీ చేస్తుంది. నచ్ఛత్రం అంతాఖఖ్ జాగామే చేరితే ఏమివుంది అదీ వుంది బురుజుమీద. [నిష్క్రమించును.

ప్ర.—[ప్రవేశించి] మువ్వాళ్లు బేతాళ్ బురుజు ఎక్కినార్. వాళ్లకి వాళ్లకి లగాలగి మరామరి. [నిష్క్రమించును.

బుస్సీ.—ఇక పర్వా లేదు. బొక్క పడక పోయినను, మనవీరులు లోపల ప్రవేశించి సర్వసంహారము చేయుదురు.

తృ.—[ప్రవే] ముత్యాల్ పాపయ్యా పట్టాకత్తి మన చంద్రోలు మహమ్మదుకే కూడా లేదు. ఆ పాపయ్యచేతులో మన దూదూఖా న్సర్గయా; దేదేఖాన్ గయా; దాడీఖాన్ గయా; జానాజాబాయి, గుగ్గుమియా, లడ్డూసాబు, బర్ఫీసుల్తాన్, పేపేపైల్మాన్, అందఱు సఫాయి.

.నిష్క్రమించును.

బుస్సీ.—ఎంత సాదనాలు చేసినవారయ్యా యీబొబ్బిలి బంట్లు!

చ.—[ప్రవే] ముసేఫనాల్ హాతీకి దిగి, లగ్గాకీ యెక్కి, పాపయ్యాతో కలపటమైనాడు. ఆళ్లకి యిద్దఱికి తడాఖా, అందఱు లడాయి మాని చూస్తారు. ఇద్దఱున్నూ అంతర్వట్టీ, దొంతర్వట్టీ, నాగ్లేసి పాకాశ పట్టీ లేశి, పార్వపిట్టల్లాగ, ఆణ్ని దాటి ఈడు, ఈణ్ని దాటి ఆడు, పోతాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఎంతసేపు? ముసేఫనాల్ ఆలస్యం చేయఁడే;

ప్ర.—[ప్రవే. హర్షముతో] సర్కార్ సలామ్, ముసేఫనాల్ తన పేరు చెప్పి ముత్యాలపాపయ్యని పేగులు వెళ్లబొడిచినాడు. వాడు నారాయణ నారాయణ అంటూ నేలకొరిగినాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—బలీ! బలీ! ముసేఫనాల్!

తృ.—[ప్రవే. హర్షముతో] సర్కార్, ముసేఫనాల్ వాళ్లజెండా తీసి, మనజెండా వేశినాడు. వాళ్ల నౌబత్తు తోసి మననౌబత్తు మోగిస్తా వున్నాడు. [అని నిష్క్రమించును.

చ.—[ప్రవే.] అరే! రే! రే! దొంగదారిని వచ్చినాడు రంగారాయడు ఆ బురుజుమీదికి! పట్టాకత్తితో ఊడుస్తాడు బురుజంతా. ఆయన్కి కోసం బలేకొంగడాలు వేశినారు. 'బొబ్బిలియేటు చూడు, యెలమపోటు చూడు, రంగారాయడి రణరంగము చూడు.' అంటా యేస్తాడు. అంతా తిరువణ్ణామలె దీపోచ్చం అయింది. ఆయన షైమూం

వున్నాడు సర్కార్! తుపాకీ వున్నాడు! ఇక్కడవున్నాడు! అక్కడవున్నాడు! ఇక్కడ లేడు! అక్కడ లేడు! అక్కడా యిక్కడా కూడా వున్నాడు! మళ్లీ ఇందర్జాలం వున్నాడు, మళ్లీ కంటికి కాన్పడ్తాడు, కంటికి కాన్పడడు. అయ్నా ఎక్కడ కన్పడ్తే అక్కడ ఈరాజాగారి దం డంతా శరణు చెప్పేవాడు, దండం పెట్టేవాడు, దద్దిరిల్లి కందకంలో పడేవాడు. ఆయన సొంతచేతితో కత్తితో నరుకుతాడు; గాలి నలుగు తాడులాగ నరుకుతాడు. మంచి మంచి సిపాయి ఆయన్ని కొట్టడానికి పోతాడు, సలాం చేస్తాడు. ఆ ఘూర్జాన్ అద్మీ అద్మీకి గొంతు కోసి తల్లకిందు చేసి, నెత్తురువానలు కురిపిస్తాడు. నిలుపు మొండ్యాలు ఆయన్ని చుట్టు బౌతుఖానాలు. అవే నెత్తురు చిచ్చుబుడ్లు ఆయన్ని చుట్టు. [అని నిష్క్రమించును.

హైదరు—సర్దార్, నేను మళ్లీ యెల్లి చూసి వొస్తాన్.

[అని నిష్క్ర.

బుస్సీ—ఎంతసేపు ఆడఁగలఁడు ఈదొమ్మరియాట ?

తృ.—[ప్రవే.] సర్దార్, రంగారావు ముసేఫనాల్ని ఐదుకీ ఆఱుకీ వఖ్ గుదిగా ఈ పెపోటుచేసి కందకంలో కూల్చినాడు. అతని ఎడమ్కాలి తన్నుతో మనధంకా ఆకాసానికి పోయింది. మనఫౌజుకేమో ఎవడి తల్కాయమే పడింది. అతని జెండా ఎగురుతుంది. ఇప్డు అద్దో ఆమోగేది ఆయన్ది నగారా. [నిష్క్రమించును.

బుస్సీ.—బళీ; బళీ; మహావీరుఁడు! మహావీరుడు! ఆయనతో మనకు యుద్ధము కంటె సఖ్యమయిన బాగుగా నుండును.

ప్ర.—[ప్రవే.] మనిసర్దార్లు పదితూర్లు తెల్లజెండా యెత్తితే 'మీ కేమిరా ఆడ పిల్లలా?' అంటూ, అతనిబంట్లు యెఱ్ఱజెండా లెత్తినారు.

[నిష్క్రమించును.

బుస్సీ.—హా! హా! బలారే!

ద్వి.—[ప్రవే.] మళ్లీ వేతాళం బురుజు మీదికి నడిస్తే, ఎవరు పోవడం లేదని తిరుగుబాటు చేస్తారు.

బుస్సీ.—హైదరుజంగును నడుపు మను. [ద్వి. నిష్క్రమించును.

[హైదరుజంగు చినిగిన నగారా కుండ నెత్తికి తగులొ్కని యుండ రక్తవస్త్రములతో ప్రవేశించును.]

బుస్సీ.—ఎవరవోయి నీవు, ఇట్లు పెద్ద జోకర్ వచ్చినట్లు వచ్చుచున్నావు?

హైదరు.—ఏం సర్దార్, నాకీ తెల్వదూ మీకి? మన నగారాకుండ రంగారావు ఎద్దాకాలితో తన్నితే, ఎగిరి వచ్చి నాతల్కాయమీద పడి, చిన్గి గుచ్చుకొని వుంది. తల్కాయ లాకొ్కవడానికి రాకుండ వుంది.

[నౌకరులు హైదరుతలనుండి కత్తితో తోలుం గోసి కుండం దివియుదురు.

బుస్సీ.—ఆశ్చర్యము! అది నీతలకాయమీఁద నే పడవలయునా!

ప్ర.—[ప్రవే.] సర్దార్. రాజా తమ్ముడు వెంకట్రావు కోటపైటికి, 500 బంటు 150 గుఱ్ఱంతో తరలినాడు, కొండబోటుమీదుగా మన డేరాలమీదికే వస్తావున్నాడు.

బుస్సీ.—దారిలో మన గుఱ్ఱపు దండు వున్నది. పర్వా లేదు.

[ప్ర. నిష్క్రమించును.

చ.—[ప్రవే.] సర్దార్, వెంకట్రావుకి మనగుఱ్ఱం ఎదురొ్కన్నది. 2000 గుఱ్ఱం సఫాయి. ఆయన్కి, 100 గుఱ్ఱం, 150 మంది సిబ్బంది మర్గయా. ఆయన ఫిరంగిగుండు వస్తుంది లాగా కొండబోటు మీదుగా వస్తున్నాడు.

బుస్సీ.—పర్వా లేదు, అక్కడ నున్నది ఫిరంగీల యనుపు.

[చ. నిష్క్రమించును.

బుస్సీ.—[స్వగతము] ఏమి యాశ్చర్యము! ఇంత గుఱ్ఱపుదండు వాళమైనందులకు నైజాముగారికి ఏమి చెప్పగలము?

ద్వి.—[ప్రవే.] సర్కార్, వెంగళ్రావు 50 గుఱ్ఱాలు 350 కాల్బలంతో కొండబోటు మీద్కి రాగానే, వారిమీద్కి ఫైర్ ఫైర్, ఫైర్ ఫైర్, మోగినయి మన జజాయీల బార్లు. ధామ ధామని అగాదయినయి మన ఫిరంగీల బార్లు. 50 గుఱ్ఱాలు సఫాయి! 150 మందితో మొదట మీకాడికి రాయబారం వచ్చినాడే దర్మారావు ఆయన కూలి పోయిన్యాడు.

బుస్సీ.—అది చాల మంచిది మనకు. [ద్వి. నిష్క్రమించును.

[బుస్సీ డేరాపై గుండ్లు పడును.

బుస్సీ.—అరే! ఇదేమి మా డేరా మీదికి ఫిరంగిగుండ్లు? ఎవరు కాల్చినవి? అపాయముగా నున్నదే!

ఒకకింకరుఁడు.—[ప్రవేశించి విజయరామరాజు నుద్దేశించి] దండం మహాప్రభో! ఏలినవారి డేరామీద ఫిరంగిగుండ్లు పడుతున్నయి. డేరా కాలిపోతా వుంది. పదిమందికి గాయాలైనయి.

రాజు.—[స్వగతము] ఇవి ఎట్లు వచ్చినవి మా డేరామీదికి? వారికి ఫిరంగులు లేవే? [ప్రకాశము] పోయి అరుసుఁడు. [కింకరుఁడు నిష్క్ర.

ప్ర.—సర్కార్, వెంగళ్రావు అగాదు మీఁదుగానే ఫిరంగీలపై పడినాడు. మనఫిరంగిబార్లకి వెనక తిరిగి వచ్చి పటాలరాముడు వాటిమీద దుమికినాడు. ఇద్దఱు వెయ్యిమంది జనాన్కి ఫిరంగి బారులవాళ్లకీ అందఱికీ పొడిచి, నఱికి, చంపి, ఆఫిరంగులే అడవికి పారిపోయి మళ్లీ వస్తావున్న మనఫౌజుమీదికి తిప్పి కాల్చి ఫౌజునంతా నాశంచేశారు. మీ డేరాల మీదికి కూడా తిప్పినారు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఇప్పుడు ఫిరంగిగుండ్ల కారణము తెలిసినది. అయినను భయము లేదు. దారిలో అరా బున్నది.

తృ.—[ప్రవే.] సర్దార్ 200 మందితో వెంగళ్రావు, పటాల రామయ్య, తుపాకి మందు పరిశినమైధానం మయానికి దుమకగానే

ముసేటక్కితారా అరాబుకి నిప్పు పెట్టిస్యాడు. దొర, రావ్వు, వారి గుఱ్ఱాలు, వఖ మన్సీ తప్ప అంతా భగ్ భగ్. [నిష్క్రమించును.

బుస్సీ.—ఇఁక పర్వాలేదు, ఒంటిగాండ్రు వీరేమి చేయఁగలరు ?

ప్ర.—[ప్రవే.] సర్దార్, పటాలరాముడు లాడూఖాన్ కలపట మైనారు; గుఱ్ఱాల మీదనే పరవళ్లు దొక్కుతారు. లాడూఖాన్ చేతి యీ పెపోటికి రాముడుచచ్చి పడిపోయినాడు. వెంగళ్రాయడి యీ పె పోటుకి లాడు పడిపోయినాడు, బదికేవున్నాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.— మంచిది.

రాజు.—[స్వగతము]

క. తురకలవీరులు పలువురు
మరణంబుం బొందినారు ! మాటికి నన్నుఁన్
గరకర కనెదరు ఖానులు ?
గిరిని బిడుగు లట్లు నన్నుఁ గెడపుదు రేమో ? ౬౭

వెంగళ్రావు.—[ప్రవేశించి రక్తవస్త్రములతో గాయములతో అతి క్రోధమున] ఎక్కడరా ఆ విజయరాముఁడు ? ఏఁడిరా విజయ రాముఁడు ? [ఎల్లవారును సంభ్రాంతులై లేతురు.

రాజు.—వెంగళ్రావు ! [అని కేక వేసి గునగున పలాయితుఁడగును.

వెంగళ్రావు.—నన్ను తప్పించుకొని పోఁగలవఁటరా? [అని లేఁచు మును; బుస్సీలోనగువారు వెంగళ్రావును పట్టుకొని అఁపుదురు ; హైదరు జంగు దూరముగా నుండి చూచు చుండును. వెంగళ్రావు మూర్ఛితుఁడై పడిపోవును.]

బుస్సీ.—హాహా ! [illegible]రుఁడా. లే వీర లో కాలంకారమా లే. [వెం[illegible] మూర్ఛ తేరును.

బుస్సీ—సేవకులారా, ఈయనను వైద్యశాలకుం గొనిపోయి రాజు వలన ఈయనకు అపాయము రాకుండ చూచుకొనుచు, మందు లిచ్చి, మాకుఁ దెలుపుఁడు. [సేవకులు వెంగళ్రావునుం గొని పోవుదురు.

బుస్సీ.—ఇట్టిమహావీరులతో ఏల పోరు పెట్టుకొంటిమి !

సేవకులు—[ప్రవే.] సర్కార్, ఆయన తేరినాడు ? వకరిచేత చావతలిశిన ఖర్మం మాకేమి ?' అని పలికి బాకుతో బొమ్ములో పొడుచుకొని కాలంచేశినాడు.

బుస్సీ.—జెహోవా ! జెహోవా ! ఈబొబ్బిలి సూర్యచంద్రులలో చంద్రుఁడు ఈయ స్తగిరిం గ్రుంకి నాఁడు ! రండి, మనమందఱము పోయి ఆ మహావీరుని చూతము. ఎన్ని గాయములు తగిలినవో, ఎంత బలాఢ్యుఁడో, ఎట్టియాకారమువాఁడో, చక్కఁగా చూతము. ఆయనను చూచి నేను మాదేశమున మా ప్రభువుల యెదుట అతని రూపపరాక్రమములను వర్ణించెదను. [అందఱు నిష్క్రమింతురు.

# షష్ఠాంకము.

[రంగారాయఁడు పెండ్లికుమారులతోను ఇతర బంధువులతోను, దళవాయులతోను, సపరివారుఁడై నిండోలగంబుగా ప్రవేశించును.]

రంగా.—చెలికాని వెంకయ్యా, మనము బురుజు దిగి వచ్చుచున్నపుడు, పరాసు వానిడేరాకు కొండబోటునకు నడుమ కొండంత మంట ఎగసి మాయమైనదే, అదేమి? నల్లమందు పఱపా?

చెలికాని వెంకయ్య.—అవును మహాప్రభూ. దానిలక్షణ మట్టిదే.

రంగా.—అచట వెంగళ్రావు పోరుచుండెనా?

వెంక.—అట్టి దేమి లేనిచో ఏల నల్లమందు మారమ్మ అట్లు మండును?

సభ్యులు.—ఈ నల్లమందు మారమ్మముందు ఆఁగలేక యున్నాము బాబూ!

రంగ.—మాయదృష్ట మెట్లున్నదో?

[అంతట నల్లఁబాఱిన మానిసి యొకఁడు వడివడిగా, లేచుచు పడుచు ప్రవేశించును.]

నల్లమానిసి.—దండం మహాప్రభో, దండం, యెంగళబాబు యీరస్వార్గంయెల్లినారు బాబూ.

రంగ.—హా! హా! హా! [అనిమూర్ఛిల్లి, తేరి, అరసికొని,] నీ వెవరవురా?

నల్లమా.—నేను వారి బంటుని, జక్కణ్ణి, ఖబురు చెప్పడానికి మిగిలుండ మంటే మిగిలి వచ్చినాను బాబూ.

రంగ.—మా తమ్ముడు మా కేమియు చెప్ప లేదటరా?

జక్కు.—అన్నయ్యగారు నారణయిపోరం చూడరైరి గదా అన్నారు బాబూ. నేను శెప్తా నని మనివి చేసుకొన్నా.

రంగ.—ఏమిరా ఎట్లు పోరినాఁడురా నా తమ్ముఁడు?

జక్కు.—శినపాబు మొగలాయీవాళ్ల గుఱ్ఱాలని గెంతుకెలని సవార్లతో తెగ నఱికినారు. 1000 ఫిరంగీల వాళ్లనికూల్చి ఆఫిరంగీలు పరాసులమీదికి తిప్పించి కాల్పించినారు. అప్పటిః మిగిలిన మాతో అళ్లు శేరాలమీదికి వురికే తలికి నడమ గల్లమందు మాౘెమ్మమంటలో అందఱము మాడిపోయినాం. శినబాబూ నేను మిగిలినాము. అనక బుస్సీశేరాలోకి విజయరామరాజా కోసరం ఎల్లి ఆయన్ని లేఱుముకపోయి శినబాబు మూర్ఛపోయినారు. అళ్లచేతులలో తెప్పిరిల్లి అళ్లు ఎంత బతిమాలుకొన్నా యినక, రాజాని వొదలనని లగువు చేసిపడి యీరస్వార్గానికి ఎల్లినారు, బాబూ.

[అని సొమ్మసిల్లి కూలును. నౌకరులు వాని బయటికిం గొనిపోవుదురు.

రంగ.—[తెచ్చువడియుండి] హాహాహాహా! ఎప్పుడును నా యను చరుఁడవుగా నుండువాఁడవు; ఇప్పుడు నాకన్న ముందు నీవు ఎట్లు వీర స్వర్గమునకు వెళ్లితివయ్యా! హాహాహాహా! నా దురదృష్టము!

రంగ.—అన్నలారా, పడవాళ్లారా నాకుడిభుజము విఱిగిపోయి నదే! ఇఁక నే మున్నది! వెంగళ్రావు పోయిన పిమ్మట ఇంక నేమి బొబ్బిలి!

[ఫిరంగియుగాదులు, నౌకరులు సంభ్రాంతులై ప్రవేశింతురు.]

నౌక.—మహాప్రభో, పరాసుల ఫిరంగిగుళ్లు వొచ్చి కోటలోనంతా పడతావున్నయి, లోగిళ్లు కూలిపోతావున్నయి. గుళ్లదెబ్బలకి మన సొభత్తు వాళ్లు నాశమై పోయినారు. మనజెండా ఏమయిందో తెలకకుండా ఎగిరి పోయింది.

[రంగారాయని ప్రాల దివాణములో ఫిరంగిగుండ్లు పడును.

**రంగ.**—హాహా! అయ్యా, పెండ్లికుమారులారా, ఓబంధువులారా—

సీ. పెండ్లికై విచ్చేయఁ బిలిచికొంటిని మిమ్ము;
నిట నిట్టు లగు నని యెఱుఁగనైతి!
దుఃఖమునకై మిమ్ముఁ దోడు వేఁడఁగ లేదు,
దైవంబు మా కిష్ట దాయ యయ్యె.
వ.ముఁగూర్చియే కదా మలకలు వచ్చిరి,
వారికి మీమీఁద వైర మేమి?
డారికి సామగ్రి దయసేసి కైకొని
సకుటుంబముగ మీరు సాగిపొండు

ఆ. 'పెండ్లికతమున మేము బొబ్బిలికి వచ్చి
యేఁగుచున్నార' మనినఁ, బోనిత్రు మిమ్ము.
మిగిలియుండుఁడు నేమాన మీర లేని;
మాకొఱకు మీకు సంఘాతమరణ మేల? ౬౭

[పెండ్లికుమారులు రాజబాంధవులు అందఱు ఉగ్రవీక్షణులై నిష్క్ర.]

రంగ.—వెంకయ్యా, ఏమి? వీరు బదులు చెప్పకయే లేచిపోయి నారు?

**వెంకయ్య.**—మహాప్రభూ, వారి గాంభీర్యము మీకు తెలిసినదే కదా?

ఆ. ప్రాణ మిచ్చునట్టి బంధులు గావునఁ,
బ్రాణబంధుసంజ్ఞఁ బడసినారు;
మిత్తి నైనఁ బోర మీకై పొడుచువారు,
తోడుగు తోలఁచుకొఱకుఁ దొలఁగినారు. ౬౮

రంగ.— ఆహాహా! ఏమి వారి యనురాగము! ఏమి తెగువ! నాకుం గూడ వారు మార్గదర్శకులైరే. నాకును స్వయముగా వదలించుకోవలసిన తొడుగులు కలవు గదా? అంతఃపురము నకళ్లకే దారి చూపుము.

వెంకయ్య.—ఏలినవారు ఇటు రావలయును.

[రంగ-వెంకయ్య-నిష్క్రమి.

స్థలకము.— అంతఃపురము.

[పెండ్లికొమారితలు, మల్లమ్మదేవిగారును ఉపవిష్టలై ప్రవేశింతురు. పెండ్లికుమారులుసంభ్రమమున ప్రవేశింతురు. పెండ్లికొమారితలు లేతురు.

మల్లమ్మ.—ఏమి నాప్రాణములారా! ఇట్లు మీ రొక్కుమ్మడి అంతఃపురము ప్రవేశించిన కారణ మేమి?

పెండ్లి కుమారులలో నొక్కఁడు—దేవిగారికి! ఇవి మా కడపటి దండములు. వెంగళ్రాయనింగారు వీరస్వర్గమునకు వెళ్లినారు. రంగారాయనింగారు కోటవెలుపలకు రాజుతోను, పఠానులతోను, కలయఁబడుటకు తరలుచున్నారు. పఠానులు బొబ్బిలి కోటను కూల్చుచున్నారు. మఱి మే మేల వచ్చితిమో తమకు చెప్పవలయునా?

[వెంగళ్రాయని భార్య సుభద్రమ్మ శోకించును.

రాణి.—అమ్మా, సుభద్రమ్మా, నాబంగారు చెల్లెలా, నీప్రాణేశ్వరుఁడు రవంత ముందు పోయినందులకు దుఃఖించెదవా? ఈసమయములో మనకు దుఃఖము కునికిరాదు నాకూనా. నాముద్దుఁగూఁతులారా! మాప్రాణేశ్వరులతో మీప్రాణేశ్వరులు వీరస్వర్గమునకు తరలియున్నారు. మన మచటికి ముందుగాఁ బోయి వీరు విజయంచేయు సమయమునకు గృహోత్సాలంకారములు గావించుకొని వీరికి స్వాగతము చెప్పవలదా? ఎవరి దొరను వారు, తొలిచూపే కడసారి చూపు చూచుకొని, తొలిదండమే కడసారి దండము పెట్టి, ముందుగా తరలుఁడు.

[పెండ్లి కొమారితలు భర్తలకు ప్రణమిల్లి లేచి వారిబాకులం గైకొందురు.

[నేపథ్యమున]

'గోవింద, గోవింద, నారాయణ, నారాయణ.' [అందఱు ఆకర్ణింతురు.

రాణి.—ఆహా! పెద్దవారు అందఱు మనకన్న ముందుగానే తరలినారు! వెనుకఁ బడుట మనకు అవమానము గాదా? ఇదిగో నాకు నా ప్రాణేశ్వరులు ఇచ్చిన బాకున్నది. సుభద్రమ్మకు వెంకళ్రావు ఇచ్చి పోయిన బాకున్నది.

స్త్రీలు అందఱు— (గేయము.)

భారతీ దేవిరో, భార్గవీ దేవిరో, పార్వతీ దేవిరో;
దీవింపుఁడీమమ్ము దీనలను మాయ ధీనలను దల్లులార!
వీరపత్నుల మమ్ము వినక కనక ముందే
విడనాడు చున్నట్టివీరే;
ప్రతిజన్మ మందుమా ప్రాణనాథులుగాఁగ
వరమొసం గుఁడు తల్లులారా!
మాకిట్టి వంతలు మరలరా కుండఁగ
మముఁగావుఁడీతల్లులారా!
కడపటి మా మ్రొక్కు గైకొని మామీఁద
కనికరింపుఁడు తల్లులారా!

[అని బాకు ఱొమ్మునకు గురిచేసికొని]

రంగరంగ శ్రీ రంగారంగా కావేరి రంగా
కమలా కాంతా మనోజ్ఞ భృంగ కస్తూరి రంగా.

[అని పాడుచుకొన నుంకింతురు. తెర వ్రాలును, తెరలో "గోవింద గోవింద, నారాయణ నారాయణ" పెండ్లికుమారులు బాకులు తుడుచు కొనుచు పూర్వస్థానమునకువత్తురు. ఇతరులును అట్లే వత్తురు.

[రంగారావును అట్లే ప్రవేశించును.

రంగ.—అయ్యలారా, మాయన్నలారా, మాతమ్ములారా, నాబం గారులారా,

సీ. విజయ బంధువులార, వేజన్మముల కైనఁ
దీర్చుకో నేర మీ పేర్చు ఋణము.
చేతు లారంగఁ బూజించితి మెవ్వారి,
ఖండించితిమి వారి ఖడ్గధార!
లీలలు మీఱ లాలించితి మెవ్వారి,
బడఁగ్రుమ్మితిమి వారి బాకు మొనల!
ఆఁడుఁబురువు లేదు! హతమయ్యె మగకూన!
కోట పాడయ్యె నింకేటి కిచట!
తే. నాదు ప్రాణంబు వెంగళ నాయకుండు
నన్నెదురు సూచు చున్నాఁడు కన్ను నొవ్వ,
అరుల బొందుల మీఁదుగా నతనికడకు
క్షణములోఁ జేయదము రండు రణపథమున. 20

[వెంకయ్య ప్రవేశించును.

రంగ.—వెంకయ్యా, ఏమిచేసి వచ్చితివి?

వెంకయ్య.—మహాప్రభూ! ఎల్లవారితోడుగులు వదలించి వచ్చితిని.

సీ. వరవుడులుం గూడ వలసపో నొల్లక
యిటనె యీల్గఁగ నిశ్చయించుకొనిరి!

పంద్రెండును బడాల వారి గృహంబులు
ఖాలి సేయించి యాబాలముగను
తెలగా పడంతుల, వెలమ పడంతుల,
లోనికిఁ దోలి, తల్పులు బిగించి,
తోరంబుగా నన్ని చూరుపట్టెల వెంటఁ
జిచ్చులంటించి, నేవచ్చినాఁడ.

తే. గవను తెరచి మనము గడచునప్పటికి భూ
చక్రమునకు నాక చక్రమునకు
మంటయిరుసు నారి మనకంటి కగపడు,
నేల తడయ నింక నేలినదొర. ౭౨

౮౦౫.—[ఆత్మగతము]

తే. విజయరాముని కోర్కెయే విజయ మొందె!
పాపి పింజారి హైదరు పలుకె నెగ్గె.
బొబ్బిలిగడీని బాడిడి పోటు మగఁడు
రంగరాయండు వెడలె గౌరవము దక్కె. ౭౩

ఆహా! ఆహా! ఆహా! [ప్రకాశము.] వీరాగ్రణులారా! మనము పరాసుల జేరామిఁదికే పోదము; మఱి తరలుఁడు. గోవిందా, హరి గోవిందా.

[అందఱు 'గోవిందా హరి గోవిందా' అని అఱచుచు
వికటకముగా నిష్క్రమింతురు.

---

# స ప్త మా ం క ము.

## స్థలకము:—బుస్సీ డేరా.

అంతట బుస్సీయు విజయరామరాజు ప్రభృతులును ప్రవేశింతురు.

బుస్సీ.—[సంభ్రమమున] రాజా, ఇదే మర్యాద, ఇంత వెల్తురు?

[రాజును బుస్సీయు పరిక్రమించి పరికించినట్టు అభినయించి కూర్చుందురు.

బుస్సీ.—ఏ మయ్యా ఆజ్వాల ? కోటయంతటను మంటికి మింటికి అంటి యున్నది.

రాజు.—దొరగారూ, ఈ వెలమవాని గర్వము మీ కేమి తెలియును? బయట మనతో యుద్ధము, లోపల 50 పెండిండ్లు. ఈ జ్వాల యతని బాణసంచాలమంట.

బుస్సీ.—ఏమి యాశ్చర్యము ! ఏమి యాశ్చర్యము ! 50 పెండిండ్లు! ఇదే సమయమని తెచ్చితివయ్యా ముట్టడి ! ఆహా ! ఆహా !

ప్ర.—సర్దార్, రంగారావు 700 మంది సిబ్బందితో కోట నుంచి మీ డేరాల మీదికి దూకినాడు. దారిలో లాలు ఖుమందాను అడ్డినాడు. అక్కడ వారికి వీరికి లగాలగి మరామరి.

బుస్సీ.—లాలుతో చెప్పుము, రంగారావును ప్రాణముతో ఇక్కడికి తె మ్మని.

ప్ర.—సర్కా రాజ్ఞ. [అని నిష్క్రమించును.

[అంతట హైదరుజంగు, వేంకటలక్ష్మిని చినవేంకటరాయని జవానులచే పట్టించి తెప్పించి బుస్సీయెదుట నిలుపును.

బుస్సీ.—ఎవ రయ్యా వీరు హైదరుసాహెబు ?

హైదరు.—అయ్యా, ఈ బచ్చాకి తీస్కొని ఈమన్సి కోటకాడి నుంచి యెల్తావుంది. సోల్జర్లు అడ్డంవొస్తే, వరహాలు సల్లుతుంది. వాళ్లు వాట్కి రాజాయిళాయి గొల్తుర్లో యేరుకొంటా వుంటే, ఇది తప్పించుకొని పారిపోతా వుంది. వరాలుగిరాలు చూచి బొబ్బిలి జమిన్దార్ ఇలాఖా బచ్చాకీ తల్చి, అవిదొరకనివాళ్లు మనసిపాయీలు యీళ్లకి పట్టుకొని ఇక్కడికి తేబోతే, యిది బాకుకి దూసి లడాయి చేస్తుంది. 100 మందిని కుమ్మింది. చూడడానికి దాసీవుంది, సాముగరిడీలకీ బురాక్ వుంది. పిల్ల వాడికి తుపాకి వాత వేస్తామంటే అప్పట్కి యిది మమ్మల్కి సంపడం మానింది. మీరు మాటలాడ వొచ్చును.

బుస్సీ.—ఎవ రమ్మా మీరు? సంకోచము లేకుండ ఉన్నమాట చెప్పుఁడు. మీకు మేము చెఱుపు చేయము. ఇంత బీరము గల యాఁడు వారికి ఎవరైనను గౌరవము చేయవలసినది.

వేంకట.—అయ్యా, మీరే బుస్సీదొరగా రని నాకు తోఁచుచున్నది. వారే విజయరామరాజుగారు. కానిండు. నేను బొబ్బిలి రంగారాయనింగారి జనానా దాసీ జనము ముప్పది ముగ్గురలో తలదానిని. ఈ కూన చినవెంకటరావు మాయేలిన వారికి ఒకఁడే కుమారుఁడు. ఈయనను ఈయనతల్లి మల్లమ్మదేవి మమ్మేలినతల్లి ఈ రాజుచేతఁ బడనీయక సామర్ల కోటలో చెల్లెలియిల్లు చేర్పు మని నాకు అప్పగించినది. నేను ఒప్పుకొని 'నాబొందిలో ప్రాణ ముండఁగా' బాలునికి అపాయము లేదని పలికి, బాపన బాలునివేషాన కొనిపోవుచుండఁగా, మీ మ్రోలకు మమ్ము తెచ్చినారు. మీరు దొడ్డవారని వినికి. అటుపైని మీ చిత్తము.

బుస్సీ.—బళిబళి! నీవు వారిపాలిటి ధర్మదేవతవు, మిమ్ము నేను రక్షించెదను.

రాజు.—గిరి గిరి! ఈ బాలుని ఏనుఁగు కాలిక్రింద మట్టించి నేలఁ గలపవయ్యా బూసీదొరా!

బుస్సీ.—ఏమి హా పొత్తుఁడవురాజా! అట్లు పలికెదవు!

రాజు.—బొబ్బిలిపురుగు మిగిలిన, నిన్ను నన్ను ఇఁక నుంచునా ?

బుస్సీ.—ఇంత ద్రోహము తలంచిన, నీ నెత్తిపైన దేవుఁడు పిడుగు వైచును జామా. నౌకరులారా ! వీరిని గౌరవముగా విచారించుడు, సుఖముగా, మా డేరాలోనే, మాపడుకగదిలో నుంపుఁడు.

[నౌకరులతో వెంకటలక్ష్మి బాలుంగొని నిష్క్రమించును.

ప్ర.—సర్దార్ ; యుద్ధం మాని పది తెల్లజెండాలు వేసుకొని సమీపించి రాయనింగారితో 'వీరాగ్రేసరా, మీతో బూసీదొరగారు సఖ్యం కోరుతూ వున్నారు. మీరు ప్రాణంతో వారి దగ్గరికి విజయం చేయవలెను' అని కోరితే, ఆలాగే వస్తాము విజయరాముణ్ణి మాకాడికి దెస్తే, అందాకా పోరుతూనే వుంటాము; మీరు దోరుతూనే వుండండి.' అని మళ్లీ మన దండును రూపుమాపుతా వున్నారు.

బుస్సీ.—మరల పోయి ఆయనతో 'అయ్యా, మీకుమారుని బాలుని చినవెంకటరావును దాసివెంకటలక్ష్మి పామర్ల కోటకు కొనిపోవుచు మాకు పట్టుఁబడినది. వారిని మేము కాచియున్నాము. బాలుని క్షేమముగా మీ కందించెదము, సఖ్యము చేసికొన దయ చేయవలయును.' అని వేఁడుకొని తెండు. [ప్ర. నిష్క్రమించును.

చ.—సలాం సర్కార్, రంగారావు కుడి బుజం తెగిపోయింది. యెడ్మ మోకాలికి తుపాకిగుండు తగ్లి మెకాలుపగ్లి పోయింది. రగతం దూకుతూ వుంది. మండీ యేస్కొని యెనకాకీ ముందూకి పక్కలాకి యెడ్మాచేతితో నఱుకు తాడు సాబ్. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఆయన కేమి యంత్రమా వీరుఁడా! హా! హా!

ప్ర.—సర్దార్, దగ్గిరికి వెళ్లడానికి గుఱ్ఱం చొఱడానికి సందు లేదు. రాణువ ఆయనకి చుట్టూ వెదురు పొద వుంది.

బుస్సీ.—[లేచి] అటయిన మేము వెళ్లి దారిచేసికొనియెదము. [రాజుంగూర్చి చిఱునవ్వుతో] మహారాజా, మీరు వచ్చిన ఆయన వచ్చునఁట గదా, మీరు కూడ గండి. [రాజు గునగునం బాటి నిష్క్రమించును.

బుస్సీ.—పంద! మేమే పోయెదము. [అని పరిక్రమించును.

చ.—సర్కార్, రంగారావు రక్తం కారికారి సొమ్మసిల్లి పోయినాడ్. మనవాళ్లు పట్టి ఎత్తబోతే తెప్పిరిల్లి మళ్లీసొమ్మసిల్లిన్యాడు. గుండెగాయంగుండా బొట్నవేలు వుంట్లే అంతహాత్మ లేచి పోయింది చెప్పిన్యార్. ఆమహాపురుషుడి ధేధీప్యమానం రూపాన్ని రాణువ అంతా, మీద మీద పడి సూస్తావున్యారు సర్కార్; యేడుస్తావున్యారు కూడా. నేను వెంటనే మీకి చెప్పవెయ్యాల ఘన్క ఇక్కడ మీతోనే యేడ్వడాన్కి వచ్చిన్యాను సర్కార్.

బుస్సీ.—అటయిన మేమును అక్కడకే చూచెదము. [అని లేచి తూర్పుదెసం బరికించి] అహా! సూర్యుఁ డుదయించినాఁడు! ఇతఁడిచ్చట నిన్న సంజవేళ నేమి కాంచినాఁడు! ఇపు డేమిచూడవచ్చినాఁడు! కెంపెక్కిన యీసూర్యుని ఇతని చెంగటి యీ సాంధ్యమేఘములను గనఁగా నిట్లు తోఁచుచున్నది. వీరిమతములో యుద్ధగాయముల వీరులు సూర్యమండలమును భేదించుకొని వీరస్వర్గమునకేఁగుదురు గదా. దానంజేసి.

ఉ. రావుకులాగ్రగణ్యునికి రంగమహీపతికిన్ బ్రియంబునన్
ద్రోవ యొసంగి త ద్రుధిర ధోరణిచే గవి దాల్చె శోణతన్;
రావున కోహటి ల్కలనరంబున గుంపులువడ్డ తక్క ర
క్తావిల వీర కోటులు సుమా తరు ణారుణ సాంధ్యమేఘముల్.

ఉదయించిన యీ నభోమణిం గంటిని. పోయి అస్తమించిన యీధరామణిం గనియెద. [అందఱు నిష్క్రమింతురు.

# అష్టమాంకము.

## స్థలకము:—బొబ్బిలికోట లోపల.

(బుస్సీ, విజయరామరాజు, హైదరుజంగు, ముసేపనాల్, పరివారముతో ప్రవేశింతురు)

హైదరు.—ఏమి ముసేపనాల్ బహద్దర్ ? ఈలూటీలో విస్తారం ధనం దొరికిందా మీకి ?

ముసే.—ఎక్కువగానే దొరికింది, హైదర్సాబ్. ఈయాశ్చర్యం ఇనండి. మాదీ పాడు జీవణం. వఖరిసావు మాకీ పెళ్లి, వఖరినాశం మాకి హావిశ్వర్యం; మాదీ చావూ నాశం అలాగే ఎవరికో పెళ్లి హావిశ్వర్యం అయితుంది. వారిధనం మొత్తంగా మాకి ఎక్కడా దొరక లేదు. బుగ్గిఐన వల్లుతో బంగారపు జవాహారీ కరిగినపెళ్లలు దొరికినయి. కొన్ని ఇస్త్రీ శపాల్మీద విశేషించి జవాహారీ దొరికింది. ఖిల్లామే ధనం దాశిన సోటు అడ్గడానికి వఖ నరపురు గయినా లేదు.

బుస్సీ.—స్త్రీ లే మయిసారు ? ఒక స్త్రీ యైనను కోటనుండి తప్పించు కొని పోలేదు గదా !

ముసే.—స్త్రీ లంతా సచ్చి పడివుంది. కానా మంది కాలిపోయింది.

బుస్సీ.—ఏమి యిది ! పెండ్లి యని చెప్పినాడే యీరాజా !

ఒకసిపాయి.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] నాకీ ఆయింట్లో దూరినదాన్కి కిఫాయత్ ఇద్గో నాదాడీ కాలిపోవడం.

[అని నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి రాజా, యీవింతలు చూతము రండి.

[అని పరిక్రమింతురు.

రాజా.—[ఆత్మగతము] నాచేఁతను నాకనులారం జూచెదఁగాక.

బుస్సీ.—[పరికించి] యీ యిండ్లన్నీ కాలిపోయినవి! ఇంకను కాలుచునేయున్నవి [కాంచి] ఏమి యిది! కాలిపోయిన స్త్రీ దేహములు! [నిర్వర్ణించి] ఎక్కడను పురుష దేహము అగపడదు. [ఒండుచోఁ గాంచి] హా! యిక్కడ ఈపసికూన సోలి పడిపోయి, పాలు త్రాగుచున్నట్లు నోరు కదలించుచున్నది! [మఱియొకచోటఁ గాంచి] హా! హా! ఇక్కడ ఈశిశువు చచ్చిన తల్లిమీఁద పడి పాలకై పీఁకుచున్నది! హా! హా! రాజా! ఈకోట లోని స్త్రీ లందఱు నీవు చేసిన ద్రోహముచేత గోహరు చేసినారా యేమి?

మూసే.—అవును సర్దార్; అలాగే జర్గింది.

బుస్సీ.—ఏమి రాజా? ఇండ్లు కాలుచున్న మంటలను పెండ్లిబాణ సంచా అంటివే. ఎంత పాపాత్ముఁడవయ్యా!

రాజా.—[విసుగుతో] ఆ! నేనుమాత్రము చూచి చెప్పితినా యేమి? ఊరక నన్ను పట్టుకొని నిందాలు మాటమాటకు.

బుస్సీ.—రాజా ఈపాపము ఎవరి దయ్యా?

రాజా.—ఏమి చేయను! మనదే.

బుస్సీ.—అది యె ట్లయ్యా, ఉమ్మడిమాటగా పలికెదవు?

రాజా.—నాకు ఈజమీను వచ్చినది, మీకు పేష్కస్సుధనము వచ్చినది.

బుస్సీ.—లేదు, నీవు మమ్ము మోసము చేసితివి. నేను ఏత ప్పయిన మన్నింతును గాని, మోసమును మన్నింపను. హా! హా! ఎంత మోస పోయితిమి! ఇందులకు శిక్ష రాజా, యీజమీనును మీకు మే మియ్యము.

రాజా.—[ఆత్మగతము] బెదరించే. [ప్రకాశము] ఈ పాపము నాయొక్కనిదే.

బుస్సీ.—అట్లు పలుకకు. 'మనది' అనకు. [సూక్ష్మశ్రవణ మభిన యించి] ఏమి యిది తెంపులేని ఘంటానాదమువలె వినఁబడుచున్నది! హైదరుజంగ్, మీకు వినఁబడ లేదా?

హైదరు.—అదుగో యినండి. అర్ధరాత్రపు ఘడియల్లో కొండ మీదిక్కు ఆ బంగారపు వున్నీ! తెలోయేవాడికి రాయిరాయిన్నీ 'చీచీ' యన్న చీవాట్లలాగ మనకీ యిక్కడ 'చీచీ' ఇనఁబడటం లేదా?

ముసే.—అవు నవును. ఇంకా ఇంకా ఏమేమో ఇనబడతా వుంది.

హైదరు.—ఇప్పు డేమి చెప్తారు? ఇంకా రాత్రయినకొద్దీ కోలాహలం వుంటుంది. గుండెబద్దల్ ఆయ్యే శబ్దాలు ఇనబడుతుంది.

రాజా.—ఇన్నిదావులు ఆయిన యీ కోట శాకినీ డాకినీ బ్రహ్మ రాక్షస బేతాళులు పేటలాడుట ఆశ్చర్యమా?

హైదరు.—నేలడేకినీ, నింగిసాకినీ, జిన్, పిశాచీ, సైతాన్లు కూడా. ఈటిభయానికే నేను రాత్రి నాడేరా హైటికి అడుగుపెట్టాక లేదు.

బుస్సీ.—మనమిక్కడ ఉండఁ దగదు. డేరాలకే పోదము రండి. మనకే మందుగుండ్లు లేకపోయిన, మనది 174000 సేనయు, యీబొబ్బిలి బంట్లు 2000 మందిచేత నాశమై యుండును. [అందఱు పరిక్రమింతురు.

స్థలకము:—బుస్సీ డేరా.

బుస్సీ.—ఇదే మా డేరాలో కూర్చుందము.

[అట్లు చేయుట నభినయింతురు.

బుస్సీ.—ఎవరురా అక్కడా?

నౌకరు.—సర్దార్, ఏమి సెలవు?

బుస్సీ.—ఆ బాలుని వెంకటలక్ష్మమ్మను తోడ్కొనిరండు.

[నౌకర్లు అట్లే చేయుదురు. వెంకటలక్ష్మి బాలుని కుర్చీలో కూర్చుండఁబెట్టి నిలుచుండును.

వెంక.—బాబూ, దొరగారికి సలాము చేయుము.

బాలుఁడు.—సలాము బూచీ దొరగారికి [అని సలాము చేయును.

బూసీ.—[టోపీతీసి] సలాము చినవెంకటరాయనింగారికి—హైదరు సాహెబు, ఈయన నేమి చేయుదము?

రాజా.—ఏమఁగు కాల మట్టింపుఁ డని నే నప్పుడే చెప్పలేదా ?

బుస్సీ.—ఏమి పాపాత్ముఁడా. అట్లు పలికెదవు. బిడ్డలఁ గన్న వాఁడవు కావుగదా. ఆ నిసువును చంపి అతని నోటిముందటి యన్నమును హరించెదవా; నీది యెట్టి రాతిహృదయ మయ్యా !

రాజా.—అటయిన మీరు నాకు చేసిన మేలు సున్న. వాఁడే నా ప్రాణానకు మృత్యువు.

బుస్సీ.—ఎట్లయ్యా ?

రాజా.—పరీక్షించి చూడుఁడు.

బుస్సీ.—నౌకరులారా, దివ్యపదార్థము లన్నియు, బాలుని మ్రోల పెట్టుఁడు. పుస్తకములు, కత్తి, కటారి, ఈఁటె, ఇంక వేఱు కైదువులు కూడ పెట్టుఁడు.

[నౌకర్లు అట్లే చేయుదురు.

బుస్సీ.— బాబూ, ఇందులో నీ కేమి కావలయునో దానిని తీసి కొమ్ము. [బాలుఁడు పోయి కత్తిం గైకొని రాజా మొగముమీఁదికి ఎత్తును.

బూసీ.— బళీ! బళీ! బలారే! బలారే! తండ్రిపగ తీర్చుకొనెడి కుమారుఁడవు బాబూ, తుపాకికడుపున ఫిరంగిలాగున పుట్టినాఁడవు. (రాజా నుద్దేశించి) రాజా, నీపాపము నిన్ను త్వరలో నే కొట్టును గాని తప్ప దయ్యా. వేంకటలక్ష్మమ్మా! ఈరాజాకలన మోసపోయి మేము అమహాత్ములకు చేసిన కీడునకు మితిలేనిదానికి కొంచెము పరిహారముగా, ఈ చిన్ని బాలుని నీతో సురక్షితముగా పంపెదను. ఎవరు రా అక్కడ ?

[నౌకరు ప్రవేశించును.

బుస్సీ.—ఈక్షణము పోయి, మా సేనల్లీ సర్దారుతో మామాటగా చెప్పుము. 'నీవు మా పరంగి తురుపు 200లతో, సకలపదార్థములతో, సవారిలో ఈ వేంకటలక్ష్మమ్మను ఈచిన్న రాయనింగారిని, ఎక్కించుకొని, సామరకోటకు కొనిపోయి, తగిన మరియాదలతో ఈయన పినతల్లికి అప్పగించి,

మాసలాములుచెప్పి, మమ్ము కలసికొనవలసినది.' అనియు, 'దారిలో ఈరాజు ఏమయిన శిశువునకు అపాయము చేయుటకు పన్నాగము పన్నినా, దానిని నీవు హతము చేయవలసినది.' అనియు, 'ఇక్కడ రాజును మేము భద్రముగా కాపు కాచెదము.' అనియు, చెప్పుము. వీరిం దోడ్కొని పొమ్ము. [అని బాలుని ఎత్తుకొని ముద్దిడి, పండిచ్చి, దింపి] బాబూ, పోయివచ్చెదవా?

బాలు.—పోయి వత్తాం, తలాం.

వెంకట.—సలాము దొరగారికి. ఒక మడుగులోనే మొసలియు, రాజహంసయు నున్నవి. అట్లే ఈ సేనలోనే ఈరా జున్నాఁడు, మీరును ఉన్నారు. మీ రన్నట్లు. ఈయనను, పాపము కొట్టునుగాని మానదు. సెలవు పుచ్చుకొంటిమి.

[నౌకరు, బాలుఁడు, వెంకటలక్ష్మియు నిష్క్రమింతురు.

రాజు.—ఎవరురా అక్కడ మానౌకరులు?

నౌకరు.—[ప్రవేశించి] జయము జయము మహాప్రభువుగారికి ఏమి యాజ్ఞ?

రాజు.—ఈక్షణమే పోయి, ఎల్లుండి తెల్లవారు నప్పటికి మాబాబును ఆనందరావును ఇక్కడికి బొబ్బిలి పట్టాభిషేకార్థమై సర్వ సన్నాహముతో తోడ్కొనిరండు.

నౌకరు.—చిత్తము ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఇఁక మీరందఱు పొండయ్యా; నేనును నాయాందోళన తీఱునట్లుగా, ఏసుదేవుని గూర్చి నాతప్పులు మన్నింపు మని ప్రార్థనచేసికొని విశ్రమించెదను.

ఇతరులు.—సలాము, సలాము, సలాము. [అని నిష్క్రమింతురు.

బుస్సీ.— నేను ప్రార్థనాపవరకమున కేఁగెద.

[అని నిష్క్రమించును.

—

[అష్టమ నవమాంకముల నడుమ]

## ప్ర వే శ క ము

స్థలకము.—బొబ్బిలికోటలోపల.

[అంతట వెట్టివాండ్రు ప్రవేశింతురు.]

వెట్టినాయకుఁడు.—[చేత చేపాటికఱ్ఱం బట్టుకొని నిలువంబడి, శవములను బండ్ల కెక్కించుట నభినయించుచు] యెట్టోడిబదుకు యేం బదుకురా నారాయుడా! ఎత్తండిరా ఈ పీనుగలని, బళ్లలోకి.

[ఇతరులు అట్లుచేయుట నభినయింతురు.

వెట్టినాయకుఁడు.—అయురె మజ్జా! యేమి శిత్రంరా! మనము పది కారలదూరాన వుండాలిశిన యీ ఆడంగులు రానివోసాలు, యేనిగలమీద బంగారపు అంబారీలలోను బంగారపు సవ్వారీలలోను తిరగాలిశినవోరు, మనకాత దున్నపోతులబళ్లల్లో, యీడ్పులు పడి, గోతులలో పడతా వున్నారు; ఏంకష్మ మొచ్చిందిరా యీళ్లకీ! ఇదేలా గుం దంటే:—

[గేయము.]

హరిహరి నారాయ ణాదినా రాయణో
కరుణించ వోయ్మమ్ము కమల లోశసుడా.
నిన్న రా తిరి కోట మొన్న రా తిరికోట
వన్నెమీా రినకోట వశినపుర మాయా. హరి॥
శిన్నమ్మ యిన్నాలు శిందులూ తొక్కితే,
పెద్దమ్మ పరవళ్లు పెడ తున్న దిపుడు హరి॥
పెద్ద మెల్తా దంట, శిన్న మొస్తా దంట,
వశినపురమూా మల్లి వన్నొత దంట. హరి॥

ఏ మొగం పకపక యెగిరెగిరి నవ్విందో,
ఆ మొగం యెక్కెక్కి అంగలార్చింది. హరి॥
ఏ మొగం యెక్కెక్కి యేడస్త వుండిందో
ఆ మొగం నవ్వింది అబ్బురంగాను. హరి॥
రంగరా వెల్లాడు, శింగార మెల్లింది,
ఆనందరా జింక ఆడతా డంట. హరి॥
ఆనందు డిక్కడ ఆడడానికి వో స్తె,
యెల్లిన శిన్నమ్మ యెంటొ స్త దంట. హరి॥
అమ్మ లిద్దఱికొత యిమ్ములూ కుమ్ములు
నరమాన వులనొష్ఠ నలవ రా శినదు. హరి॥

[అంతట చాటింపు వెట్టివాఁడు ప్రవేశించును.]

చాటింపు.—ఎందుకన్నా యిక్క డంతా ఋబ్బరం శేయిస్తా వున్నావు ?

వెట్టినాయ.— దేవు ఆనందమారాజుకి యీడ పట్టం కడతారంట; అందుకోసంరా! నువ్వెంట్రా సాటించ నెల్తావు ?

చాటింపు.—నాను ఆనందమారాజుకి యీడ పట్టాబిసేకానికి ఊరంతా అలంఖారం శెయ్యాలిశిం దని సాటించ నెల్తా. యూశినావా అన్నా శిన్నమ్మ శపలశిత్తం ?

వెట్టినా.—(జనాంతికము) మఱి గంటే, వోశే! నువ్వు నిన్నటిదాక రాయనింగారి వుప్పు తిని, ఇప్పుడు ఆనందరాజుకోసం సాటిస్తా వేంట్రా ?

చాటింపు.—(జనాంతికము) నువ్వేలా గన్నా ఆనందరాజుకోసం సుభ్రం శేయిస్తావు ?

పెట్టివా.—(జనాంతికము) పాపారాయనిం గారికి కబు రెల్లింది; నాతమ్ముణ్ణి తీసకెళ్లాడు. రాత్రి ఆయన వొస్తాడు. పెదరాజాకే పట్టం గడతాడు. (ప్రకాశము) ఈ కంపుకి నిలవలేకున్నానురా. ఈబట్లు తోలించుకెళ్లి కొంచెం నీలుద్ద్యకొంటా.

చాటింపు.—నా తెల్లి యొక్కణ్ణయినా మానులం మిగిలున్నకాడ నా సాటింపు కాకే కొచ్చి నీలకాడ నీతో కలుసు కొంటానన్నా.

[అందఱు నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

# నవమాంకము.

స్థలకము.—స్కంధావారములో విజయరామరాజు డేరాకడ.

[తాండ్రపాపారాయఁడు మిరియాలసీతన్నయు ప్రవేశింతురు.]

సీతన్న.—వచ్చితి మయ్యా పాపయ్యా విజయరాముని డేరాకు. అందఱు బాగుగా నిద్రపోవుచున్నారు. పూర్వము, అశ్వత్థామ సౌప్తికము చేయలేదా? అయినను మనము నిద్ర మేలుకొలిపియే చేయుదము. నేను బయట కాపుండెద, డేరాకడకు వచ్చినవారి నెల్ల క్రుక్కుమిక్కు అన నీయక పరిమార్చుచుండెద. బుస్సీని రప్పించుటకు వీరిఫిరంగులు వారి డేరాల మీఁదికి అగాదు చేసెదను. నీవు సావకాశముగా రాజునకు జముని చేటి చేయింపుము. లోనికిం బొమ్ము.

పాపయ్య.—సరి, సీతన్నా, అట్లే కానిమ్ము.

[సీతన్న నిష్క్రమించి డేరాద్వారము కడకు మరల మరల వచ్చుచుం బోవుచుండును.

పాపయ్య.—బళీ! మిరియాల సీతన్న పనిచే బుస్సీ వచ్చి నాపనిం జూచునుగాక. వీఁడు నేను లేనప్పుడు గదా, నారాయనిని హతముచేసినాఁడు. నేనిపుడు వీనిని, బంధు మిత్త్ర పరివార బలత్రితయ సమేతుని హతమార్చెదను. వెనకెలు వీరభటులచేతఁగదా వీఁడు నారాయనింగారులను, ఒంటరులను ఒక్కొక్కని మడియింపించినాఁడు. నేను ఒక్కండన వీనిని వీనిం గావ నేతెంచువారినిం గూడ పరిమార్చెద. హాహాహా! ఏమి కనఁబడుచున్నది!

శా. రంగారాయఁడు, వేంగళేంద్రుఁ, డనుఁగుల్,
రౌతుల్, భటుల్, రక్తది

గ్ధాంగుల్ నన్ మిడికన్నులం గనుచు జి
హ్వాల్ ద్రోఁప నోళ్ళివ్వచ్చి, కా
ళింగుం జూపి, తృషం దదస్ర ఝర పా
ళిం దీర్ప మన్నంజ్ఞ గాఁ
గం, గైదోన్నె ఘటిం త్రయారె! యిదె రం,
గా వెంగ, నేఁ దీర్చెదన్. ౭౫

హా! మరల ని జేమి! హా!

క. ఈతని ద్రోహమువలనన్
గాతర లై యగ్నిఁ బడిన కంజాతాస్యల్
చేతుల సన్నలచే నను
నీతని మెడఁ గోయు మనుచు నెగచెద రకరే! ౭౬

ఇఁక తడయంజనదు. నిద్రపోవుచున్న యీమూఁకను మదీయ సింహగర్జనములచే 'ఓరి, వచ్చి మీరాజుం గాచుకొండిరా.' అని పిలుతునా? వలదు,; అట్లు చేసిన వీఁడు నారాక యెఱింగి పలాయితుఁడై దాఁగును. కావున లోనికే పోయి వచ్చినపని కావించెద.

ఆ. ఏనుఁగునకుఁ దుల్య మితని దేహము గాన
మేటి శిరము వ్రచ్చి మెదడు వడయఁ
గుత్తుకను బగిల్చి నెత్త్రువాఁకను బొంద
నేను సింహ మవుదు నీక్షణమున. ౭౭

[అని లోనికిఁ బోవుట నభినయించి, చాకును దూయును.

[అంతట ఒక సేవకుఁడు కునికిపాట్లు పడుచు, పాదము లొత్తుచుండ, మంచముపై నిద్రితుఁడు రాజు ప్రవేశించును.]

పాపయ్య.—(రాజుం దఱిసి) పులి! పులి! పులి!

రాజు.—[మేల్కాంచుట నభినయించుచు లేవకయే] పోదు పోదు పోదువు.

[సేవకుఁడు పాపయ్యతోఁ గలియఁబడును. పాపయ్య వానిమెడ నొకచేతంబట్టి బయటికిం దెచ్చి సీతన్నచేత దానిం బెట్టును. సీతన్న వానినల్లుకొని నిష్క్రమించును. పాపయ్య మరల లోనికి పరిక్రమించును.

రాజు.—[ఈయులబలమునకుం బోలె లేచి మంచము దిగి యివలికి వచ్చి కవాచిపై కూర్చుండి] ఏదిరా పులి? ఎటుపోయినదిరా? చల్లారామా, ఏమైతివిరా! హా పులి వానిని కరచికొని పోయినదా?

[అని అన్నివైపుల వెదకుట నభినయించును.

పాపయ్య.—[ప్రవేశ మభినయించి ఎడముచేతితో రాజును గొంతునం బట్టుకొని కుడిచేత బాకు కొని అతని గుండియకుం గదియించి] తప్పించుకొన యత్నించితివా, కత్తిము గటు క్షనిపింపెద. రాజా, ఇది అడవి పులిగాదోయి, బొబ్బిలిపులి; దీనిపేరు బొబ్బిలి బెబ్బులి తాండ్ర పాపయ్య. ఈపులియే చల్లారాముని కొనిపోయినది.

రాజు.—పాపయ్యా, దొంగపోటు పొడువ వచ్చితివా!

పాపయ్య.—నీవు దొంగప్రొద్దునఁ గదా ముట్టడి చేయించితివి?

[నేపథ్యమున.]

'హా! నారాయణ! నారాయణ!'

రాజు.—హా! హా! చల్లారాముని గొంతు! [స్వగతము] బయట ఇతనిసిబ్బంది వచ్చియున్నారు గావలయు. (ప్రకాశము) పాపయ్యా, నిన్నుఁజూచి నతర్వాత, ఎంతపరివార మున్నను, ఇంక నేమి ఆశలు? ఈ బొబ్బిలి నీకిచ్చెదను, నాప్రాణములు కొనకు పాపయ్యా.

పాపయ్య.—అహాహా!

సీ. బొబ్బిలి యిత్తువా ? యబ్బబ్బ శిబి కర్ణ
ధారాధరులకన్న దాత వైతి !
నీపాదుప్రాణంబు నేను గైకొనురా,
గాలిలోపల నది కలయుఁ జుమ్ము.
ఉండెఁబో మ్మామాట ; యూడెనా యోరి నీ
ప్రక్కలోపల నున్న బల్లెకోల ?
వెలికి వచ్చెనో కంటెనలుసు నీ కిప్పుడు ?
పరులసొ త్తాశించు ఫలము గంటె ?
తే. వీఁడెఁడికి నీకు జగదేకవీరుఁ డైన
రావుపైఁ బగ యన నేమి రా బతిత ?
వెంగళుని వెండిలికి నన్ను వెడలకుండఁ
జేసిన ఫలంబుఁ గుడువు చేసేత నిప్పుడు. ౭౮

[నేపథ్యమున ఫిరంగియాగాగులు]

పాపయ్య.—ఒకమాట కయిన బదులు చెప్పవమ్మా. నాచేతి పట్టుచేత నోటమాట రాకున్నదా యేమి? పట్టు కొంచెము సడలించెదను.
[అని అట్లు చేయును,

రాజు.—[ఊపిరి త్రిప్పుకొని నిట్టూర్పు విగిడించి]

శా. పాపారాయఁడ, రాచపుట్టుకను, నీపాదంబులం బట్టితిన్;
నా ప్రాణంబులఁ గావు, నిండుకరుణ న్నాపాలిదైవంబ వై.

పాపయ్య.—

పాపా, పూనితి కాదె వాలుఁ గరిచేఁ బాదాన మట్టింపఁగా!
నీ పాపంబులు నాకుఁ దెల్పినది వానిం దాది కొంపోవుచున్

**నీవు నాశము చేయించిన మాకోటను గూడ చూచి వచ్చితిని జామా,** రాజా, మారంగారాయని బంగారపు మంచముమీఁద పరుండెద నని ప్రతిజ్ఞ చేసితివఁట; నేను వచ్చుతఱికి దానిమీఁద నే గదా ఉంటివి, నిన్ను దానిమీఁద నే సుఖముగా పరుండఁబెట్టి పెద్దనిదురఁ బుచ్చెద. ఇదిగో నిన్నుఁ గొనిపోయెద. పులినాకిన యెద్దా ?

[అంతట బుస్సీయు హైదరుజంగును ప్రవేశింతురు.]

[పాపయ్య రాజాను పిల్లికూనం బోలె ఎడమచేత మెడ పట్టుకొని యున్నవాఁడు, అట్లే కుదిలించుచు, నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి యిది! గడ్డి మేటిపాటి మూటను తాటిచెట్టుపాటి జమాను, ఎడమ చేతితో లోనికి కొనిపోవుచున్నాఁడు! ఈ రాజా తన సామా నంతయూ తరలించుకొనుచున్నాఁడు గావలయు. ఆహా! ఎంత మోసగాఁ డీతఁడు ? పేష్కస్సులు ఎగవేయుటకై మనల నే సంహరింప మనమీఁదికే ఫిరంగులు త్రిప్పినాఁడు !

హైదరు.—[స్వగ.] నాకీ వహ్యాన్న లతువర్హాలు యె గయ్య డానికిసహా. [అంతట ప్రేవులహారాలతో రుధిరస్థాసకముతో, అట్టహాసముతో, తాండ్ర పాపయ్య ప్రవేశించును.

పాపయ్య.—[ఇటునటు వికటముగా పరిక్రమించుచు, పరవళ్లు ద్రొక్కుచు,] పూర్వము తాండ్రపాపారాయఁడను, ఇపుడు రాకాసి మన్నీఁడ నయితిని. అయినను నాజూకుగా:—

సీ. రాజనంబులరాశి భోజనార్థంబుగాఁ
దంచుకైవడి వీని దంచినాఁడ,
పనసకాయను దోరపదనఁ గూరగ వండఁ
జెక్కుకైవడి వీని జెక్కినాఁడ,

పొట్లకాయను దియ్యఁబులుసు దప్పళమునకై
తఱుగునకై వడి వీనిఁ దఱిగినాఁడ,
అంటుమామిడిపండు నారగింపునకుఁగాఁ
గోయునకై వడి వీనిఁ గోసినాఁడ,

తే. యాతనల మగ్గు మని వీని యమునియిల్లు
సేర్చితిని ; వీని కిఁక నేమి సేయఁ గలదు?
ఇంతచేఁతయు నాచేతి కించుకేని
యాఁటదాయె నిఁకేమి నా కాట గలదు? ౮౦

[అని ఆలోచించుట నభినయించుచుండును.

బుస్సీ.—హైదర్సాహేబ్, మన మొకటి అనుకొని వచ్చిన, ఇది మఱి యొకటి అయినది. ఇతనిమాటవలననే ఇతఁడు తాండ్రపాపయ్య యని తెలిసినది. ఇతఁడు రాజా వర్ణించినంతకన్న హెచ్చువాఁడుగానే యున్నాఁడు. రాజా చచ్చినాఁడు.

ఉ. స్తంభమునుండి పై కుఱికి దానవుఁ జీలిచి రొప్పుచున్న యా
దంభ మృగాధినాథుని విధంబునఁ బేర్చెడి దుర్నిరీక్ష్యుఁడై,
కుంభిని నేర్చు రుద్రుని విఘూర్ణన తాండవ చండ సంభ్రమా
రంభము నూని చూడ్కికి భరంబగునీతఁడు మర్త్యమాత్రుఁడే!

ఇప్పు డీమహావీరుని ఎంతటివాఁడైనను ఎంద అయినను సమీపించు టెట్లు?

హైదరు.—మాట్లాడకండీ ; ఇనబడితే మనమీదికే వస్తాదు.

పాపయ్య.—నాచేత వీని విజయనగరము కోట నా బొబ్బిలికోట లాగున నేల మట్ట మై, వీని జను లెల్ల మ్రంది, సంజీవిచేత రామసైన్యముం బోలె ఎట్లో మాజనులుమాత్రము అందఱును బ్రదికి, రంగారావు యథా

పూర్వము బొబ్బిలిలోను, చినవేంకటరావు యువరాజుగా విజయనగరములో క్రొత్తకోట కట్టించుకొని అందులోను, ఈ జమీనుల నేలుచున్న, నాపగ తీఱును. [వికవిక అట్టహాసము చేసి] సరిసరి! ఏల యీ కాని తలంపు? మఱి కడుపులోని యీ యాందోళనము తీఱు టెట్లు? ఆ! జ్ఞప్తికైనది! ఆ హైదరుగాని చిత్రవధచేత తీఱును. ఈ నడిమివేరా వాని దండు. దానిమీఁదనే పోయిపడుదునా? [పరికించుట నభినయించి] ఏల? పరంగిదండు తురకదండును నాపైపై వచ్చుచున్నవి? ఇవి బుస్సీ హైదర్ల దండులు గావలయు. ఈ రాణువలు నన్ను గుఱిపెట్ట వేమి? ఆ! తెలిసినది. నావెనుకనుండు తమ స్నేహితునకు రాజునకు వాని దండునకు తగులు నని కావలయు. మఱి యిది నన్ను పట్టుకొన యత్నమా? సాము లగువులు లేవా? ఆహాహా! దండ్లా నాపైకి!

దండు దండు లటంచు గుండె తల్లడ మేల?
కొండంత వామికిఁ గొఱకచ్చు చాలు.
కట్టెమో పులరాశి గగనంబు ముట్టనీ,
చిట్టికి ని ప్పూక కాల్చి సివమాడుఁ బైని.
ముక్కంటి నిటలాన మొలకెత్తు మంటకు
నెక్కువా దేమి యేడేడు లోకాలు? రాతి

[దండు ప్రవేశించును. పాపయ్యవైపు నడుచును.

పాపయ్య.— అహా! ఇన్నాళ్లకు నాచేతికి అతీన యడవినఱికేఁడు దొరకినది. రండోయి మునగాండ్రారా, రండి. [ప్రేవులహారములం జూపుచు] తాండ్ర పాపయ్యయ్యా! మా స్నేహితుఁడు విజయరాముఁడు ఈ మా హారములను దొంగిలించి తమాషాకు తన కడుపులో దాఁచుకొన్నాఁడు; వీనిని నేను గైకొని తమాషాకే అతనిని రాజదండనం బొందు మని యుమాధర్మరాజుకడకు పంపితిని. రండు మీరును పోయి ఆతమాషా చూతురుగాని.

సిపాయీ లందఱు.— [ఒకరికొకరు] తాండ్ర పాపయ్య! పాపయ్య రాజునుసంహరించి ఆవేస మాడుతున్నాడు. మనము రాజుమీదికి వస్తే ఇక్కడ మఱి కోలాగైంది.

[పాపయ్య వారింగూర్చి 'కిల్లల్లల్లా' అని యార్చి, బాహాస్ఫోటనము సేయును. వారు వెఱచఱచుట నభినయించి వెనుకకు విఱుగుదురు.

పాపయ్య.— అయినదా మీపని? సముద్రమును చూడఁగానే మీగుండె బ్రద్దలైనది. అడ్డు ఈఁదఁదెగఁబడువాఁ డెవఁడు? దావాగ్నిం జూడఁగానే శెల్లు పాఱిపోయినవి, దానిని దాఁటిపోవున దేది! పొండి! పిడికెఁడుకూటికై దేహ మమ్ముకొన్న కఱ్ఱ్యాలితిగాండ్రు మీరు. మీ పెండ్లాముబిడ్డల యూసురు నాకేల? మిమ్ము విడిచిపెట్టితిని. ఏమి! వెళ్లరా? ఏమేని దురాలోచన గలదా మీకు? అటయిన నిలువుఁడు, మిమ్ము రూపుమాపెదను. [అని నఱుకఁబోవును. దండు పలాయిత మగును.

పాపయ్య.— మఱి యెట్లయ్యా నా దప్పి తీఱుట? ఆహైదరుగానిం జీల్చి వానిరక్తమును కనులం జూచిననేగాని తీరదే! వానిం గనుట యెట్లు

[అని యరయుచుండును.

ఒక సిపాయి.— [ప్రవేశించి, పాపయ్యం గనకయే వడిగా బుస్సీహైదరులకడకుఁ బోయి]— సలాం బూసీధొరవారికి.

[పాపయ్య వినుట నభియించును.

సిపాయి.— సలాం హైదర్జంగు బహద్దరువారికి. ఆఫిరంగుల్ రాజా మస్సీదికి కాల్చుచేసినవి గావు. తాండ్రపాపారా వంట, దొర అంట; అయనకీ కింద దళవాయంట మిరాల సీతన్నంట. ఆయన మీకీ రప్పించడానికి వాటికి కాల్చినా డంట. పగతేఫు చెయ్యడానికి వెల్లిన రాజాదండూకి నాలుగు వందలమందికి సంపి 'శఖరికాత సావటానికి ఖారణం ఏమి?' అని పాడుచు కొని వచ్చినాడు ఇప్పుడే.—

పాపయ్య.— [స్వగతము] బళి ! సీతన్న నాకన్న ముందే పోయి నాఁడు. ఆహా ! హైదరు ఇక్కడనే దొరకినాఁడు ! బుస్సీ యున్నాఁడు బళి బళీ ! [ప్రకాశము] ఓహో ! బుస్సీదొరగారు ! ఇక్కడికే వచ్చి నారా ! వీరేగదా హైదర్జంగు గారు మాదేశులవీరులు.

బుస్సీ.—సలాంపాపారాయనివారికి. [హైదరు బుస్సీవెనుక కేఁగును.

పాపయ్య.—[లేటాలున సింహము దుమికినట్లు హైదరుమీఁది కురికి మెడను ఎడమచేతం బట్టుకొని ఇవలికి ఈడ్చుకొని వచ్చి] రారా దూదేకుల వాఁడా ? నిన్న ఏకదను. నీవేగదా నాభత్తు మాన్పు మన్నవాఁడవు, కోట వదలి పొమ్మన్నవాఁడవు. నీపద్దు సాధించితివె ! ఓరీ,

శా. నీవేబొబ్బిలికోట వోడవు సుమీ ; నీప్రాణమే రాయఁడో ;
నీ పై ఫుక్కిరి బిక్కిరిం బడుచు గుండె ల్గొట్టుకొ స్తబ్ధమే
తా వాద్యోత్తమ మైన నౌబతగు; హైదర్జంగ, యీ బాకునన్
నీవాద్యంబును జీల్చెదన్; వెలి కదే నీరాయనిం దోలెదన్.

[బాకుత్తి] తలఁచుకో నీసామిని !

హైదరు.—నీవే నా సామి ! శరణు శరణు మహారాజ్ ; రచ్చించు రచ్చించు; సామీ రచ్చించు.

పాపయ్య.—[ఆశ్చర్యముతో] ఓరీ నీచుఁడా ! ఈ టక్కు ఎక్కడ నేర్చితివిరా ! మా రంగారాయని బారిం బడిన యా విజయరాముని భటుల కడ నేర్చితివా ?

బుస్సీ.—రాయనింగారూ, శరణన్న తర్వాత కొట్టుట మీ వెలమ నీతులలో లేదే. కావుఁడు దీనుని.

పాపయ్య.—బుస్సీదొరా, నీవు మిక్కిలి దొడ్డవాఁడవు, మా చిన వేంకటరాయనిం గాచినవాఁడవు; వీనిచే మోసపోయితివి. నీవు తురుపు ఇచ్చిపంపఁగా వేంకటలక్ష్మి సామర్లకోటకుఁ బోవుచు మాలపల్లి కడనుండి మాకు సకలవృత్తాంతములను బారికవాని ముఖమునం జెప్పి పంపినది

సలాము నీకు. నీమాటచే వీనిని నాగూరి వీరాసాహెబు టెక్కెముకకు బలాదూరుగా విడిచి పెట్టితిని. [అని మెడ విడిచి పాఱవైచును.

హైదరు.—[స్వగతము] బతికినాను రా బాబూ!

[అని మెడ తడవుకొనుచు, నిట్టూర్పులు నిగుడ్చుచు, పడియే యుండును.

పాపయ్య.—బుస్సీదొరా, చూచితివా మాబొబ్బిలి వెలమలబీరమును?

బుస్సీ.—చూచితిని, అనుభవించితిని, మెచ్చితిని.

పాపయ్య.—విజయరాముఁడు పందయని కనుఁగొంటివా?

బుస్సీ.—నూఱు మార్లు.

పాపయ్య.—ఇఁక నాకిక్కడ పని లేదు. నేను త్వరగాపోయి రంగారావును నాకేల కబురు పంపలేదో అడుగవలయును.

బుస్సీ.—ఆతఁడు పంపినాఁడు. జాబులం దెచ్చు హర్కారులను రాజుపట్టించినాఁడు. వారు కోరి వచ్చినంతట ఆజాబులం జైకొన్నాఁడు.

పాపయ్య.—కబురంపియు నేను రాలేదని రంగారాయఁడు నామీఁద కోపగించుచుండును. నేనుపోయి యీసమాధానమును చెప్పఁ గోవలయును.

బుస్సీ.—బాలుని తక్తు ఎక్కించి నీవు మంత్రివిగా జమీ నేలించుచుండవలయు నని నాప్రార్థన.

పాపయ్య.—ఆపని నీలాద్రిరాయఁడు కావించును. నేను నాకు ప్రేతపిండము వైచుకొంటిని; ఇఁక నీలోకమున నుండఁజనదు. నేను పోయి విజయరామునికడనే పరమపదించెద. వీఁడం దన్నియు వచ్చి చూచునపుడు, రాజుం జీల్చిన పులి యిది యని తెలియవలదా?

[అని తటాలున నిష్క్రమించును.

బుస్సీ.—హైదర్సాబ్, రాజరథచిత్రమును చూచి వత్తము రా.

హైదరు.—మీరుపోయి చూడండి, కడుపునిండా చూస్కొని రండి, నేను రాను. అక్కడ పాపయ్య ఇంకా పొడుచుకొన్నాఁడో బతికే

వున్నాడో? ఈతూరి ఆయన నామెడకాయకి నులిమితే, నేను బతకడం అబద్ధం.

బుస్సీ.—ఆటయిన నేను మాత్రమే పోయి చూచివచ్చెదను.

[అని నిష్క్ర.

హైదరు.—అబ్బా; మెడ పడిపోయిందిరా, నాయుద్ధభాగ్యం అంతాచితికి పోయింది. [అని మెల్లగా కష్టముతో లేచి] ఇప్పటికి నాకు పానం దక్కింది, లక్షవరహాలు మునిగి పోయినయి.

[అని నొప్పి నభినయించుచు, కుంటుచు నుండును.

బుస్సీ.—[ప్రవేశించి] హాహాహా ! ఏమి ఘోర కథ !

శా. వేలున్ లక్షలు మాంసరాసులు నభోవీథిన్ మహావిస్ఫురీన్
గ్రాలన్, భుక్తికిఁ గూరుచుండె, మునుపెన్నో ధ్యానమందున్న పే
తాలుండోయన, రాజమాంసఖల పుష్టిప్రీతి బప్పానునా
భీలుం, డాత్మహతుండు పాపయుతుఁ డుర్కాపీతుఁడై నగ్రక్రొన్నై.

[నేపథ్యమున కలకలధ్వని - ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి]

బుస్సీ.—ఇది, ఓహో. ఆనందరాజా పట్టాభిషేకముకై వచ్చుచున్న కలకలము గావలయును. హైదర్, మనము పోయి ఈతనివలన మనకు రావలసిన పేష్కస్సుల నిక్కడనే పుచ్చుకొందము. ఈతఁడు మరల విజయనగరముకోట చేరెనా, మనకు పైకము ముట్టదు.

హైదరు.—అలాగే చేద్దాం. [స్వగతము] ఈగంధర్గోళంలో నా లక్ష మునిగిపోయింది. [అని అందఱు నిష్క్రమింతురు.

---

# దశమాంకము.

స్థలము:—గోలకొండ నైజాము దర్బారు.

[నైజాము, వజీరు, బక్సీదారు, హసేనాలీ, పరివారంబును యథోచితము ప్రవేశింతురు.]

నైజాము.—నిన్న సైదరును శిక్షించిన యాగ్రహములో అడుగనైతిని. హసేనాలీ, ఇరువురు సర్దారులు గతించిన యీ రణములో నీ వెట్లు బ్రదికి వచ్చితివి?

హసే.—మహాప్రభూ, నేను రాయనివారి పక్షముగా వాదించినందున నన్ను యుద్ధము చేయుటకు హైదర్జంగు నిలిపినాడు.

ప్రతీహారి.—[ప్రవేశించి] బందగానే ఆలీ; నిన్న నే తెలుపుచేసుకొన్నవారు బొబ్బిలిరాజాగారి కుమారుణ్ణి తోడ్కొని నీలాద్రిరావు గారూ దాడి వచ్చి వున్నారు.

నైజాము.—ఓహో! సమయానకు వచ్చినారు. తత్క్షణమే తోడ్కొనిరా?

ప్రతీ.—[నిష్క్రమించి తోడ్కొని వచ్చి] వారే గోలకొండ పాదుషాగారు. ఖూర్నిషు సలాములు చేయండి. [అని నిష్క్రమించును.

[ముగ్గురు మోకాళ్ళమీద నిలుతురు.

నీలాద్రి.—బందగానే ఆలీ, మీగులాముసు, సామర్లకోట నీలాద్రి రాయుడను సలాము చేయుచున్నాను. [అని సలాము చేసి, చేతులు జోడించుకొని బాలుంగూర్చి] బాబూ నీవు చెప్పు.—"నేను పాదుషాగారి గులామను, బొబ్బిలి రంగారాయనింగారి కుమారుడను, చినవెంకటరాయుడను. సలాం చేయుచున్నాను" అని.

బాలుడు.—నేను పాదుసాగారి గులామను, బొబ్బిలి రంగారాయని వారి కుమాలుదను, చినవెంకటలాయుదను, తలాము చేస్తున్నాను.

నీలాద్రి.—బాబూ; ఇట్లు సలాము చేయుము. [అని నేర్పును.

[బాలుఁడు సలాము చేసి చేతులు జోడించుకొని యుండును.

దాది.—నేను రంగారాయనివారి జనానా దాసిని, ఈ చిన్నబాబుగారి చిన్నదాదిని, వెంకటలక్ష్మిని. [అనిసలాము చేసి చేతులుజోడించుకొనియుండును

సైజాము.—నీలాద్రిరావుగారూ, మాకు బుస్సీగారివలన బొబ్బిలి వృత్తాంతమెల్ల తెలిసియున్నది. మీరు వచ్చినపని సంగ్రహముగా చెప్పుకొండి.

నీలాద్రి.—ఆ టయిన మాపిర్యాదు కరము సంక్షిప్తమైనది. ధర్మరక్షకా, హైదరుజంగు చేసిన ద్రోహమువలన బొబ్బిలిగడ్డలో మిగిలిన మగపురుగు ఈ శిశువు ఒక్కఁడే! స్త్రీలలో వీనిం బాయని యీదాదియొక్కతె మిగిలినది. వీని నోటిముందఱ, సర్కారు పెట్టిన కున్నమును, బొబ్బిలి జమీనును, విజయనగరము దొర ఆనందరాజు అపహరించినాఁడు. ఈ బాలుఁడు, హుజూరునకు, వంశక్రమాగతుఁడు, గులాము; వీనికి అన్నము పెట్టుము భూలోక దేవేంద్రా.

సైజాము.—బాలుని రక్షించెదము. ఆదుష్టుని హైదరును దండించెదము. లెండు కూర్చుండుఁడు.

[నీలాద్రిరావును బాలుఁడును లేచి కూర్చుందురు.

సైజాము.—[సభ్యుల నుద్దేశించి] నిన్న వానిపైఁ గలిగిన యాగ్రహములో మిమ్ము అడుగలేదు; ఇపుడు, చెప్పుఁడు: వానికి విధించిన దండన రాజధర్మసముచితమా గాదా?

వజీరు.—బందగాని ఆలీ, అంతకన్న న్యాయ మయిన దండన యుండునా; బొబ్బిలి మహావీరులను హుజూరువారి రాణువను నాశముచేసి నందులకు వానికి ఉరి దండన. వాఁడు లంచము గొని, సర్కారు పైకము పోఁగొట్టినందులకు ఇప్పటివఱకు వాఁడు లంచాలచేత చేర్చిన లక్షోపలక్షల ధనమెల్ల సర్కారు ఖజానాకు దాఖలు. మఱి విశేషము. వాని కుటుంబమునకు, యావజ్జీవము, జీవనాంశము. ఇంతకన్నను ధర్మముండునా?

నైజాము.—విజయరామరాజామీఁదికి కత్తి దూసిన బాలుఁడు ఇతఁడే?

బుస్సీ.— ఔను సర్కార్;

నైజాము.—ఏమి బాలకా, అట్లు చేసితివా?

బాలుఁడు.—మా బాబును చంపించిన వాన్ని నేను కొత్తాద్దా?

నైజాము, వజీరులు.—[హర్షముతో] అరరే! అరరే!

నైజాము.—మఱికొట్టితివా?

బాలుఁడు—ఈ బూచీవాగ అడ్డపడ్డాడు అందుకోసం కొత్తలేదు.

నైజాము.—ఆయన పెద్దవాఁడే నిన్ను పొడిచిచంపిన నీ వేమిచేయుదువు?

బాలుఁడు.—చావంతే భయమా? చావుకి భయపడ కూడదని మా వాల్లందఱు చెప్తారు. చంపేస్తే మా బాయ్యకాడికే వెల్తాను. అది నాకు యిష్టమే గదా!

అందఱు—అరరే! అరరే! బాపురే. బాలకా!

బుస్సీ.— మహాప్రభూ; ఈ దాదియే తన చేతినుండి యీ బాలుని హరింపవచ్చిన వారిని మన సిపాయీలను నాలుగురను పరిమార్చినది.

నైజాము, సభ్యులు.—బలారే! బలారే! ఏమి వీరభూమి ఆగడ్డ!

నైజాము.—లే దాదీ. లే. నిన్ను మెచ్చినారము.

వెంకట.—ధర్మరక్షకుని కటాక్షము. [అని లేచి నిలుచును.

నైజాము.—దివాన్ బహద్దర్ ఓరాగ్రాం గారూ—కుమారునికి సర్వము యథోచితము జరుపునట్లుగా ఇపుడు ఉత్తర సర్కారులకు దొరలైన యింగ్లీషువారి గవర్నరుగా మదరాసురాజధానిలో నేలుచుండు దొరగారికి మాసిఫారసును జాబువ్రాయుఁడు. ఆ జాబును ప్రత్యేకముగా రవానా చేయుఁడు. దానినకలును వీరికిపుడు మేమిచ్చిన ఫర్మానాగా మాసికాము హారులనుం బొందిరచి, సవారిలో ఉంచి దానిని, ఇంక ఈచిన రాజావారికి మేమిచ్చినవిగా అనర్ఘ్యములైన మహారాజోచిత దివ్యభూషణములను ఒక

కత్తులాని తేజీని, ఢంకాను, మేళతాళములతోఁగూడ వారి సవారివెంటం గొనిపోయి వారిబసలో చేర్పుఁడు. నీలాద్రిరాయనింగారిని మాగొప్పసర్దారులకుందగిన మరియాదలతో సత్కరింపుఁడు. బాలుని గాచుటచేత మాకు గొప్పమెహానత్తు గావించిన ప్రభుభక్త శేఖరమణి వెంకటలక్ష్మిచేతికి నవరత్నఖచితమయిన జాలువాపసిఁడితోడా తొడుగుఁడు.

టోగ్రాలీ.—[లేచి] సర్కారాజ్ఞ. [అని కూర్చుండును.

నైజా.— మూసేవాలీ, నీవు వీరితోఁ గూడఁ బోయి, మాఫర్మాను బొబ్బిలిలోను, విజయనగరములోను, ప్రకటించి, ఈ రాజావారిని బొబ్బిలి జమీనులో కుదుగు పఱిచి, రమ్ము.

మూసేవాలీ.—(లేచి) సర్కార్ ఆజ్ఞ. [అని కూర్చుండును.

నీలాద్రి, దాది.—మహాప్రసాదము, మహాప్రసాదము.

నీలాద్రి.—బాబూ, 'మహాప్రసాదము' అని చెప్పుము.

బాలు.—మహాప్లసాదము.

[నౌకర్లు పళ్లెములో రత్నాల కటారి పన్నీటి కూజాయును తెచ్చి నైజాముకడ నిలుతురు.

నైజాము.—కుమారా, చినవెంకటరాయా, ఇటు రమ్ము.

[బాలుఁడు పోయి మెూఁకరించి నిలుచును.

నైజాము.—ఇది మేము మాచేతితో నీ కిచ్చిన యినాము. (అని కటారిఇచ్చి, పన్నీరు చల్లి) పోయి కూర్చుండుము.

బాలుడు.—మహాప్లసాదము.

[అని సలాము చేసి పోయి కూర్చుండును.

[నైజాముకనుసన్న చేత దివాను నీలాద్రిరావునకు పన్నీరు చల్లును.

నీలాద్రి.—మహాప్రసాదము, మహాప్రసాదము !

నైజాము.—ఆదాదియును వీరులలో గణన కెక్కినది. ఈబాలుని కిది తల్లికన్న ఎక్కువ. బాలునిం గాపాడినందున మాకు చాల మెహానత్తు చేసినది.

[అని హానేసాలీకి కనుసన్న చేయును.
హానేసాలి దాదికి పన్నీరు చల్లును.

దాది.— మహాప్రసాదము, మహాప్రసాదము !

హైజాము.— నీలాద్రిరావుగారూ, మీకోరిక తీరినదా ? ఇంక నే మయినం జేయవలయునా ?

నీలాద్రి.—

ఉ. వేంకటరాయనిన్ నిసుఁగు వేకయికొంటిరి తల్లిదండ్రులై ;
యంకిలి యైన ద్రోహి తెగటాఱెను ; వీరులు పద్మనాయకుల్
బొంకరు కొంక రార్తులను బ్రోతు రటం చెద మెచ్చుకొంటిరే,
యింకను నేమి గోరుదు నహీనశయాన సమాన తెల్పుఁడా.

అయిన నిది యగుఁ గాక !

(భరతవాక్యము.)

శా. సర్వజ్ఞాంకిత సింహరాట్ప్రభవ వంశ ప్రాజ్యముక్తామణుల్
గర్వోన్నద్ధ సపత్నభూమిధర పక్షచ్ఛేద నాఖండలుల్
ఉర్విం బ్రోతురు గాత శేషఫణిబాహుల్ నిచ్చలుం బోషితాం
తర్వాణీంద్రులు పద్మనాయకులు పద్మానాయకప్రాభవుల్. ౮౬

[అందఱు నిష్క్రమింతురు.

బొబ్బిలియుద్ధనాటకము సమాప్తము.

---

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్

4. మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మదరాసు

అర్డరుతోకూడ అడ్వాన్సు పంపవలెను, తపాలుచార్జి ప్రత్యేకము.

## సంస్కృతగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథవ్యాఖ్య, తెనుఁగున సంపూర్ణ ప్రతిపద టీకాతాత్పర్య పదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు | 2 | 8 |
| రఘువంశము, మొదటి 6 సర్గలు పైదానివలెనే టీకాతాత్పర్యములు | 3 | 0 |
| కుమారసంభవము, మొదటి ఆఱుసర్గలు, పైదానివలెనే ... | అచ్చులో | |
| అమరుకావ్యము, శృంగారలక్ష్యము, వేమభూపాలవ్యాఖ్య సంపూర్ణాంధ్రటీక, క్రొత్తయచ్చు ... | 2 | 0 |
| రసమంజరి, శృంగార రసస్వరూపవిస్తరము, సటీక క్రొత్తయచ్చు | 2 | 0 |
| పంచతంత్రము, మూలముమాత్రము ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, మూలముమాత్రము ... | 1 | 0 |
| హితోపదేశము, ,, ... | 1 | 0 |
| ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి, తెనుఁగు టీకాతాత్పర్యములు గద్యపద్యములుగా ఆంధ్రీకరణము ... | 1 | 0 |

## ఆంధ్రగ్రంథములు

| | | |
|---|---|---|
| శృంగారనైషధము, సర్వంకషావ్యాఖ్య, ఆర్టుపేపరు | 25 | 0 |
| ఆముక్తమాల్యద, సంజీవనీ వ్యాఖ్యతో ... | 15 | 0 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి, సటీక ... | 3 | 0 |
| జ్ఞానవాసిష్ఠ రామాయణము, వేదాంతము, మడికిసింగనకవి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, మూలము ... | 0 | 8 |
| పారిజాతాపహరణము, ,, ... | 0 | 8 |
| సారంగధరద్విపద: కవి బాణాలశంభుదాసు, విశ్వకర్మమతస్థుఁడు | 0 | 8 |

అక్కన్న మాదన్నల చరిత్ర రు 2-0-0

| | | రు. | అ. |
|---|---|---|---|
| పద్యకథాలహరి, ప్రాచీన గ్రంథములనుండి సంగ్రహింపఁబడిన చిన్నపద్యకథలు. | ... | 0 | 12 |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రతాపరుద్రీయ నాటకము | 3 | 0 | బొబ్బిలి యుద్ధనాటకము | 2 | 8 |
| ఉషానాటకము | 1 | 8 | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 1 | 8 |
| విక్రమోర్వశీయనాటకము | 2 | 0 | మాళవికాగ్నిమిత్రనాటకము | 0 | 12 |
| ప్రియదర్శికా నాటిక | 0 | 12 | శ్రీకృష్ణరాయవిజయనాటకము | 0 | 8 |
| రత్నావళీనాటిక, శ్రీధరణికోట వేంకటసుబ్బయ్యగారి వ్యాఖ్యతో | | | | 1 | 8 |
| ఉత్తరరామచరిత్రనాటకము, శాస్త్రిగారి పీఠికతో ... | | | | అచ్చులో | |

## కథలు-సులభవచనగ్రంథములు. (నాండీలెయిల్లు)

| | | | |
|---|---|---|---|
| భోజకాళిదాసకథలు అప్పూవ్ డు iii, iv ఫారములకు | ... | 0 | 12 |
| విక్రమార్కునియద్భుతకథలు ,, iv, v ఫారములకు | ... | 0 | 12 |
| ఉదయనచరిత్రము ,, డిటో | ... | 0 | 12 |
| బేతాళపంచవింశతిక | ... | 0 | 12 |
| ఆంధ్రహితోపదేశచంపువు | ... | 1 | 8 |
| కథాసరిత్సాగరము 6 భాగములు | ... | 15 | 0 |
| ,, ఒక్కొక్కభాగము ప్రత్యేకముగా | ... | 2 | 8 |

## లక్షణగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, ఉదాహరణశ్లోకములతో క్రొత్తయచ్చు | | 6 | 0 |
| కావ్యాలంకారచూడామణి, 9 ఉల్లాసములు పూర్తి | ... | 1 | 8 |
| అలంకార సారసంగ్రహము, సటీకాతాత్పర్యము | ... | 0 | 12 |
| ఛందస్సు, సులువు, సంగ్రహము | ... | 0 | 4 |

శాస్త్రిగారి విమర్శలు - ఉపన్యాసములు రు. అ.

గ్రామ్యభాషా ప్రయోగనిబంధనము, నాటకముల పాత్రోచితభాషను గురించినది ... 0 12

ఆంధ్ర వ్యాకరణ సర్వస్వతత్త్వము ... 1 0

విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యములను గురించినది 0 12

తిక్కనసోమయాజి విజయము, జీవితచరిత్ర విమర్శ ... 0 8

భారతాభారత రూపకమర్యాదలు (ఇందు నాటకళ-దాని చరిత్రము, లక్షణము మొదలైన విషయములు గలవు) ... 0 6

ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకారలేశము ... 0 6

గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్య గ్రాంధిక వాదములను గురించినది. అన్నిజిల్లాల వ్యావహారిక భాషలను వర్ణించియున్నారు. కడుపుబ్బ నవ్వించు విమర్శ ... 0 6

విసంధివివేకము ... 0 2

స్త్రీ పునర్వివాహ గ్రంథము ... 1 0

ఆంధ్ర భాషాసర్వస్వార్హ నియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

---

చరిత్రరచన (మొదలైన చారిత్రకవ్యాసములు) ప్రథమభాగము, ఆంధ్రులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు మొదలైనవారి చరిత్రములు చక్కఁగా వివరింపఁబడియున్నది. యూనివర్సిటీ విద్యార్థుల కుపయోగకరము. నేలటూరి వెంకటరమణయ్యగారిది ... 2 0

మధుమావతి మొదలైనకథలు నాలుగుకథలు చరిత్రాత్మకములు గలవు. 1. మధుమావతి ప్రతాపరుద్రుని వేశ్యయైన మాచల్దేవి చెలికత్తె. ఓరుగంటి ముట్టడిలో నీమె తురకలకు పట్టుబడిచేసిన చమత్కారకథ 2. ప్రతీకారము, మధురను పాలించిన సుల్తాను హిందూస్త్రీని చెఱపట్టఁగా నామె కసిదీర్చుకొనినకథ, 8. కంపిలిరాయలు. విజయనగర సామ్రాజ్యస్థాపనమునకు పూర్వము కంపిలిరాజ్యమును తురకలు కూల్చిన కథ. 4. ఛత్రగ్రాహి, కృష్ణదేవరాయలగొడుగు మోపరి, పోలఁడు, ఒకదినము రాయసింహాసన మెక్కిన విచిత్రకథ. నేలటూరు వెంకటరమయ్యగారిది 2 0

రు. అ.

By Dr. N. Venkataramanayya, M.A., Ph D.

*Kampili & Vijayanagara* 2 0

*Eastern Chalukyas of Vengi* 15 0

శ్రీ ప్రొఫెసర్ T. M. శేషగిరిశాస్త్రిగారి గ్రంథములు

ఆంధ్రశబ్దతత్త్వము TELUGU PHILOLOGY. ఇందు ఆంధ్ర వ్యాకరణము సంపూర్ణముగా కలదు. అరవము, కన్నడము, మలయాళము మున్నగుభాషలతో తెనుఁగునకుఁగల సంబంధము చక్కఁగ వివరింపఁబడియున్నది. తెలుఁగు పైలాలజీవిద్యార్థుల కుపయోగకరము. 2 భాగములు ... 8 0

అర్ధానుస్వార తత్త్వము, పైదాని కనుబంధము ... 0 8

*Notes on Aryan & Dravidian Philology* by the late Professor T. M. Seshagiri Sastriar. Old Copy Reduced Price 2 0

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము— 25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలిక పండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగారెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము. కర్త : శాస్త్రిమనుమఁడు. 2 0

*A Hand-book of Classical Samskrit Literature* for College Students, with questions and a Chronological Chart by U. Venkatakrishna Rao, M. A. 2 0

*Notes on the Study of the Preliminary Chapters of the Mahabharata* by Vedam Venkatachellam Garu B.A., B. L. 5 0

# వ్యామోహము

సాంఘికనాటకము.

రచయిత: వేదము వేంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ.
శాస్త్రి మనుమఁడు

ఇందలి స్త్రీపురుషులు—ఇరువురుస్త్రీలు, ఆఱుగురుపురుషులు, ఒక పిల్లవాఁడు. పదునెనిమిది దృశ్యములు, క్రౌనుసైజు 84 పుటలు, 2½ గంటల కాలములో ప్రదర్శింపవచ్చును.

వెల అణాలు 12

**దీనిపై ఒకకొన్ని పండితాభిప్రాయములు**

(1) కిన్నెరపత్రిక-అక్టోబరు 1952

ఈనాటకం ప్రదర్శన యోగ్యంగా పద్దెనిమిది రంగాల్లో రచింపబడినది. పాశ్చాత్య వేష భాషా వ్యామోహంలో మునిగి, తాను ధర్మం తప్పినా, తనదే న్యాయమని వాదిస్తూ మొండిపట్టు పట్టి కూర్చున్న కుటుంబరావనే పట్టభద్రుడిని భ్రమలోంచి ప్రమలోకి లాక్కువచ్చి ఒక సత్కుటుంబిని చేసినకథ యిందులో వుండడంవల్ల దీని కీపేరుపెట్టబడింది ...

... ఇది సాంఘికనాటకం కావడంవల్ల పూర్తిగా వ్యావహారిక భాషే వాడబడినది. కొన్ని పాత్రలు ఆంగ్లవిద్య నభ్యసించిన వారగుటచే వారి మాటల్లో ఇంగ్లీషు పదాలు వాక్యాలు తరచు దొర్లించడం చాలా స్వభావసిద్ధంగావుంది. అన్ని తెలుగుజిల్లాలవారితోనూ పరిచయం ఉండడంవల్ల శ్రీ శాస్త్రిగారు వాడినభాష ఒక ప్రత్యేకమండలానికి చెందకుండా సర్వసామాన్యంగా అందరూ అర్థంచేసుకోనే స్థితిలో ఉన్నది. ఇట్టి వ్యావహారికభాషలో వ్రాసినగ్రంథాలు అందరికీ అర్థంకాగలవంటూ ఈనాటకమే తెలియజేస్తుంది. వేలు అనే కుఱ్ఱవాడికి సెంట్రల్ స్టేషను కూలివాడికి అసలైన మద్రాసు తెలుగు వాడబడినది. ఆమాటల్లో హాస్యం నాజూకుగా వుండి నవ్వుకలిగిస్తున్నది. మద్రాసు కూలీలమోసం చక్కగా నిరూపింపబడినది. అక్కడక్కడ ప్రదర్శనానుకూలంగా పాటలూ కూర్చబడ్డాయి.

...నీతిబోధ... నాటక ప్రయోజనం ఇందులో వ్యంగ్యంగా సున్నితంగా బోధింపబడినది-వేషంలో ఏమీ లేదనీ, సత్ప్రవర్తనే ప్రధానమనీ.

శ్రీ ... శాస్త్రి గారు ఆంగ్లంలోనూ ఆంధ్రంలోనూ పండితులూ, కవులున్నూ. వీరు నాటకాలు వ్రాయడంలో తృప్తిపడకుండా - వాటిని ప్రదర్శించి, రక్తి కట్టించిన నటకులు, నాటక కళాభిజ్ఞులు. ఇట్టివారి రచన ప్రదర్శనానికి చాలా అనుకూలంగా ఉంటుందని వేరే చెప్ప నక్కరలేదు.

బులుసు వేంకటరమణయ్య.

(2) " వికుగు రహితం
వినోద సహితం
విజ్ఞాన మహితం, ఈ నాటకం
సర్వదేశ సర్వకాల ప్రశస్తి నందును గాక."

నేలటూరు భక్తవత్సలయ్యంగారు M. A, B. O. L.

ఆంధ్రాధ్యాపకులు, వివేకానంద కళాశాల, మద్రాసు.

(3) ఆంధ్రప్రభ. 11-9-1952 ఆదివారము.

ఇందలి కథావస్తువు...సంభాషణలు నడపడంలో రచయిత చాతుర్యంవల్ల ఎక్కడికక్కడ మంచి పట్టుగా ఉంటుంది. ప్రదర్శన యోగ్యములైన సాంఘిక వినోదనాటకాలలో ఇదికూడ ఒకటి అని చెప్పడానికి సందేహం అక్కరలేదు—భానుడి.

(4) జమీన్‌రైతు 21-11-52

...పాత్రనిర్వహణంలో ఔచిత్యం బాగాపాటించబడింది. కథాగమనంలోగూడా సాఫీగావుండి. ఆతురత (suspense) కలిగించేదిగా ఉన్నది. సంభాషణములలో పాత్రోచితభావమైన శిష్టవ్యావహారికం వాడబడింది. రచయిత తనతాతగారు పూజ్యపాదులు కళాప్రపూర్ణ శాస్త్రిగారి సిద్ధాంతాన్ని అనుసరించారు.

...తగినంతపాళ్లలో హాస్యరసంకూడా పోషింపబడినందువల్ల ఈ నాటకాన్ని ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు ఆనందిస్తారని చెప్పటానికి ఏలాటి సంకోచం అవసరంలేదు.

Research Scholar గా ప్రసిద్ధికెక్కిందిసా నాటికా కర్తగా కూడా కృతకృత్యులైనారనే చెప్పాలి.

కె. పి. నారాయణరావు, బి. ఎ. బి. ఎల్.

*5. Indian Express 21-9-'52*

This is a social play with a well-known theme. The hero of the play who is an educated youth dislikes his wife whom he married when both of them were pretty young, on the pretext that she is illiterate and does not measure upto his standards of 'civilisation' and 'social graces'. All efforts at amicable settlement fail, while Parijatam an educated friend of the victim Susila evolves a stratagem. She makes Susila to put on the role of a highly educated society Lady. The unsuspecting husband without knowing it makes love to the 'lady' and finally marries her only to discover to his horror, which later turns to pleasure that it was his own old wife.

The theme is as old as the hills but its dramatisation is very interesting not only to read but also to put on boards with its lively conversation and well-kept up continuity and suspense.

—*Bhanuji.*

*6. The Madras Mail.*

This is a short social play in Chaste prose in Telugu...... Though the theme is a simple one the play is enjoyable; it depicts the trials, the sorrows and joys of Hindu social life.

*7. Prof: G. V. Subbaramayya, M. A., L. T.,*
*Head of the Dept. of English, V. R. College, Nellore.*

It is an exquisite satire on the fashionable young gents of the present day. The plot is well constructed and characterisation is simple and clear. The dialogue is noteworthy in one respect. Just as your grand-father of Immortal memory specialised and excelled in the Muslim colloquial Telugu, you have experimented in the colloquial Telugu of the English-educated with success. Your tamilised Madras Telugu is also quite appreciable. I particularly appreciate your reference to proffessors, who resort to manuscript eloquence. I wish you more and greater success in works on the same line,

*8. Sri. N. Venkata Rao, M. A.*
*Head of the Dept. of Telugu, Madras University.*

It is really an excellent piece of Dramatic art. It is far above the level of the innumerable social plays now current and I read the work with great pleasure. I am exceedingly glad that you are both a finished actor and a creative artist. I wish to see that the play is enacted once as I do not know whether it is enacted before.

I appreciate very much the psychological treatment and the characterisation of the play as well as the language with a sprinkling of good humour. I hope you will produce more works of this nature in future and maintain the tradition of your grandfather, the most original creative Dramatist of modern times.

*9, The Hindu, 16-11-'52.*

This is a social play written on a modern theme with an ultra-modern youth, Kutumbarao, as the hero, and his orthodox wife Susila as the heroine. The English-educated Kutumba Rao has a glamour for western fashions and disregards his wife, who is a faithful and devoted woman. Miss Parijatam, a social welfare worker, intervenes and changes the old fashioned Susila into a modernist. The plot is woven so dexterously that Kutumba Rao is unaware of this fact till the end. The hero falls in love with the newly fashioned Susila, thinking that she is a different lady, and marries her. It is only in the end that he realises that he has remarried Susila, whom he had ignored. The style is unaffected and natural and the situations are quite dramatic. The author has inherited the dramatic genius of his grandfather the late *Venkataraya Sastrulu* one of the most original creative dramatic artists of modern times. He is to be congratulated on his excellent production.

**Vedam Venkataraya Sastry & Bros,**
*Mallikeswarar Koil South Lane,*
*Linghi Chetty Street, G. T. Madras.*

